# శ్వాస్

# మింట్స్




అమృతాంజన్ లిమిటెడ్

వారి మరొక గొప్ప తయారి

**Amrutanjan Limited** 

# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

సంపుటము : 65 | అక్టోబరు 1988 | సంచిక : 10

విడిపత్రిక వెల ఐదు రూపాయలు


## విషయానుక్రమణిక

అక్టోబరు - 1988

# స్వవిషయం

శ్రీయుతులు కాళిదాసు, నిఖిలేశ్వర్, లీలామోహనరావు, గోదావరిశర్మ మొదలయినవారి పద్యాలు ఈ నెల భారతిలో ఉండటం చదువరులకి సంతృప్తి కలిగించగలదని ఆశిస్తున్నాము.

"భావ కవిత్వంలో స్త్రీ" వ్యాసంలోని వస్తువు పాఠకులలో ఆలోచనలని రేకెత్తింప చేసేట్లు చేసి చర్చకి అవకాశాలు కల్పించ గలదు.

డాక్టర్ బ్రహ్మానందగారి వ్యాసం భారతిలో సాధారణంగా పడే కొన్ని రచనల స్థాయి కలదే. పండితుల దృష్టినే కాకుండా ఇతరుల దృష్టిని సయితం ఈ వ్యాసం ఆకర్షించగల దనటంలో సందేహం లేదు.

శ్రీ రవికుమార్‌గారు మరొకసారి కవిజనాశ్రయ కర్తృత్వాన్ని పరిశీలించారు.

తిరుపతి వేంకట కవులని గురించి ఈ నెల భారతిలో రచన పడటం ఒక విశేషం!

చాళుక్యుల, విష్ణుకుండినుల వంశావళిని తులనాత్మకంగా పరిశీలిస్తూ శ్రీ కృష్ణమూర్తిగారు ఒక వ్యాసం రాశారు. -ఇది చరిత్ర విద్యార్థులని ఆకర్షించగలదని ఆశిస్తున్నాము.



# పంచమాశ్వాసము

శ్రీ వజ్ఝల కాళిదాసు

షాయాంబరాలు
ట్టుకున్నంత మాత్రాన
లేదు సన్న్యాసి
్యాసము కావాలి
తని జీవితం – సత్త్వంలో సత్యంలో

ర్ణం కావాలి సువర్ణం
ర్గం పొందాలి అపవర్గం
ాతుర్వర్ణ్య వ్యవస్థలో
తుష్పాత్తుల కన్నా హీనంగా
ంచరిస్తున్నాం మనం !

ర్ణ పంచకాలనీ
ర్గ సహస్రాలనీ
ంచజనుడు నేడు
ంచుతున్నా డంతటా
ంచిస్తున్నాడు లోకాన్ని

పంచగుప్తంలాగే
కుంచించుకు నడుస్తున్నాడు, కానీ
పంచనఖిలా పట్టు పట్టి
పంచనఖంలా స్వసంతతినే
పంచ భక్ష్య పరమాన్నాలుగా భక్షిస్తున్నాడు.

పంచమ వర్ణాన్ని సృష్టించి
పంచాస్యంలా నిలిచి
మానవత్వాన్నే మరచి
దానవుడై దైవానికి
పంచ బంగాళం చేస్తున్నాడు .

పంచసహస్ర వర్షప్రాయపు కలియుగం యిది
పంచుతాం నీకు పరమార్థాలని
వంచిస్తున్నారు కుహనా సంస్కర్తలు నిన్ను
పంచదశిగా రూపందే
పంచమాశ్వాసం సుమీ ఇది !

---

1988

డా|| శివలెంక ప్రకాశరావు

# భావకవిత్వంలో స్త్రీ

పూర్వాంధ్ర కావ్యాలలో శృంగార రసానికి అంగిరస స్థాయి కల్పించడంతో ముఖ్యంగా స్త్రీ అంగాంగ వర్ణనలు, సంయోగ శృంగారావస్థలు చాలా ఎక్కువగా గోచరిస్తాయి. సౌందర్యం కృత్రిమతకు లోనయింది. మగువ రూపం కచకుచాది వర్ణనలతో ఆచ్ఛాదితమైపోయింది. శృంగారం రాణివాసాలలో గడ్డకట్టింది. పాత్ర చిత్రణం దివ్యాలకూ దివ్యాదివ్యాలకు మాత్రమే ఎక్కువగా పరిమితమయింది.

అయితే పూర్వాంధ్ర సాహిత్యానికి ప్రతిక్రియగా ఆరంభమైన భావ కవితోద్యమంలో ఈ స్థితి చాలా మార్పు వహించింది. ముఖ్యంగా భావకవులు స్త్రీని మాతృపీఠాన అధివసింపచేశారు. భావకవి స్త్రీ పట్ల కేవలం ఒక కాముకుడిగా ప్రవర్తించడు. బాహ్య సౌందర్యాన్ని కాక అంతస్సౌందర్యాన్నీ, ఆత్మగుణ వైశిష్ట్యాన్నీ పరిగణిస్తాడు. స్త్రీ కూడా అబలా సమ్మితంగా పురుషుడికి పుత్రభావాన్నే ఉపదేశిస్తుంది. కాబట్టి భవభూతి ఆశించిన 'సుమానుష ప్రేమ'నే ప్రాప్యంగా భావించి స్త్రీని ఆరాధించాడు భావకవి. సంయోగ శృంగారానికి కాక వియోగ శృంగారానికే ప్రాముఖ్యమిచ్చాడతడు. చక్షుః ప్రీత్యాదులతోనే సంతృప్తిపడి అయోగ వియోగ స్థితులనే స్వీకరించాడు. హృదయానందాన్నీ, ఆత్మతేజాన్నీ ఇచ్చే స్త్రీ మూర్తిమత్వానికి ప్రాముఖ్యమిచ్చాడు. స్త్రీని ఒక క్రీడాకందుకంలా కాక సఖిగా, ప్రేయసిగా, దేవిగా, సాక్షాత్ ఈశ్వరిగా, జగదీశ్వరిగా సంభావించాడు. వనితను వంటఇంటి కుందేలుగా, పిల్లలను కనే ఒక యంత్రంగా కాక మృత్యువును సైతం జయించే ఒక శక్తిస్వరూపిణిగా తీర్చిదిద్దాడు భావకవి.

స్త్రీ పురుషుల మధ్య ఉన్న ప్రేమ పరస్పరం భరిస్తుందని దినదినాభివృద్ధి కాంచుతుందని భావకవుల విశ్వాసం. అదే వీరి కవిత్వంలో జీవనాడి. అందుకే వియోగ దుఃఖం సంభవించినా అది తాత్కాలికమని భావించి, ఆశతో ఆ ప్రణయదేవత కోసం తపించారు, పరితపించారు భావకవులు. నిజానికి సౌందర్యోపాసనలో, ప్రణయారాధనలో ఉన్న సంపూర్ణ మాధుర్యాన్ని చూరగొన్నవారు భావకవులే!

ఆంగ్ల కాల్పనిక కవులు వర్డ్స్‌వర్త్, షెల్లీ, కీట్సులాంటి ప్రభావంతో, కాళిదాస మేఘదూతాది దుఃఖకావ్యాల అనుశీలనంతో భావకవుల ప్రణయ కవిత్వం ఆరంభమైంది. 'ఇయంగేహే లక్ష్మీరియమమృత వర్తిర్నయనయోః' అనే భవభూతి పలికిన పలుకులే వీరి మనోభూముల్లో బీజప్రాయాలై మొలకెత్తి ఫలించినాయి. ఈ సందర్భంలో వీరి 'అమలిన శృంగారతత్వం' ఒక విశిష్టతను సంతరించుకుంది. ఈ తత్వంపై 'ప్లేటో' ప్రభావం ఉందని కొందరు విమర్శకుల అభిప్రాయం. కాని 'ఫ్రాయిడ్' సిద్ధాంతాల వాసన ఉందనడం సమంజసం. 'లిబిడో'ను సంతృప్తి పరచలేనప్పుడు అది మరోవిధంగా మార్పు వహించడానికి ఆస్కారం ఉంది (సబ్లిమేషన్). అంతేకాదు. భావకవుల ప్రణయ కవిత్వంలో మన స్తత్వశాస్త్రదృష్ట్యా 'మెసోచిసమ్' అనే లక్షణం (ది ఎంజాయ్‌మెంట్ ఆఫ్ సఫరింగ్ ఆర్ టెండెన్సీ టూ సీక్ ఆపర్ట్యూనిటీస్ ఫర్ బీయింగ్ అఫెండెడ్ ఆర్ హర్ట్) కూడా ఉన్నట్లు గోచరిస్తుంది. అందుకే భావకవులు భగ్నప్రేమికులుగా, వియోగ దుఃఖార్తులుగా కానవస్తారు. వీరిలో కొందరు తాము దర్శించిన జవ్వనిని అభివర్ణించారు. మరికొందరు ఊహాజగత్తులో సాక్షాత్కరించిన సరసాంగితో సరసాలాడారు. ఇంక కొందరు స్వీయానుభవాలనే కవితలుగా అల్లారు. అంతేకాదు. పురుషుడికన్నా స్త్రీకి ఆధిక్యమివ్వడమే కాక, ఊర్వశిలాంటి లోకాతీత ప్రణయాధిదేవతలతోపాటు ఎంకిలాంటి సాధారణ యువతి పాత్రలను భావకవులు పరిపోషించడం ఒక ప్రత్యేకత,

ఈ సందర్భంలో కొందరు భావకవులు స్త్రీని తీర్చిదిద్దిన ధోరణిని పరిశీలిద్దాం.

'కట్టమంచి'వారి 'ముసలమ్మ మరణం'లో కావ్యనాయిక ముసలమ్మ. లోక కళ్యాణార్థం ఆమె మరణించింది, సమష్టికోసం వ్యష్టిత్యాగం చేయాలనే ఒక సందేశం ఈ కావ్యం అందిస్తుంది. తన ప్రాణత్యాగంతో మొత్తం గ్రామాన్ని ఉద్ధరించి దేవతాస్వరూపిణి అయిన ముసలమ్మ మరణించేముందు భర్త అనుజ్ఞ వేడుతూ 'హేయంబైన యిహంబు వాసన'లకు లోగి జనులకు మేలొనరింపని

తనువేలా? అని ప్రశ్నిస్తుంది. 'తమకు తమ భార్య యిటు చేసెం దగుఁనని యెల్లవారును వర్ణింప నింపుకాదొ!' అని అడగడంలో మానవతావాదంతోపాటు త్యాగబుద్ధి ప్రకటితమవుతుంది.

అదే సందర్భంలో అత్తమామలను 'కొడుకులెల్లరు రాములు పుడమి తనయలెల్ల క్రోధంద్రు తక్కువ యేమి మీకు!' అని నచ్చచెపుతుంది ముసలమ్మ. అంతేకాదు. బిడ్డను 'అన్నపోర! నీకు నమ్మ యెక్కడిదింక-తండ్రిగారి గూడి తనయుమయ్య' అని ఓదార్చడంలో ఆమె ఒక కరుణ రసమూర్తిగా ప్రత్యక్షమవుతుంది.

అలాగే అగ్నిలో ప్రవేశించే ముసలమ్మ 'కన్నెఱవారిన ఖర శరోదయకాల మల్లవమ్రింగు జాబిల్లి'లా, 'శింధామురల చారు సుంధర ముగు లీల నల్ల నల్లన జొచ్చునంచ'లా గోచరించింది కవికి.

అంతేకాదు. పూర్వబిల్హణీయకావ్యం కట్టమంచివారికి అనౌచిత్యంగా తోచింది. అందుకే 'నవయామిని'ని సృజించారు ఆయన.

'ప్రాణసఖుడని నను గోరి పనులగొనుము' అంటూ తన కోరికను వెల్లడించిన గురువుతో 'క్షణికము నీయీ మోహాంధనవము' అనీ; 'నీ ప్రతిబింబము గదనేనో పావనమూర్తి గిని యనోపుదె నాపై నీ పోషించిన లతికను నీపట్టున కల్లరనిమ్ము నిర్మల నియతిన్' అనీ కాంతా సమ్మితంగా దోషాన్ని తెలియ చెపుతుంది.

పూర్వబిల్హణీయంలో మోహావేశంతో గురువును కామించిన యామినికీ ఈ 'నవయామిని'కీ ఎంతో భేదం ఉంది. ఆమె కామిని. ఈమె యామిని.

అలాగే 'వెంకట పార్వతీశ్వర కవుల' దృష్టిలో స్త్రీపట్ల ఒక పూజ్యభావం గోచరిస్తుంది. జగత్తులో పూజ్య వస్తువులలోకెల్లా చెలువయే స్వయం ప్రకాశశక్తి. స్త్రీ సహాయం పురుషులకు ఎప్పుడూ కావాలి. ఇహపర సుఖాలకు ఆమెయే నిలయం. అర్ధాంగి ఒక ప్రేమానుబంధరూపిణి ఆనందమయ విగ్రహం, విమలసుఖ స్వరూపిణి. పవిత్ర ప్రేమకు అంతరాయీ, అవాంతరాలూ ఉండవని ఈ కవుల విశ్వాసం. వీరి 'ప్రేమాంజలి' కథలో ఒక సాధారణయువతి ప్రాణంపోయే సమయంలో తన ప్రేమను స్వీకరించుమని ఆ దేశపు రాజును అర్థించడం, అతడు అంగీకరించడం కానవస్తుంది.

అలాగే ఈకవుల ప్రసిద్ధ కావ్యం 'ఏకాంతసేవ'లో ప్రకృతి సుందరికి నిశ్చల భక్తియుతమైన ప్రేమ, హృదయ నైర్మల్యంగల ధ్యానం, ఏకాగ్రతగల మనస్సు, ప్రియుడే లోకమనుకునే విశ్వాసం ఉన్నాయి. అందుకే విశ్వనాయక ప్రణయానికి అర్హత అయింది ఆమె.

అదేవిధంగా 'కపోతం' అనే కవితలో పతితోపాటు సతి మరణించకూడదనే సందేశం వినిపిస్తుంది. 'జలజ మాలిక'లో అన్నపూర్ణ వివాహాత్పూర్వమే రజస్వల కావడంవల్ల కులాచారం భ్రష్టమైందని ఆకుటుంబాన్ని వెలివేయడం, బుడుబుక్కలవాడి మాటలువిని పెళ్ళిచేయక ప్రేయసీ ప్రియులను విడదీయడం లాంటి దురాచారాలను ఖండించడం కానవస్తుంది

అదేవిధంగా 'గురజాడ' దృష్టిలో స్త్రీ పురుషుల సుఖ సంతోషాలకు ప్రేమ ఒక్కటే తరుణోపాయం అయినా భర్తయే దైవం అనే పూర్వవిశ్వాసానికి ఈయన వ్యతిరేకం. మగడొక ప్రాణ మిత్రుడని ఈయన నమ్మకం. స్త్రీ కరుణాపాంగ దృష్టియే పురుషుడికి సర్వస్వం అని ఈయన దృఢాభిప్రాయం.

అంతేకాదు. ఫ్యూడల్ వ్యవస్థలో స్త్రీ ఒక ఆటబొమ్మగా చూడబడటం గురజాడకు నచ్చలేదు. స్త్రీ ప్రణయాన్ని అధికారగర్వంతో బలాత్కారంగా పొందదలిస్తే దాని ఫలితం చాలా దారుణమని ఆయన 'కన్యక' కథ నిరూపిస్తుంది అలాగే 'లవణరాజు కల'లో రాజు మాలి తను వివాహమాడినట్లు చెప్పడమేకాక పూర్వజన్మలో ఛండాలకన్యయే మరుజన్మలో రాజకుమార్తెగా పుట్టినట్లు చెప్పబడింది, ఇక్కడ కులాన్నిబట్టి కాక గుణాన్నిబట్టి మనిషిని గౌరవించాలనే గురజాడ సందేశం గోచరిస్తుంది.

అదేవిధంగా కాసుకులోనై ఆడపిల్లలను తల్లిదండ్రులు ముసలివాళ్ళకు అంటగడితే జరిగే విపరీతపరిణామాన్ని 'పూర్ణమ్మ'కథ నిరూపిస్తుంది.

అలాగే 'రాయప్రోలు' వారికి కూడా ముఖ్యంగా తంజావూరు కవుల కావ్యాలలోని శృంగారం వెగటు పుట్టించింది. పూర్వలాక్షణికులు భోగమే అవధిగా పేర్కొనడం ఆయనకు సరిపడలేదు. కడుపున పుట్టిన కొడుకు ఎదటకూడా 'పైటజారనీయని తల్లిపరుస'ను సహజంగా భావించారు అందుకే స్త్రీ పురుషుల ప్రేమను ఔచితీరమ్యంగా తీర్చి దిద్దాలనుకున్నారు. ప్రేమాభివర్ణనం కోసం కేవలం 'మిథున ప్రబంధాన్నే ఆశ్రయించ నక్కర్లేదనీ, ఏ ఉపాధినీ ఆశ్రయించని వియోగశృంగారమే అనుసరించతగిందనీ భావించారు. దానికి అమలిన శృంగారమే శ్రేష్ఠమని తలంచారు బాహ్యలోకంలో తల్లిగా, సోదరిగా, అర్ధాంగిగా, కుమార్తెగా స్త్రీమూర్తి పొందే వివిధ పరిణామదశలను గమనించి తమ సిద్ధాంతానికి అనుగుణంగా కొన్ని విభాగాలు చేశారు.

వీరి 'లలిత' అనే అనువాద కావ్యంలో జవ్వనులు సంసారంలోని అనురాగ మాధుర్యాన్ని చూరగొనాలి. కాని వైరాగ్యంతో సన్యాసం పుచ్చుకొని అడవులబడి పోరాదని నాయిక అనడంలో దంపతీనిష్ఠమైన ధర్మమే శ్రేష్ఠమని స్ఫురిస్తుంది. అలాగే 'అనుమతి అనే మరో అనువాదకావ్యంలో నాయికానాయకులకు ప్రేమ విఫలమవుతుంది. అయితే ఆ అలభ్యానురాగానే త్యాగంగా మార్చుకొని మర

ఱించిన ప్రియుడి పిల్లలపట్ల మాతృప్రేమను ప్రకటిస్తుంది నాయిక. ఇందులోనూ అమలిన శృంగార ధోరణే కానవస్తుంది.

ఇక రాయప్రోలువారి స్వతంత్రకావ్యమైన 'తృణకంకణం'లో నాయిక విధివశాత్తు అన్యకాంత కావడంతో భిన్ననాట్లి స్నేహం మరవలేక నాయకుడు అవివాహితుడుగా ఉండిపోయాడు. నాయికకు మృదుస్నేహ సౌరభం కావాలి కాని వలపుగంధం కాదు. అందుకే

'కనుల నొండొరుల జూచుకొనుటకన్న
ఘనసుఖోన్యోన్య రంజన గొనుటకన్న
గొసరి 'ప్రేమోయి' యనిపిల్చి కొనుటకన్న
క్షెలులకిలమీద నేమికావలయు సఖుడ'

అని అంటుంది ఆమె.

అంతేకాదు, 'ఖాకబంధం'గా నాయికమణి బంధానముగన్న పట్టుతోరాన్ని విప్పించి ప్రేమ మధురలాంఛనమైన 'తృణకంకణాన్ని నాయకుడిచే కట్టించి, "సోదరీ" అని పిలిపించారు. కలమైన కలుషము గాని స్నేహ మృదుమధుర సానుభూతి'కి చిహ్నంగా నాయికచే 'వలపు టుంగరా'న్ని అతడికి ఇప్పించారు రాయప్రోలువారు.

మోహం నశించినా 'కడిగిన మృగమదపాత్రిక విడువని పరిమళం'లా ప్రేమ శాశ్వతంగా వుంటుందని ఈ కావ్యంద్వారా ధ్వనింపజేశారు ఆయన.

అలాగే మరోకావ్యమైన 'కష్టకమల'లో నాయిక బాల్య స్నేహితులైన కుమార మాధవుల ఇద్దర్ని ప్రేమనూ, ఆశించింది. కాని 'అనాసక్తయోగం'లో సోదరీభావంతో 'కుమారుడి' స్నేహ సమాదారాలను కోరుకున్న కమల అతని ప్రేమలేనివల్ల మానసిక సంఘర్షణకు గురి అయి జీవితాన్ని విషాదాంతం చేసుకొన్నది.

అదేవిధంగా 'స్వప్నకుమారం' అనే మరోకావ్యంతో భోగ్య వస్తువుగా స్వప్నంలో గోచరించిన స్త్రీ క్రమంగా ఒక మాతృమూర్తిగా ప్రత్యక్షమవటం గానవస్తుంది.

'దప్పిగొనిచేరిన మిళింద తనయులకును
పూలపాలిచ్చి చీకట్ల పోవకుండ
కడుపులో దాచుకొనదె పుండరీకము ప్రియుడ
చేరదీసిన మమతాల మేరితెల్పు?'

అనే నాయిక మాటల్లో స్త్రీలోని మాతృత్వం జాలువారుతుంది.

ఈ కావ్యంలో నాయిక ప్రేమోచ్చిష్టమును 'అను'భవించుమని తనను ఆశించినవాడికి తనకు తానుగా అర్పించుకుందుకు సిద్ధమవు తుంది. ఒకరిని ప్రేమించి మరొకరిని ఆశించడంవల్ల విశ్వజనీన మైన ప్రేమోదయమవుతుందని రాయప్రోలువారి సిద్ధాంతం. కామ వాంఛతో ప్రవర్తించేవారికి కనువిప్పు కల్గించడమే ఈ కావ్య పరమార్థం.

అలాగే 'స్నేహలత' కావ్యంద్వారా వరశుల్కార్థం ఆత్మా ర్పణం చేసుకొన్న ఆమె రగిల్చిన 'పరిత్రాణవహ్ని' తేజాన్ని పునరుద్ధరించాలని రాయప్రోలువారు ఆశించారు.

అందుకే

'కన్నియను పెండ్లి యాడునో? కన్నెతండ్రి
యర్పణము జేయు శుల్కము దివ్యాప్సరను
పెండ్లికొడుకునో యకట! యీ పెండ్లికొడుకు
అమ్ముగదే యొక్కరయున శ్రీ యాత్మసుతుల'

అనిస్నేహలతచే లోకాన్ని ప్రశ్నింపజేశారు.

ఈ కావ్యాలన్నింటిలోనూ నాయికదే పై చేయి. అంతస్సూత్రం అమలిన శృంగారం. స్త్రీ రూపంలో జగజ్జనని లలితా స్వరూపాన్ని ఆరాధించి ధన్యులయ్యారు రాయప్రోలువారు.

కులమతాలనూ, బంధువర్గాన్నీ ప్రక్కకు నెట్టి ప్రణయాన్ని పరిణయంగా మార్చుకొని దాంపత్య ధర్మాన్ని ఆలంబనంగా చేసు కొన్నది లలిత'. ప్రణయం ఫలించక దాన్ని సేవాభావంగా మార్చు కొని అనాథలైన ప్రియుడి భార్యాబిడ్డలను పోషించే భారాన్ని స్వీక రించింది 'అనుమతి'. కామవాంఛాసక్తుడైన సఖుడి దుశ్చేష్టకు ఇష్ట పడక అంతర్మథనంతో ఆత్మార్పణం చేసుకున్నది 'కమల'. మోహా వేశంలో పడిన యువకుడికి జ్ఞానోపదేశమొనర్చి, స్త్రీమూర్తిమత్వంలో బొమ్మ బొరుసుల్లా కామరూపంతో చాటుగా ఉన్న మాతృస్వరూపాన్ని చూపింది 'స్వప్నకుమారం'లో నాయిక ప్రణయబంధం పరిణయ బంధంగా ముడిపడకపోవడంతో సఖుడినుంచి స్నేహాన్ని మాత్రమే ఆకాంక్షించింది 'తృణకంకణ' నాయిక. సంఘంలో పేరుకుపోయిన దురాచారానికి తలఒగ్గలేక తనను తానే అర్పించుకొని, లోకం కళ్ళు తెరిపించింది ముగ్ధధీర 'స్నేహలత.'

ఈ విధంగా ఒక్కొక్క సమస్యకు ఒక్కొక్క పరిష్కార మార్గం చూపిస్తూ నాయిక పాత్రను తీర్చిదిద్దారు రాయప్రోలువారు.

అయితే 'కవికొండల'వారు జానపదుల నెక్కువగా కవిత్వంలో స్వీకరించారు. రోడ్డురోలరు లాగుతూ 'వలపు జిమ్మెడు పదము గలిపే' సరసాంగులూ, 'పయిపుల్లు సూడకురా - ఏతం పిల్లోడ! ముల్లిరుగు' అనే వయ్యారీ, 'చక్కిలాలొండామురా - చక్కని నా బావ యెక్కడే యుంచానురా' అనే ముఖదలు పిల్లా వీరి కవిత్వంలో కానవస్తారు. అలాగే 'ఐద్దరద్దకంపు చీర' అందంగా కట్టుకొని, 'కుందనంపు ఖత్తికంటు' మెడలో సర్దుకొని, 'దారి తంగేడుపువ్వు' తలలో తురుముకొని, 'కులుకుమోమునందు' కుంకుమ బొట్టద్దుకొని, 'కాలిమట్టెలు టిక్కు టిక్కు' మంటూ కోతలకు పోయే కూలి పడుచులూ, 'పాటునకొచ్చే' కూలీ డబ్బులతోనే ప్రబోధాత్మకంగా

పాటలు పాడే వనితలూ, చెవులకు పూలూ, చేతులకు చివురుటాకులూ, మెడలో గురివెంద సరాలూ, మొలకు చిన్నిబట్ట కట్టుకొని ఏరిన కట్టెల్ని నెత్తిన పెట్టుకొని వచ్చే గడ్డిమోపును ఆబోతు తినగా ఏడుస్తూ ఇంటిమొగం పట్టి ముసల్ది మన్నెకన్నె, బొంతపరికిణీపై వింతరంగు 'పురిటి పొద్దు కాంతి'తో కోన నడుమ తిరిగే 'సుకారిపిల్ల' మూపు మీద మోకూ, మెళ్ళో గుళ్ళపేర్లూ, కాళ్ళకు కడియాలూ, నడుముకు కట్టూ, పిడే సిగముడి, ప్రేమరసం ఒలికించే పాటలూ, వేడి నిట్టూర్పులూ, ముచ్చెమటలతో రోడ్డురోలరు లాగే స్త్రీలు ఎంతో సహజ సిద్ధంగా వెంకటరావుగారి కవిత్వంలో ప్రత్యక్షమవుతారు.

2

అబ్బూరి రామకృష్ణారావుగారు రాయప్రోలువారిలా కథా కావ్యాలలో నాయికల వివిధ మనః ప్రవృత్తులను ప్రదర్శించారు. ఉదాహరణకు స్నేహితురాలైన కమల ప్రేమలేఖలను దాచి తన భర్త అనుమానానికి గురై నిండు ప్రాణాన్ని కోల్పోయింది 'మల్లికాంబ'. ఇక్కడ పురుష దౌష్ట్యం, స్త్రీ ఔన్నత్యం ప్రకటితమవుతాయి.

అయితే 'బసవరాజు అప్పారావుగారి' కవిత్వంలో స్తంభానికి ఆనుకొని 'ఓరచూపులు' చూస్తూ నిలుచున్న పడతీ, తాంబూల సరాగంచే ఎఱ్ఱబడ్డ పెదవులూ, నల్లనైన ముద్దుమొగంపై ఎఱ్ఱని కుంకుమబొట్టూ, ముంతకొప్పూ, తళుకు బెళుకు చూపులూ కలిగి, తడికెల గంపమీద దరువేస్తూ పాడుతున్న రమణీ, మొగిలు 'చాటున దాగుని వింతచే సన్నలు' చేసిన ముద్దుగుమ్మ సహజసిద్ధంగా కానవస్తారు.

అంతేకాదు. ఆయన భార్య రాజ్యలక్ష్మమ్మగారే చిట్టిగా రూపొంది కవితాకన్యగా సాక్షాత్కరిస్తారు. కులపాలికా ప్రణయాన్ని అందిస్తారు 'గుత్తొంకాయ్ కూరోయ్ బావా' అంటూ అరమరికలు లేని ప్రేమను ఆమె ప్రకటించడం ప్రత్యేకంగా చెప్పుకోవాలి.

తరవాత 'విశ్వనాథ సత్యనారాయణగారు' తన సతీమణినే ప్రేయసిగా, ఈశ్వరిగా, పరమేశ్వరిగా భావించి 'గిరికుమారుని ప్రేమ గీతాలు' రచించారు.

'నీ వనంత భావాలయవై విశాల
భావసామ్రాజ్య మేలుచున్నావు దేవి!
నీ కృపనదెంతభావ మేనియును సుపరి
చితమ యట్టులఁదోచు నా చిత్తవీధి'

అనడంలో ప్రేయసికి ఆయన ఇచ్చిన ప్రాముఖ్యం గోచరించింది.

ప్రేయసి సహాయంతోనే కామాదులైన ఆరు పర్వతాలను దాటగలిగారు విశ్వనాథ. ఆయన కవిత్వానికీ, కీర్తికీ పరోక్షంగా ఆమెయే ఆధారం. మొదట్లో ఆమె ఒక అనాగరిక జానపద కుమారికా మూర్తి'గా కనబడినా, క్రమంగా హంసిపై కూర్చున్న 'భావిశారదా మూర్తి'గా గోచరించింది ఆయనకు. ఆయన తన 'ముగ్ధభావ' ప్రసూనాలతో పూజించినప్పుడు పవిత్ర 'ప్రయాగ'లా, 'శాంకరి'లా ఆత్మను వెలిగించే జ్యోతిలా ప్రకాశించింది ఆమె.

అలాగే విశ్వనాథవారు రచించిన 'శశిదూత' కావ్యంలో ప్రేయసి ప్రణయకోపం తీర్చడానికి చంద్రుణ్ణి దూతగా ఎన్నుకున్నారు. అంతేకాదు, మిగిలిన భావకవులు కోకిల గానాన్ని మాత్రమే వర్ణించగా, సత్యనారాయణగారు 'కోకిలమ్మ'కు పెళ్ళి కూడా చేశారు. తెలుగు పాట పుట్టుకను ప్రతీకాత్మకంగా వివరిస్తుంది ఈ కథ. అదే విధంగా 'కిన్నెరసాని' నదికి మానవత్వం ఆరోపించి తదనుగుణంగా ఒక ఇతివృత్తాన్ని కల్పించి, కన్యగా, ముగ్ధగా, ప్రౌఢగా నది పొందిన పరిణామ దశలను చిత్రీకరించారు విశ్వనాథ. తెలుగువారి ఇళ్లలో పరిపాటిగా ఉన్న అత్తాకోడళ్ళ దొమ్ములాటలూ, ఫలితంగా ఆలుమగల నడుమ కలిగిన వియోగ విషాద పరిణామాలూ ఈ ఇతివృత్తంలో రమ్యంగా తీర్చిదిద్దబడినాయి.

కిన్నెర చాలా సుకుమారిగా, మహాపతి శీలగా, సౌందర్య రాశిగా రూపొందించబడింది. కాని భర్తకు దూరమై ఆ రసహృదయ విరహవ్యధ నొందిన సమయంలో కాముకుడైన సముద్రుడిబారి పడి, గోదావరి తల్లిని ఆశ్రయించి, చివరకు రామయ్యతండ్రిని చూడబోయే యాత్రికుల త్రోవకాచి ధన్య అయిన ఒక తెలుగింటి ఆడబడుచులా తీర్చిదిద్దబడింది.

ఆదేవిధంగా 'కొడాలి ఆంజనేయులుగారు' తన ప్రేయసిని ఇంద్రధనస్సులో ఎక్కించి, కలరాజు తలపుల గాలిమేడలకు పిలిపించి, రాగాల కోనలో నాగకన్నెలు పూవులు చిదిమేటి పున్నెంపుచోట క్రొమ్మించు తీవలో కూర్చుండబెట్టి ఊగించారు. 'అడవిపిల్ల' ముగ్ధ మనోహర సౌందర్యానికి ముచ్చట పడ్డారు. 'ఋషికన్య' సహజ లావణ్య సంపదకు అచ్చెరువందారు వివాహ సమయంలో వరుణ్ణి చూడటానికి పెండ్లికూతురు పడే తిప్పలను చూచి ఆశీర్వదించారు కొడాలి.

ఇక 'దువ్వూరి'వారు పురుషుల జీవితం అలరించడానికే బ్రహ్మదేవుడు స్త్రీలను సృజించాడని అభిప్రాయపడ్డారు. శరత్కాల మేఘ శకలాన్ని దూతగా చేసి, బాష్పకణాలను దూతికగా రూపించి, కాలజలధిలో పర్ణపుటాలపై ఎక్కించి తన ప్రియుడికి రాయబార మంపిన ఒక ప్రేయసిని చిత్రీకరించారు ఆయన. అంతేకాదు. ముఖ్యంగా గ్రామీణ జీవన సౌందర్యాన్ని కళ్ళకు గట్టించే సందర్భంలో దువ్వూరివారు దధిని మథించే వనితనూ, చేతి కొడవలి ఝళిపించే 'కన్నెమాలెత'నూ, తలైనా దువ్వుకోక నిరాడంబరంగా ఉండే కాపు పడతులను, మంచెనెక్కి ఒడిసెల చేతబట్టి మిడిసిపడే కుర్రదానినీ

కాళ్లు బొబ్బలెక్కి కూటిదుత్తతో వచ్చే కాపు భార్యనూ, కలుపు గంటలు తీస్తూ పాటలు పాడే పల్లెటూరి తొయ్యలులనూ పేర్కొన్నారు. అలాగే 'నాగరంగనా పరిచితమైన లజ్జ' కూడా తెలియని 'వనకుమారి పరిస్థితుల ప్రాబల్యంవల్ల సుకుమారిగా పరిణామం చెంది, సహజ లావణ్యంతో గృహిణిగా, ప్రణయాధిదేవతగా రూపొందినట్లు చిత్రీకరించారు రెడ్డిగారు. అంతేకాదు. కట్టమంచివారి ముసలమ్మ మరణాన్ని తలపించే విధంగా క్రూరవేయబడ్డ భర్తతోపాటు అగ్నిప్రవేశం చేసిన 'నలజారమ్మ'నూ, ఆకసాన కనబడిన మేఘాన్ని 'జలదాంగన' గానూ తీర్చిదిద్దారు.

అలాగే 'తల్లావఝ్ఝలవారు తన హృదయాన్ని చీల్చుకువచ్చిన ఆవేదనారూపమైన 'హృదయేశ్వరి'ని రూపొందించారు. ఆమెతో విహరించినట్లు, తన మనో వాంఛితాలను తీర్చమని అర్థించినట్లూ, తమ ప్రేమఫలాలుగా ఒక కొడుకూ, ఒక కూతురూ పుట్టినట్టూ కలగన్నారు. హృదయేశ్వరి ప్రణయం మానవాతీతంగా, దివ్యంగా తీర్చిదిద్దబడింది.

అదేవిధంగా మరికొన్ని కథా కావ్యాలద్వారా శివశంకరశాస్త్రి గారు తన ప్రణయ సిద్ధాంతాలను ప్రకటించారు. 'వాతాయనము' అనే కథలో మాధవునిచే ప్రేమింపబడినా శాఖాభేదంవల్ల వివాహం చేసుకోలేకపోతుంది 'సుందరాంబ'. 'వ్రతభంగం' అనేదానిలో ఉద్యోగం చేస్తూ స్వతంత్రభావం చంపుకోలేక ప్రేమనే వదులుకుందుకు సిద్ధపడిన సుందరాంబ కనబడుతుంది. 'రత్నాకరం' అనే ఇతివృత్తంలో పరకీయంగా ఉండి అనురాగాన్ని ప్రకటించిన ఒక నాయిక గోచరిస్తుంది. అలాగే ధర్మప్రచారం చేయవలసినవారు స్త్రీపట్ల నిగ్రహం కోల్పోరాదనీ, వయసు మళ్ళినవారు 'కనుగందని కన్నె'ను వరించకూడదనీ, అన్యచిత్తను లొంగదీసుకుందుకు ప్రయత్నించడం తగదనీ ఝూలారాకుమారి కుంభరాజుకు చెపుతుంది. ప్రేమకు అర్హమైంది యవ్వనమే అనీ, అది తొలగినట్లు నెరసిన జుట్టు సూచిస్తుందనీ, జుట్టు నెరసినవాడిపై సహజంగా స్త్రీకి మోజు తగ్గుతుందనీ యవ్వనంలో సుఖాలు అనుభవించి తరవాత తృష్ణను వీడి మనస్సును నిగ్రహించుకోవాలనీ 'విశాఖ' అనే పరిచారిక మిథిల రాజుకు బోధిస్తుంది 'పలితకేశం' కావ్యంలో. భార్య అనుమతి లేకుండా 'ప్రవ్రజింప'దగదని వాచస్పతి మిశ్రుణ్ణి ఆయన సతీమణి నిలదీస్తుంది. 'కామము వహించు నిజకాంత నెడ సేయన్నే మమగునేని కడు నిష్ఠురము నాథా' అని అగస్త్యుణ్ణి లోపాముద్ర అడుగుతుంది.

అంతేకాదు. గ్రహం పట్టిన స్త్రీ వింతప్రేమను 'మేడూరివారి కోడలు'లో, పెళ్ళి చేసుకోకపోయినా, ప్రభువును భర్తలా తలచి సేవించిన కన్య ప్రేమగాథను 'చామికాంబ'లో, భార్యను మోహంతో కాక ప్రేమతో సేవిస్తూ జగన్మాతగా సంభావింపబడిన తీరును 'ఆనందమూ'లో తల్లావఝ్ఝలవారు చవిచూపించారు. వీటన్నింటిలో స్త్రీమూర్తిలో కేవలం ఒక ప్రేయసి రూపాన్నే కాక - తల్లిగా, జగజ్జననిగా, ముక్తికాంతగా, రసధునిగా, అపూర్వ లావణ్యనిధిగా గోచరించే తత్త్వాన్ని కూడా దర్శించారు ఆయన.

అందుకే 'భావనాయిక'తో

'బాలపోలిక నొకమారు ప్రౌఢవోలె
నింకొకప్పుడు తోచెదవేల తల్లి?
భవదపూర్వ విలాస తాండవములందు
తెలియకున్నది నీ నిజస్థితి లతాంగి' అంటారు.

అలాగే శాస్త్రిగారి పద్య నాటికలలో బహుళ ప్రశస్తి గన్న 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి'లో కూడా స్త్రీ పూజ్యభావమే ప్రకటితమవుతుంది. రాణి బహూకరించిన నూపురాలను భార్య పాదాలకు జయదేవుడు అలంకరించబోవడం ఇందుకు ఒక నిదర్శనం.

అదేవిధంగా 'హృదయేశ్వరి' కావ్యంలో నాయికా నాయకుల ప్రణయానికి సాక్షీభూతంగా నిలిచిన వకుళమాలను ఒక నాయికగా తీర్చిదిద్ది 'వకుళ మాలిక' కావ్యాన్ని రచించారు శాస్త్రిగారు.

'పుష్పమాలికగానె పుట్టియుండనయేని
పూబోడిగా నేను పుట్టగల్గితినేని
అతనినే వరియించి ఆత్మవల్లభునిగా
కౌగిలింతు తదీయ కంఠమేనేవేళ' అని మాలికద్వారా

ఆ ప్రేమతత్త్వాన్ని ప్రకటించారు ఆయన అంతేకాదు వితంతువులనూ, పునర్భువులనూ కథానాయికలుగా తీర్చిదిద్ది సంఘసంస్కరణకు నడుం కట్టారు శ్రీ తల్లావఝ్ఝల.

ఇక 'నండూరి'వారి 'ఎంకి' జానపద ప్రణయ జీవన విధానంతో ఒక అపూర్వ సృష్టి. పూర్వరాగంలో ఎంకి తన సహజ సౌందర్యంతో నాయుడిబావను లోబరచుకుంది. ముగ్ధనాయికగా, అభిసారికా లక్షణాలతో అరమరికలు లేని అనురాగంలో కానవస్తుంది ఎంకి.

'ఎంకి వంటి పిల్ల లేద'నీ, తన 'గుండె నమిలి మింగినది' ఆమేననీ నాయుడుబావతో చెప్పిస్తాడు కవి. తరవాత ఎంకి ఒక ఆదర్శగృహిణిగా కానవస్తుంది.

'నీవు నేనైతె నిను నీలోనె కందు
నేను నేనుగ నుంటె నీలోనె యుందు'

అనే వారి సంభాషణ ఆ విషయాన్ని నిరూపిస్తుంది.

ఎంకి సౌందర్యంలో కృత్రిమత్వం లేదు. 'నీలిచీర గట్టి నీటుగొస్తావుంటే', ఒయ్యార మొలికిస్తుంటే 'వానలచ్చిమి'లా

ఉంటుంది ఆమె. అందుకే 'రాసోరింటికైన రంగు తెచ్చే పిల్ల'గా భావించబడింది. అంతేకాదు ఆమె చాలా గడుసుది. 'సూపుతో మాటాడి, వూపిరితో తెనిగించు'తుంది. 'కనుబొమ్మతో నవ్వి మనసు కరిగించు'తుంది. పూలబాసలూ-మనసులూ ఆమెకు తెలుసు. ఆమెకు పూలతో వియ్యాలూ-పూలతో కయ్యాలూ. భర్త గ్రామాంతరం వెళ్ళినా దొర ఇంటిలో నాయుడుబావలా నటించగల ధీర ఎంకి. ఆమె లేకపోతే తోటా, దొడ్డీ అంతా చీకటే! అందుకే 'మనిసే సాలు— మనిసి మాటే సాలు — మనిసి వాసనె సాలు — మనసే సాలు' అంటాడు నాయుడుబావ. ఈ విధంగా ఎంకి పుట్టుకే తెలుగుదనానికి ఒక కొత్తపోకడ కొనివచ్చింది.

ఆదేవిధంగా 'అడివి బాపిరాజు'గారు అమర సఖియైన 'శశికళ'ను తన ప్రణయ దేవతగా, కావ్యనాయికగా, విద్యల పరమార్థంగా తీర్చిదిద్దారు. శశికళ అలభ్యమైన ఒక దేవత. ఆమె కవి నిదురలో మూర్తించి, ఎదలో నర్తించింది బ్రతుకంత కదిలించింది. కవి హృదయ కమలాన్ని పూజాపీఠంగా చేసుకొన్న సింగారివేల్పు శశికళ. ఆయన కంటిలోనికి కలలు పొదిగి, కంఠంలోనే తీపులు పిదిగి హస్తకౌశలాన్ని ప్రసాదించిన అమృతమూర్తి ఆమె. ఆయన ఆత్మలోని ఆత్మ ఆమె. దివినుండి భువికి దిగిన దేవత. మంచు కొండపై గంగాఝరిలా కవి తలపు గిరిపై శశికళ వాలింది. ఆ పవిత్రమూర్తిని గూర్చి మొదటిగా పదం పాడటం మొదలుపెట్టాడు కవి.

అంతేకాదు. బాపిరాజుగారి కవితాలోకంలో 'తెల్లని తెర సాపెత్తి - తియ్యని గొంతుకెత్తి' తన 'సిన్నవాడు' రావాలనే యువతీ, 'బలం పొంగ తాడు పట్టరా — నా సిన్నిబావ - పొలం పదును సక్కలెట్టరా' అనే చిన్నదీ, 'నా రూపు సోకులో నవ్వేటి వలపు - నా చూపు రేకలో నల్లన్ని వలపు' అనే అందగత్తె గ్రామీణ ప్రణయమూర్తులుగా గోచరిస్తారు. సంకురాతిరికి సంబరం చేసుకుందుకు ఉవ్విళ్ళూరే జానపద యువతీ, అందచందాలొలికించే గొల్ల సెల్లాయి కూతరూ, వడిసెల త్రిప్పే కాపుపడచూ, కోయచిన్నదీ, కమ్మోరి చిన్నదీ, నీళ్ళబిందె తెచ్చే యువతీ కానవస్తారు.

అలాగే 'పింగళి కాటూరి' కవుల 'సౌందరనందం'లోని నాయిక అయిన సుందరి వ్యక్తిగత ప్రేమను విశ్వమానవ ప్రేమగా మలుచుకోవడం, శృంగారపరమైన జీవితాన్ని వైరాగ్యపథంవైపు మరల్చుకోవడం అమోఘంగా చిత్రీకరింపబడినాయి.

తరవాత ప్రముఖంగా పేర్కొనవలసింది 'కృష్ణశాస్త్రి'గారి 'ఊర్వశి'. ఆమె 'దివ్యమందార సుమం'గా 'శ్రీ లలిత వైజయంతీ పరిమళం'గా, మోహినీహాసమల్లీ ప్రఫుల్లరుచి'గా, 'హరజటా పారిజాత లతాంత మధువు'గా సంభావించబడింది. అంతేకాదు. ఎన్నో కల్పాలనుంచి తన ఎదలో అణగి ఉండే వేదనాసుఖమే, అపూర్వ కరుణార్ద్ర నీరవమూర్తియే ఊర్వశిగా రూపొందిందనీ, తనలోని అహం అశేచైతన్య స్వరూప తత్త్వదర్శనమే ఆమె సాక్షాత్కారమనీ శాస్త్రిగారు భావించారు. లోకంలో తొలి వియోగినీ, తొలి ప్రేయసీ హాలాహలానలమూ, అమృత శీతలరసమూ ఆమెకు తోబుట్టువులు. ప్రకృతిసిద్ధమైన ఒక ప్రణయమూర్తి ఆమె. మబ్బులపై సోనల్లా స్రవించే చంద్రుడి చిరునవ్వు చలువ, ప్రొద్దుపొడుపు పువ్వురేకులపై జాలువారే మంచుకన్నీరూ ఆమె పాటలో ధ్వనిస్తాయి. ఆమె దివ్య. ఆమెతో సంయోగం స్వప్నావస్థలోనే సాధ్యం.

అంతేకాదు. తనను తాను తెలుసుకుందుకు ఆ 'ఈశ్వరా లోకమే' ఒక దివ్యచైతన్య శక్తిగా, రక్తినుంచి భక్తివైపుగా పయనింపజేసి తనకు ముక్తిని ప్రసాదించే ఒక ఆధ్యాత్మిక శక్తిగా కృష్ణశాస్త్రిగారు ఊర్వశిని భావించారు. విధాత సరస్వతిని సృజించి ఆమెను ప్రేమించి, ఆమెచే ప్రేమింపబడినట్లుగా ఊర్వశి విషయంలో ఆనందించారు ఆయన.

'ప్రేయసి సోయగమ్మునకు లేదు శరీరము, లేదు మేను నా తీయని ప్రేమకేని కలదే యెడబాటిక' సూడ అని ఆయన చెప్పినట్లుగా ఊర్వశి కవితో ఉంది. లోపం లేని ఆనందం, కలత లేని శాంతి, అమృతం ఆమె.

అలాగే భాగవత కాలాన్నుంచీ అనూచానంగా వస్తున్న మధుర భక్తితత్వాన్నే స్వీకరించి దానికొక గోపికను ప్రతీకగా చేసి 'అన్వేషణము' రచించారు శాస్త్రిగారు. శ్రీకృష్ణ వేణుగానామృతం గ్రోలిన ఆమె వివశ అయింది. ఆ తీయందనంలో ఆమె ఎదద లీనమయింది.

తరవాత 'నాయని సుబ్బారావు'గారు బసవరాజువారిలా కులసతి ప్రణయానికి ఒక విశిష్టతను చేకూర్చారు. వారి 'సౌభద్రుని ప్రణయయాత్ర', 'ఫలశ్రుతి' కావ్యాలు ఆ కోవకు చెందినవే. భారతంలో శశిరేఖాభిమన్యుల్లా వత్సలా సుబ్బారావుగారలు ప్రేమించుకున్నారు. ఆనాటి బలరాముడిలా నాయనివారి మేనమామ వారి ప్రేమ చిగిర్చడానికి అడ్డుపడ్డాడు. అందుకే నాయనివారు తమను సౌభద్రుడిగా మరదలు వత్సలను శశిరేఖగా రూపొందించుకున్నారు.

'హృదయ పుస్తక మందతికింపబడిన
ప్రేమగీతాల పుట జింపివేయుటెట్లు?
చినుగు వెంబడి పై కెగజిమ్ము రక్త
మున గలసి ప్రాణము ల్లేచిపోవకుండ'

అని వత్సల అనడంలో ఆమె ప్రేమాధిక్యమూ, 'పరున కుపహారముగ నిడ్డ వలపుజూపు పరుని వదనమ్ముపై నెట్లు ప్రాకగలదు?' అని ప్రశ్నించడంలో ఆమె కృతనిశ్చయమూ ప్రకటితమవుతాయి.

ఆమె 'ప్రణయరూపిణి'గా, 'జీవనదాత్రి'గా అభివర్ణిస్తాడు కవి. 'నీవు లేకున్న నా లేమియే ధ్రువమ్మ' అనడంలో ఆ ధోరణియే గోచరిస్తుంది. చివరకు సుదీర్ఘమైన వారి ప్రణయయాత్ర సుఖాంత మైంది. అదే 'ఫలశ్రుతి' కావ్యం. వారిద్దరూ ఆదిదంపతులు. వారి ప్రణయం అద్వైత ప్రణయం. 'భావ' అనే రెండక్షరాలే నాయనివారి ప్రణయ లోకానికి వేసిన పూలబాటగా, భావకావ్యరచనకు ఒక ఉద్దీప కంగా రూపొందినాయి. అయితే నాయనివారు తన ప్రేయసితో కేవలం శారీరక సుఖాన్నే ఆశించలేదు. శరీరాలను మరచి, మనసు లను దాటి, ఊహకు అందని రీతిగా సమైక్యమై పోదలచారు ఆయన. తమ 'నిర్మలప్రేమ' ప్రభావంతో లోకమే పరవశిస్తుందని ఆయన విశ్వాసం.

అలాగే 'వేదుల'వారి దృష్టిలో ప్రేయసి 'నవనీత హృదయ', 'అంతరంగ శాంతిదేవత' 'ఆకాశ పథాంతరాళ పారిజాతం' ప్రేమ జీవన విభాతకైశికీగీతి' 'తపః కల్పవల్లి' 'జగదీశ మకుటాగ్ర సీమనుండి యుర్విపై జారిన సుధామయూఖరేఖ' కాబట్టి ఆమె దివ్య. ఆమె దర్శనం 'బాధాసుర సుదర్శనం.' ఆమె వక్షం మాతృ వక్షః స్థలంలా ప్రేమప్రసన్నం హృదయావేదనకు ఒక ఉపశమనం.

అందుకే ఆ స్వప్నరాజ్ఞిని ఆహ్వానిస్తూ

'కోరికలనెల మరచి, నా కొరకు నీవు
నీ కొరకు నేను తొలివేగుబోక రాలు
పూలజత వోలె నీ సుధాపూరమందు
తేలిపోదము జన్మజన్మాల యాత్ర'

అంటూ చెపుతాడు ఆయన. అంతేకాదు. 'యెదలోని మూర్తితో నెడ బాటు లేదు, తీయని బంధమ్ము తెగిపోవదెపుడు' అని ప్రకటిస్తాడు.

అదేవిధంగా 'చింతా దీక్షితులుగారు' ప్రతి మనిషి జీవ యాత్రకు ప్రేమను కూర్చేది ప్రేమ ఒక్కటే అనీ, భార్యాభర్తల అనుబంధం అపురూపమనీ తలంచారు. 'నోరి నరసింహశాస్త్రిగారు' తన ప్రేయసిని సువర్ణలతికగా, తనను మోహింపజేయడానికి 'నాక జనులు పంపిన మనోహరాప్సరోవనిత'గా అభివర్ణించారు. 'దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు' జగత్తంతా ప్రేమబద్ధమని తలంచి 'చెండి చెర లాడు గండ్రగొడ్డండ్లనైన/వెల్లిగొని పాఱు నెత్తురుటేళ్లనైన/కంపు గొట్టెడి మాంసపు రొంపినైన ప్రేమ యానందమయ భావవిభవ మందు' అని నాయిక మల్లికాముఖంగా చెప్పిస్తారు. 'వెనుముర్తి వెంకట రత్నంగారు' కవితా ప్రణయినినే తన ప్రేయసిగా తీర్చిదిద్దారు. 'అధికార్ల సూర్యనారాయణరావుగారు' తన ప్రేయసి జానకిని అభి వర్ణించారు. 'సన్నిధానం'వారు తమ ప్రేయసి దివ్య అని నిరూ పించారు. 'పుట్టపర్తి'వారు తమ ప్రేయసిని పీయూషకలికగా, అంత రంగ శాంతిదేవతగా పేర్కొన్నారు. 'పురిపండా'వారు తమ ప్రణయ దేవతా సౌదామిని అని చెప్పుకున్నారు. 'పిలకా'వారి ప్రేయసి ఒక ఆరాధ్యదేవతగా తీర్చిదిద్దబడింది. 'బొడ్డు'వారు తన సతినే ప్రణ యాధిదేవతగా తెలియజేశారు. 'మల్లవరపు'వారు ఒక అపూర్వ శక్తి స్వరూపిణిగా, కళ్యాణ కింకిణిగా ప్రేయసిని అవతరింప చేసు కున్నారు. 'కొనకళ్ల'వారు నండూరివారిలా 'కోడలిపిల్ల'ను నాయికగా తీర్చిదిద్ది జానపద ప్రణయాన్ని చవిచూపించారు.

ఈ విధంగా భావకవులు వివిధ దృక్కోణాలనుంచి స్త్రీమూర్తిని దర్శించి తమ కవితారంగాన ప్రదర్శించారు.

---

# మా తెనుగు కవిత

ప్రసన్నమయిన కథ
నానారసాభ్యుచిత బంధం
సూక్తి వైచిత్రి
నూత్న రుచిర రత్నవీధి
నవీన గుణ సనాథం
తొలి కోడికూత
దీనారటంకాల ధళధళ్యం
మందార మకరందాల మాధుర్యం
కురంగనాభ పరీమళం
కుంకుమ పొట్లం
జాతి వార్తా చమత్కృతుల మిశ్రమం
జీవుని వేదనల్ని ప్రతిబింబించే మౌనగానం

శక్ర చాపవక్ర రేఖల వర్ణసంకరం
దయాపారావతాల కూజితం
కోటి రతనాల వీణా మృదు నిక్వాణం
సుకుమారమైనదే కాదు
సుమధురమైనది
కరిగింపజేసేదే కాదు
కదిలింపజేసేది
పరవశింపజేసేదే కాదు
పులకరింపజేసేది
మేలుకొల్పింపజేసేదే కాదు
మునుముందుకు నడిపింపజేసేది
పరిపూర్ణపు బ్రదుకిచ్చేది!

శ్రీ కె. కిశోరుబాబు; శ్రీ కె. అశోకుబాబు

# అగ్ని పూలు

## శ్రీ పైల కృష్ణారావు

కటిక దారిద్ర్యంతో
కష్టాల జల దిగ్బంధనంలో ఉన్న
నిరుపేదల మురికివాడల్లో
నా పాదాలు మౌనంగా సంచరిస్తున్నాయి
బలవంతుల ఇనుప పాదాలక్రింద
విరిగిన చలిచీమల నడుములకు
నా చూపులు సానుభూతి లేపనాన్ని పూస్తున్నాయి
అడుగడుగున తారసపడే హీన దీన కరుణగాథల
చేదు నిజాల శోకరసాన్ని
అతివేలంగా నారసననాడులు ఆస్వాదిస్తున్నాయి
నాయకుల రాజకీయ చదరంగంలో
పావుల్లా రాలిపోయే నిస్సహాయుల హాహాకారాల్ని
నా శ్రుతులు ఆర్ద్రంగా వింటున్నాయి
కార్మిక కర్షక శ్రామిక యాగ హోమాగ్ని ధూమాంకురాలను
అవ్యారిగా నా నాసపుటాలాఘ్రాణిస్తున్నాయి
ఆడపడుచుల్ని సజీవదహనం చే అత్తవారింటి ఆరని మంటలు;
నవయువతారణ్యంలో రాజుకునే నిరాశల దావానల జ్వాలలు;
ఆపాదమస్తకం చెమట కురిసినా ఆరని దీనుల ఆకలిమంటలు:
అంటుకుని
నా ఆలోచనలు గుప్పుమని రగులుకుంటున్నాయి
నిర్భాగ్యుల వగల సెగలకు కరగి
నిర్ఝరులై కలంలోంచి ప్రవహిస్తూ నా హృదయం
అక్షరాగ్ని పూలుగా రూపొందుతోంది.



డా॥ హెచ్. ఎస్. బ్రహ్మానంద

# భాషా విజ్ఞాని రచించిన వ్యాకరణ భాష్యం

ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రిగారు సుప్రసిద్ధుడైన భాషా విజ్ఞాని. వీరి తండ్రిగారు కీ॥ శే॥ కోరాడ రామకృష్ణయ్యగారు గిడుగు రామమూర్తి పంతులు తర్వాత భాషా విజ్ఞానరంగంలో అంతటివాడు. తండ్రికి తగిన కుమారుడుగా శాస్త్రిగారు ఆదర్శ ఉపాధ్యాయునిగా నిరంతర పరిశోధకునిగా ఖండాంతర ఖ్యాతిని సంపాదించారు. జర్మనీలో 1976-78ల నడుమ వీరు కోలోన్ యూనివర్శిటీలో తెలుగును బోధించి వ్యావహారిక తెలుగుభాషకు ప్రామాణికమైన వ్యాకరణం తయారుచేశారు. అది 1985లో జర్మనీలో ముద్రించ బడింది. వీరు శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం తెలుగుశాఖకు అధిపతిగా, ప్రారంభకుడిగా చాలాకాలం పనిచేసి 1981లో పదవీ విరమణ చేశారు. ప్రస్తుతం మదరాసులో పితృపాదులు కట్టిన ఇంట్లోనే వుంటూ భాషా సాహిత్యాలమీద తెరిపి లేకుండా కృషి సాగిస్తూనే ఉన్నారు. ఇలాంటివారే మా తరానికి దీప్తిని కల్గించినవారు.

యూనివర్శిటీ తెలుగు ఆచార్యులలో ఒక తరం గడిచి పోయింది, రెండో తరం జరుగుతోంది. మేము మూడో తరం వాళ్ళం ఈ మూడు తరాలలో భాషా సాహిత్యరంగం నానాటికీ విస్తరిస్తోంది. బహుశా రాబోయే తరాలలో ఇప్పటికన్నా ఎక్కువ సామాజిక దృష్టి, వైజ్ఞానికత, యాంత్రికత కూడా పెరగవచ్చు. ఈ నేపథ్యంలో జరిగిన నాలుగు దశాబ్దాల భాషా పరిశోధనారంగాన్ని ఒక్కసారి సింహావలోకనం చేస్తే ఆచార్య మహాదేవశాస్త్రిగారు, ఆచార్య బిరుదురాజు రామరాజుగారు, ఆచార్య భద్రిరాజు కృష్ణ శాస్త్రిగారు, ఆచార్య తూమాటి దొణప్పగారు, ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తంగారు, ఆచార్య జి. ఎన్. రెడ్డిగారు, ఆచార్య యస్వీ. జోగారావుగారు భిన్న ఆలోచనా స్రవంతులకు ప్రతినిధులుగా కనిపిస్తారు. దీన్నే నేను తొలి తరం అన్నది వారికి పూర్వమున్న పండితులు అతిరథ మహారధులు. సాహిత్య సంగ్రామయోధులు. భాషాయుద్ధాలు జరిపినవారు. ఆ తరం తాలూకు నిబద్ధత, క్రమశిక్షణ, బహుగ్రంథ పరిచయం వారి తరువాతివారికి కూడా బాగా సిద్ధించాయి.

భాషా సాహిత్య రంగాలు భిన్నమని, భాషా పరిశోధన అంటే సాహిత్య పరిశోధనకు సరిగా వ్యతిరేకమని అభిప్రాయం పాతుకు పోయింది కూడా ఈ తరంలోనే. భాషారంగంలో కూడా వ్యాకరణ పద్ధతికన్నా ఆధునిక భాషాశాస్త్రం చాలా భిన్నమన్న ధోరణి కూడా ఈ తరంలోనే బలపడింది. రెండో తరంలోనూ దాదాపు ఇవే అభిప్రాయాలు బాగా స్పష్టపడి భాషా సాహిత్యం భిన్న శాఖలుగా వేరై పోయాయి. మా మూడోతరం వచ్చేటప్పటికి ఈ అభిప్రాయాలు ధృవస్థాయికి చేరుకున్నాయి. అసలు తెలుగు శాఖలలో సాహిత్యం ప్రధానం భాష నెందుకు బోధించాలి? భాషను బోధించడానికి భాషా శాస్త్రముండగా ఈ వ్యాకరణమెందుకు? వీటిలో వేటిని తీసివేయాలి? రెండూ తీసేస్తే? లేక వ్యాకరణాన్ని భాషాశాస్త్రంతో కలిపితే? ఇలాంటి చిలిపి ఊహలు సదస్సుల రూపంలో కూడా జరుగుతున్నాయి.

గమ్మత్తు ఏమిటంటే సాహిత్యరంగంలో కూడా దీనికి సమాంతరంగా మరొక విప్లవం వస్తోంది. ప్రాచీన సాహిత్యమెందుకు బోధించాలి? అసలు ఈ జానపద సాహిత్యమేమిటి? బాల సాహిత్యం కూడా సాహిత్యమేనా? అలంకార శాస్త్రం సాహిత్య విమర్శ ఎలా అవుతుంది? ఆధునిక సాహిత్యమంటే శ్రీశ్రీ వరకేనా? అయినా ఆధునిక సాహిత్యంలో బోధించడానికి ఏముంది?

ఈ ప్రశ్నలు, వీటికి సమాధానాలు వెతకగా వెతకగా అందరూ అంగీకరిస్తున్నది ఏమిటంటే భాషా సాహిత్య విద్యార్థికి తెలియాల్సింది నేటి భాషే, నేటి సాహిత్యమే అని నేటి సాహిత్యానికి నిన్నటి సాహిత్యమెలా పునాదో, నేటి భాషా విజ్ఞానికి ఒకప్పటి వ్యాకరణ సంప్రదాయం కూడా అలాగే పునాది. పునాది ఎంత గట్టిగా ఉంటే భవనం అంత విశాలంగా ఎత్తుగా కట్టవచ్చు. మనతోపాటు పదిమందికి చోటూ ఇవ్వవచ్చు.

ఇలా తెలుగు వ్యాకరణ సంప్రదాయాల పునాదిని విద్యార్థులకు పరిచయం చెయ్యటం కోసం మళ్ళీ తొలి తరం వాళ్ళే ప్రయత్నిస్తున్నారు. ఏ తరంలో భాషా విజ్ఞానం వ్యాకరణం కన్నా వేరు మార్గాన్ని తొక్కిందో ఆ తరంవారే నిశిత పరిశీలన తరువాత భాషా విజ్ఞాన నేపథ్యంతో వ్యాకరణ సంప్రదాయాన్ని పునర్వ్యాఖ్యానించటం చాలా అభినందించదగిన పరిణామం. సరిగా సంప్రదాయాన్ని వ్యాఖ్యానించడమంటే టిప్పణి వ్రాయటమని కాదు. మన కాలానికి పాత విద్య ఎలా పనికివస్తుందో చెప్పటమే. ఆచార్య శాస్త్రిగారు 1987లో ప్రచురించిన వ్యాకరణదీపిక ఇలాంటి ఉత్తమ భాష్యం. విజయవాడలోని గంగాధర పబ్లికేషన్స్‌వారు దీన్ని ముద్రించారు.

ఈ గ్రంథాన్ని గురించి ప్రస్తావించేముందు కళాశాలలోనూ, యూనివర్శిటీలలోనూ జరుగుతున్న వ్యాకరణ బోధన పద్ధతిమీద కొంత పరిచయం అవసరం.

విశ్వవిద్యాలయాల్లోకి ప్రవేశించే విద్యార్థులు బి.ఎ., బి.కాం., బి.యస్సి., నేపథ్యాలనుంచీ వస్తున్నారు. అందరికీ వ్యాకరణ నేపథ్యం దాదాపు సమాన స్థాయిలోనే వుంటుంది. కాని బి.ఏ.లో తెలుగు సాహిత్యాన్ని చదివి వచ్చినవారు బాల, ప్రౌఢ వ్యాకరణలలో కొన్ని పరిచ్ఛేదాలు చదివి వుంటారు బులుసువారి టీకతోనో, సూర్యశ్రీ, వంతరాం, బొడ్డుపల్లి, వారల వ్యాఖ్యానంతోనో చదువుకుంటారు. ఎం.ఎ స్థాయిలో కూడా అన్ని యూనివర్శిటీలలోనూ ఒకే స్థాయిలో వ్యాకరణబోధన జరగటం లేదు. కొన్నిచోట్ల బాలలో కొన్ని పరిచ్ఛేదాలు; మరికొన్నిట బాల సంపూర్ణంగా; మరికొన్నిట బాలప్రౌఢలు రెండూ తులనాత్మకంగా - ఇలా చెబుతున్నారు. విద్యార్థుల నేపథ్యం ఒకేలా లేకపోవటంవల్ల; మాష్టార్లకూ సంవత్సరంలో పనిరోజులు ముందున్నంత సక్రమంగా ఉండకపోవటంవల్లా, ఉపాధ్యాయులలోనూ వ్యాకరణ పాండిత్యం రానురాను తగ్గిపోతున్నందువల్లా, ఓపిక, నేర్పు సన్నగిల్లుతున్నందువల్ల వ్యాకరణంవైపు 'అదోలా' చూడడం అటు ఇతర ఉపాధ్యాయులకూ, విద్యార్థులకూ అలవాటయిపోయింది. దీనిక్కొంతవరకు సలిగీ నలగని భాషాశాస్త్ర పాండిత్యం ఉన్న 'లింగ్విస్టులూ' బాధ్యులె. అంచేత యూనివర్శిటీలలో అసలు భాషా పరిశోధనే తక్కువ. అందులోనూ వ్యాకరణంలో పరిశోధన దాదాపు మృగ్యమైపోయిందనే చెప్పాలి.

ఈ నేపథ్యంలో ఆచార్య శాస్త్రిగారి 'వ్యాకరణ దీపిక'కు చాలా ప్రాధాన్యం వుంది. ఇది ప్రధానంగా విద్యార్థులకు 'గైడ్'లా ఉపయోగించుకోదగ్గ పుస్తకం ఓపెన్ యూనివర్సిటీ మార్గంలో చదువుతున్న విద్యార్థులు కూడా - అంటే ఉపాధ్యాయుల ప్రత్యక్ష శిక్షణ లేనివారు కూడా - ఈ పుస్తకాన్ని ఆధారంగా బాల ప్రౌఢల - నాధారంగా మొత్తం తెలుగు వ్యాకరణ సంప్రదాయాన్ని సులువుగా అర్థం చేసుకోగలుగుతారు. అదే ఈ రచయిత ఆశించే లాభం. ఈ ప్రయోజనానికి అనుగుణంగానే శాస్త్రిగారు వ్యావహారికంలో భాష్యం రాశారు. చాలా సరళమైన వాక్యవిన్యాసం ఈ రచనలో కనిపిస్తుంది. అంచేత నిస్సందేహంగా శాస్త్రిగారు తమ రచనద్వారా వ్యాకరణ భాష్యానికి ఒక కొత్త దారి చూపారని చెప్పవచ్చు.

దీన్ని బట్టి ఇది పండితులను - అందులోనూ వ్యాకరణ శాస్త్ర నిష్ణాతులను మెప్పించడానికి రచించింది కాదని చెప్పాల్సిన అవసరం లేదు. వైయాకరణ భాష్యరీతి ఒకటుంది. అక్కడ భాషలో తర్కం ప్రధానం, శబ్దం చాలా జటిలంగా వుంటుంది. ఆ గ్రంథాన్ని గురువు ద్వారా నేర్చుకోవాల్సిందే. ఉదాహరణలు వజ్ఝలవారి 'సంహితా సర్వస్వం'; దూసి రామమూర్తి శాస్త్రిగారి 'సర్వస్వపేటిక'— ఇత్యాదులు. దువ్వూరి వేంకట రమణశాస్త్రిగారి 'రమణీయం' ఒక రమణీయమైన వ్యాకరణ నాటకం.

అమరేశం రాజేశ్వర శర్మగారు, బొడ్డుపల్లి పురుషోత్తంగారు రచించిన సిద్ధాంత వ్యాసాలు ఉత్తమశ్రేణికి చెందినవి. కాని పఠన పాఠనాల్లో వాటికింకా చోటు కలగలేదు. తొలిసారిగా భాషాశాస్త్ర నేపథ్యంతో కొన్ని పరిభాషల్ని వివరించటం; కొన్ని ప్రక్రియల్ని నిరూపించటం - బొడ్డుపల్లి పురుషోత్తంగారిలో మనకు ప్రత్యేకంగా కనిపించే ఆసక్తి. ఇదంతా ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు వ్యాకరణ బోధనపై చూపిన ప్రభావంగా చెప్పుకోవచ్చు. అనంత పద్మనాభశాస్త్రిగారు రచించిన 'వ్యాకరణ వివేకం' కూడా సమన్వయ దృష్టితో వ్యాకరణ భాషా శాస్త్రరంగాలకు కట్టిన వారధే అయినా— అది ప్రధానంగా చారిత్రక పరిశీలనం - బేతవోలు రామబ్రహ్మంగారి వ్యాకరణ 'పరిశోధన' విలక్షణమైంది సంస్కృత ప్రాకృత వ్యాకరణాల ప్రభావం తెలుగు వ్యాకరణ సంప్రదాయంమీద ఎలా పడిందో చెప్పే ఈ రచన అత్యద్భుతమైంది. దీనివెనుక ఆచార్య తూమాటి దొణప్పగారి ప్రాకృత భాషా పరిశోధన వుంది ఎక్కడో మరుగున పడిపోయిన చిలుకూరి నారాయణరావు గారున్నారన్నమాట.

ఇవన్నీ ఇలా వుండగా వ్యాకరణ పఠన పాఠనాల్లో ఈ పరిశోధనల ఫలితాలు మాత్రం చోటు చేసుకోవటం లేదు. యథాపూర్వంగా బాల ప్రౌఢల సూత్రాల్ని తరగతిలో వల్లెవేయటం, బి ఏ లో లాగానే ఇక్కడ కూడా రూపసాధన, సూత్రార్థ వివరణం - ఇత్యాదులతోనే సరిపోతోంది మరి ఉపాధ్యాయులలో లేని 'ఓరియంటేషన్' విద్యార్థుల్లో ఎలా వస్తుంది? అంచేతే వ్యాకరణం — 'క్లిష్టమంగే సుభాషితమ్' అయిపోయింది. అయిపోతోంది.

ఈ పరిస్థితిని గురించి పెద్ద పెద్ద ఆచార్యులు కూడా వక్ర మార్గంలో ఆలోచిస్తున్నారేమో ననిపిస్తోంది — బహుశా ఇంకా ఆలోచించలేదేమో కూడా!

ఒకప్పుడు గ్రాంధికంలో రాయటం ఎవరికీ రాదని గిడుగు రామమూర్తిగారు నిరూపించారు. కాని ఆయన రాసింది కూడా అర్ధ గ్రాంధికం మాత్రమే. పత్రికా రచయితలు విజృంభించాక వ్యావహారిక భాషకు రచనాస్థాయిని కల్గించారు. భద్రిరాజు కృష్ణమూర్తి తరంవారు కొంతలోకొంత 'వ్యాకరణం' తయారుచేయటానికి ప్రయత్నించారు. మాండలిక పరిశీలనలూ సాగాయి. మధ్యతరగతి వర్గం నుంచీ ఒక రచనాశైలి ఏర్పడి అన్ని ప్రాంతాల మన్ననలనీ పొందింది.

ఇంతవరకూ బాగానే వుంది - కాని అన్ని విశ్వవిద్యాలయాల్లోని విద్యార్థుల్ని సరిగా 'ఎవాల్యుయేట్' చేస్తే నిస్సందేహంగా 'భాషా పాటవం' చచ్చిపోయిందని చెప్పవచ్చు. పత్రికలో వచ్చే భాషలో— ఆ భావాలవరకు - సగటు సమస్యలమీద - రాయగలుగుతారు - కాని చక్కటి నుడికారంతో కూడిన పది వాక్యాలు రాయలేకపోతున్నారు ఆంధ్ర ప్రాంతంలో ఈ పరిస్థితి కాస్త నయం. రాయలసీమ తెలంగాణా విద్యార్థుల భాష భయంకరంగా వుంటోంది.

ఇప్పుడు ఈ పరిస్థితిని ఏమనాలి? బాధ/భేద: లలో ఒత్తు ఎక్కడ ఉండాలో చెప్పటంలో కూడా విద్యార్థులు తడబడుతున్నారు. ఈ పరిస్థితి నిస్సందేహంగా తరతరాలనుంచీ సాగుతూ వచ్చిన సాహిత్యభాషా పరిచయం సన్నగిల్లటంవల్లనే అని చెప్పవచ్చు. ప్రాథమిక పాఠశాలల్లో పెద్దబాలశిక్ష; ఆంధ్రనామ సంగ్రహం; సులభ వ్యాకరణం; ఇత్యాదులతో చదువుకున్న పబ్లిక్‌రంగ ఉద్యోగస్థులు మాట్లాడినంత బాగా కూడా, ఈనాటి ఎమ్.ఏ., తెలుగు పట్టాదారు ప్రసంగించలేకపోతున్నాడంటే — నిస్సందేహంగా భాషాపాటవాన్ని పెంచే రీతిలో వ్యాకరణ/అలంకార-బోధన జరగటంలేదనే అర్థం.

ఈ స్థితిని కొంత బాగుచేసే పద్ధతుల్లో ఒకటి వ్యాకరణాన్ని నవీన పద్ధతుల్లో బోధించటం. వ్యాకరణాన్ని బోధించడమంటే బాల ప్రౌఢల్ని బోధించటం మాత్రమే కాదు - భాషను విశ్లేషించటంలో 'కావ్యభాషా' శిక్షణనిచ్చే పద్ధతి ఒకటి వుంది - దాన్ని 'వ్యాకరణం' అని అంటాం. ఇక్కడ శబ్ద సాధుత్వ, అసాధుత్వాలను గురించి చెబుతారు. చాలావరకు ఏ రూపం సాధువు అని అంగీకరించటంలో ఒక వ్యాకరణం మరో వ్యాకరణంకన్నా భిన్నమే అయినా - మొత్తం మీద కావ్యభాష ఎలా పరిణమిస్తూ వచ్చిందో ఈ వ్యాకరణాల్ని ఒక దానిపక్క మరొకటి వుంచి చూస్తే తెలుస్తుంది. ఆయా కాలాల్లో పుట్టిన శాసనాలను, కావ్యాలను - పరిశీలిస్తే ఆయా 'అసాధు' రూపాలు కనిపిస్తాయి - అవి 'అసాధు' రూపాలనటం విషయం అటుంచి కావ్యభాషా పరిణయదృష్టితో అవి చాలా ముఖ్యం. అంచేత కావ్యభాష ఎలా వుండేదో కొన్ని రోజుల తర్వాత విద్యార్థికి రెండో భాషను నేర్పించినట్టు చెప్పక తప్పదు. దాదాపు ఇప్పుడా పరిస్థితిలోనే వున్నాం.

అంచేత వ్యాకరణాన్ని కొత్త పద్ధతిలో బోధిస్తే అటు కావ్యభాషా స్వరూపమూ పరిచయం అవుతుంది. ఇటు శబ్దపాండిత్యమూ పెరుగుతుంది. ఈ రోజుల్లో వ్యాకరణం ఈ దృష్టితో చదువుకోవాలి. పాఠమూ చెప్పాలి. శాస్త్రిగారు పదకొండో శతాబ్దిదాకా వచ్చిన శాసనాల నాధారంగా తెలుగుభాషకు 'చారిత్రక వ్యాకరణం' రాసినవారు కూడా కాబట్టి (ఈ గ్రంథం 1969లో ముద్రించబడింది) వీరి వ్యాఖ్యానంలో ఎన్నో చారిత్రకాంశాలూ, భాషా నిర్మాణ విశేషాలూ కనిపిస్తాయి. సాధారణ విద్యార్థి ఈ పరిభాషలో చెప్పినంత సులభంగా ప్రాచీన పండితుల కర్కశమైన శైలిలో చెప్పి ఒప్పించటం కష్టం. అందుచేత ఉపాధ్యాయులకు కరదీపిక.

శాస్త్రిగారు పీఠికలోనే ఈ విషయం చెప్పారు కూడా "ఈ వ్యాఖ్యానం సహజమైన శైలిలో వ్యావహారికంలో నడిచింది. ఆదినుంచీ (చిన్నయసూరి కాలంవరకు) వ్యాఖ్యానాలు, వివరణలు వ్యావహారికంలో వ్రాయడమే మన సంప్రదాయం. ఇవి గిడుగు రామమూర్తిగారి పరిశోధనను తలపించే మాటలు. నిజమైన సంప్రదాయం వ్యావహారికంలో రాయటమేనన్నారు గిడుగువారు.

ఇక 'గహనమైన శాస్త్ర చర్చలకు పోలేద'ని శాస్త్రిగారే రాశారు కూడా. విద్యార్థి అవగాహన దృష్ట్యా అది అనవసరం. వజ్ఝలవారి 'సంహితా సర్వస్వం' గొప్పదే - కాని ఆచార్య దేవళ్ళ చిన్నికృష్ణయ్యగారు తమ తొలి పలుకులో భావించినట్టు వజ్ఝలవారు 'సర్వజ్ఞు'లు మాత్రం కారు. సర్వజ్ఞత మానవుడికి అసంభవం. వ్యాకరణాలన్నిటికీ భాషాచైతన్యపరమైన పరిమితులు కొన్ని ఉన్నాయి- అవి ప్రాచీన భాషకు రాసినా; నవీన భాషకు రాసినా వాటి 'విశ్వతోముఖ' లక్షణం - వివరిస్తున్న సామగ్రి వరకే - వ్యాకరణ రచన ఒక కసరత్తు. కంప్యూటరైజేషన్ వంటిది. ఆ సామగ్రిని వివరించటంలో ఆ వ్యాకరణం ఎందాకా సమగ్రం అన్నదే ప్రశ్న - ఆ దృష్టితో బాలప్రౌఢలూ చాలవు — బాలకవి శరణ్యమూ చాలదు — అన్న అవగాహన శాస్త్రిగారికి వుంది కాబట్టే శాస్త్రచర్చల్ని ఆపివేశారు— భవిష్యత్తులో ఎవరు రాసినా ఈ చర్చలు చెయ్యబోరు. ప్రాచీన శబ్ద నిర్మాణాన్ని పరిచయం చేస్తారు. కవులు నన్నయ 'ఒరవడి'ని దిద్దుకుంటూ చిన్నయదాకా సాగిన ఒక సాహితీ సమ్మేళనోత్సవానికి 'దేహళీ దీపిక'లు సూరి సంగ్రహించిన శబ్దావళి - ఆయన కూర్చిన గణపాఠాలు - వాటిమేరకు ఆయన సూత్రాలు రచించారు.

ఆచార్య శాస్త్రిగారు పరిభాషను ఎంత మౌలికమైన భాషా విజ్ఞాన నేపథ్యంతో వివరించారో మూడు నిదర్శనాలు చూపిస్తాను.

(1) యరలవలు లఘువులని, యలఘువులని ద్వివిధంబులగు (బాల-1-18)

ఈ సూత్రాన్ని పూర్వ వ్యాఖ్యాతలు ఎలా వివరించారో ముందటి గ్రంథాల్ని చూసి పోల్చి చదువుకోవాలి. శాస్త్రిగారి పద్ధతి ఇది.

"ర-ఱ: ఇవి రెండూ దంత మూలీయ నాద కంపిత ధ్వనులే. ర-తాడితం. ఱ-కంపితం. అంటే, సాధురేఫలో కంటె శకటరేఫలో అధిక కంపనం ఉంటుంది అదీ వీటికి తేడా! ఈ తాడిత, కంపిత ర వర్ణాలు అర్థ భేదక సమర్థాలైన ధ్వనులు (వేరు-వేఱు; నీరు-నీఱు) గనుక అవి భిన్నవర్ణాలుగాని సరూపాలు కావు" (పు. 43)

శకటరేఫను గురించిన శాస్త్రీయావగాహన తులనాత్మక ద్రావిడ భాషా పరిశీలనవల్లనే సాధ్యమైందని పండితులందరూ అంగీకరించారు మూల ద్రావిడంలోని పదమధ్య దంతమూలీయ ట వర్ణం స్పర్శ లక్షణాన్ని కోల్పోయి కంపితధ్వని అయింది- అదే శకటరేఫ- అని పరిశోధనలు నిరూపించాయి - ఇది చెప్పకుండా ఎంత తర్కాన్ని గుమ్మరించినా విద్యార్థి చైతన్యవంతుడు కాజాలడు.

(2) కావ్యభాషలో దీర్ఘాచ్చు తరువాత సాధ్యపూర్ణ బిందువు ఉండదు: (దీర్ఘముమీద సాధ్యపూర్ణము లేదు బాల-1-15) - శాస్త్రిగారు ఇలా వ్యాఖ్యానిస్తున్నారు:

"నన్నయ యుగంనుండి కావ్యభాషకు ఆధారభూతమైన మాండలికంలో దీర్ఘంమీద ఉన్న అనుస్వారం తేల్చి పలకబడటం వలన అది అర్ధానుస్వారం అయింది. ఉదా॥ తేంటి > తేఁటి. కాని బహువచనంలో లకారంతో కూడి సంయుక్తాక్షరంగా ఏర్పడినప్పుడు ఈ అనుస్వారం లోపించ(డం)లేదు.

| | ఏక | బహు |
|---|---|---|
| మొదటి దశలో | తేంటి | తేంట్లు |
| రెండవ దశలో | తేఁటి | తేంట్లు |

ఈ విధంగా ఈ సూత్రానికి తేంట్లు, ఏండ్లు వంటి బహువచన రూపాలు అపవాదాలుగా ఏర్పడటం సంభవించింది." (పు 57)

ఈ సూత్రంమీద పూర్వ వ్యాఖ్యానాలు ఎంత క్లిష్టరీతిలో భాష్యాలు చెప్పాయో ఒకసారి పరిశీలించటం మంచిది. చారిత్రక దృష్టితో భాష ఎంతో 'సింపుల్' మెకానిజం - ఆ దృష్టి లేకపోతే- అది తర్కానికి ప్రసవపయిపోతుంది. శాస్త్రిగారి మాటలు శాసనాధారాల్ని నేపథ్యంలో గల్గింది కాబట్టి ఇక్కడ గతి తర్కముంది.

(3) బహువ్రీహిని స్త్రీ వాచ్యంబగుచో నుపమానంబు
మీఁది మేనునకుఁ బోఁడియగు (బాల-6-28)

సూరి ప్రకారం అలరు + మేను → అలరుబోఁడి అవుతుంది. ఈ సూత్రం 'మేను'కి బదులుగా 'బోఁడి' విధించింది.

దీనిమీద కొంత చారిత్రకమైన వివరణ అవసరమని ఎలాగూ తెలుస్తోంది. ప్రౌఢవ్యాకర్త మేను/బోడి సంబంధాన్ని మరికొంత స్పష్టంగా నిర్వచించారు

'అలరుఁ బోఁడీత్యాదులుపమాన పూర్వపద కర్మధారయంబులు' (ప్రౌఢ-5-19)

బాల వ్యాకరణం ప్రకారం అలరుబోఁడి బహువ్రీహి (అలరు వంటి మేను గలది), ప్రౌఢ ప్రకారం ఉపమాన పూర్వపద కర్మ ధారయం అలరుఁబోఁడి (అలరువలె మనోజ్ఞమయినది) దీనిమీద శాస్త్రిగారి వివరణ ఎంతో ప్రతిభావంతంగా వుంది.

"బాలవ్యాకరణ విధానమున 1. బోఁడి కృతకరూపం. మేను శబ్దానికి దీనికి సంబంధం లేదు. 2. బోఁడికి ముందు అర్ధానుస్వారం కలుగదు. 3. విరిబోణి వంటి ణాకార ఘటిత రూపం సిద్ధించదు. ప్రౌఢ వ్యాకర్త అలరుఁబోఁడి మొదలైనవాటిలో ఉత్తరపదం పోఁడి కాదగునని చెప్పి రూపసాధన ప్రక్రియ సూచించారు...అలరుఁబోఁడి ఇత్యాదులలో 'పోఁడి' ఉత్తరపదంగాను, ఇవి బహువ్రీహి సమాసాలు గాను గ్రహించడం యుక్తం. 'అలరువంటి మేను కలది' అనే అర్థమే ఈ సమాసానికి సరిపడి వుంది ... పోఁడి 'పోలు' ధాతువుకు సంబంధించిన రూపం. పోలినది అని అర్థం సి ఎఫ్. తమిళం. పోన్దు-అలరును పోలినది అలరుఁబోఁడి. అలర్వాదుల సాహచర్యంలో ఈ శబ్దానికి చక్కదనము అనే అర్థం ఏర్పడి, సుమాంగి, లతాంగి ఇత్యాది సంస్కృత సమాస సామ్యంచేత అలరుబోఁడీత్యాదులు బహువ్రీహి సమాసాలుగా గ్రహింపబడినవి"

(పుటలు 357-588-647)

ఇతర పదాల సాహచర్యంతో అర్థాలు ఏర్పడటం; ఇతర సమాసాల సామ్యంతో - ఒక సమాసంగా గ్రహింపబడటం - అనే మాటలు వ్యాకరణానికి కొత్త బాటను చూపెడుతున్నాయి. అంచేత 'తనరుచి బ్రదుకుగా' శాస్త్రిగారు మరలా 'దీపిక'ను రాయలేదు. వారు చరిత్ర స్పృహతో వ్యాకరణాన్ని తిరిగి రచించాలన్న 'తపన'తో ఎంతో బాధ్యత కల్గి చేసిన రచన ఇది. ఇలాంటి పనిని కోరాడ రామకృష్ణయ్యగారు 'సంధి'ని గురించి 1940ల ప్రాంతంలోనే చేశారు. శాస్త్రిగారు ఆ సంప్రదాయాన్నే కొనసాగించారు.

# అంతులేని ఆకాశం

మూలం :
శ్రీమతి నందినీ శతపథి

అనువాదం :
శ్రీ బాసంగి శ్రీరాములు

'సువ్రతా!' - ఆవేదన నిండిన గొంతుతో పిలిచింది రీటా. కాని సువ్రత వెనుకకు తిరగలేదు. చిన్నపిల్లాడిలా, అమాయకంగా మొహం కిందకుపెట్టి పరుపుమీద వాలివున్నాడతడు. అదొక చిన్న యింటిలోని చక్కగా అమర్చబడిన పడకగది. సువ్రతవైపు ఆశాభంగం చెందిన కళ్ళతో చూస్తూ, ఆ గదిలో రీటా కూర్చొని వుంది.

గదిలోని కాంతి గల దీపాలన్నీ ఆర్పివేసి వున్నాయి. మంచం ప్రక్కగా వున్న బల్లమీద అమర్చిన విద్యుద్దీపంలోని నీలి బల్బు మసకగా కాంతి కిరణాలను ప్రసరిస్తోంది. ఆ మసక వెల్తురులో అందగాడు, ఆరోగ్యవంతుడైన సువ్రత యక్షరాజ్యంలోని రాకుమారుడిలా కనబడుతున్నాడు.

కాని ఏమిటిది? యక్షుల కథలోని రాకుమారునిలా, సువ్రతను ఎవరో మంత్రదండంతో మంత్రించినట్లుంది. విమాన సారధిగ, సువ్రత తన ఉద్యోగ ధర్మాన్ని పూర్తిచేసి యింటికి వచ్చిన తరువాత, మరో మనిషిలా కనబడసాగాడు. అతని కళ్ళలో విపీలాకాశపు చీకటి నిండివుంది. ఏ మనిషిగాని, వస్తువుగాని, వాటిలో కనబడడంలేదు - అతని హృదయ సముద్రంలోని అగాధాన్ని ఎవరి గొంతు కూడ దరి జేరలేకపోతోంది.

అతనికి తినాలని కాని, ఎవరితోనైనా మాటాడాలని కాని అనిపించలేదు. సోఫాపై బట్టలైనా మార్చుకోకుండా, ప్రాణం లేనివాని మాదిరిగా, జారగిలబడి వుండిపోయాడు. రీటా చాలసార్లు పిలిచి, ప్రతిమాలగా, బట్టలు మార్చుకొని, వెంటనే విశ్రాంతికై పరుపుపై వాలిపోయాడు.

విమానంలో ప్రయాణించేవారిలో వెవరినైనా ప్రేమించాడా? బాగా చదువుకొన్నదీ, అందమయినదీ అయిన రీటా, యిదే ప్రశ్నను, తన పెళ్ళి తర్వాత, ఎన్నోసార్లు వేసుకొంది. మరెవరిని అడగగలదు?

చాలసార్లు రీటా, తన ఆత్మపరిశీలన కూడ చేసుకుంది. క్రొత్తగా పెండ్లి చేసుకున్న భర్త, తనపట్ల అనాసక్తతగా వుండటానికి, తన ప్రవర్తనలో ఏదేనా లోటు వుందేమోనని తెలుసుకోడానికి ప్రయత్నిస్తోంది. సువ్రత మనసును తెలుసుకోడానికి నిజానికి చాల ఆరాటపడుతోంది కాని ఆమెకు సహాయపడేదెవ్వరు? అదొక పెద్ద పట్టణం - మరి, వాళ్ళకు ఆత్మీయులైన స్నేహితులెవరూ లేరు. సువ్రత ఆలోచనలతో సతమతమవ్వడానికి కారణమేమిటో ఆమెకెవరు చెప్పగలరు? మరొక లోకానికి చెందిన మనిషిలా వుంటాడు. తన యింటిలో రక్తమాంసాలు కలిగిన మరో మనిషుందని బహుశ అతను గుర్తించలేదేమో!

కాని అప్పుడప్పుడు, మబ్బు పట్టిన ఆకాశంలో చిన్న ఆశా కిరణాలు తొంగిచూస్తున్నట్లు కనిపించేవి. 'రీటా! మాంసం నెయ్యితో వండితేనే నాకిష్టం - సుగంధ ద్రవ్యాలతో వద్దు. నీకు తెలుసునా, మా అమ్మ మాంసం అలాగే వండేది' అనేవాడు.

ఇంకేమి చెప్తాడో విందామని, రీటా అతనిప్రక్కనే కూర్చొనేది. కాని అకస్మాత్తుగ సువ్రత మౌనం దాల్చేవాడు. ఎన్ని పర్యాయాలు ప్రయత్నించినా, అతనింకేమీ మాటాడేవాడు కాదు.

* * *

ఏ స్నేహితునితోగాని, బంధువుతోగాని, సువ్రత ప్రమేయం పెట్టుకొనేవాడు కాదు. ఎయిర్‌లైన్సు ఆఫీసర్లు కొందరు, నాట్య సంగీతాలతోనో, తిని త్రాగడాలతోనో కాలక్షేపం చేస్తుంటే, సువ్రత మాత్రం పుస్తక మొకటి చేతపట్టుకొని కూర్చొనేవాడు. అయినప్పటికి, సువ్రత, సంఘంలో ఇతరులతో కలియకుండా వుండేవాడని ఎవరూ అనలేరు. వాళ్ళింటికి బంధువెవరు వచ్చినా, అతని యెడల, చాలా ఆత్మీయంగా వుండేవాడు. సువ్రత, తాను ఎక్కువగా మాట్లాడకపోయినా, యితరులెవ్వరు మాట్లాడినా శ్రద్ధగా వినేవాడు. రీటాకు ఓదార్పిచ్చే విషయ మిదొక్కటే. ఆ గంటలో మాత్రమే రక్తమాంసాలతో జీవిస్తున్న మనిషిలా భావిస్తుండే దతనిని రీటా. అందువలనే ఆమె తన యింటికి బంధువులను ఎల్లప్పుడూ ఆహ్వానిస్తుండేది.

కాని ఎవరైనా వాళ్ళింటి కెందుకొస్తారు? ఇతరుల యిళ్ళకు వెళ్ళాలనే కనీస మర్యాద పాటించని వాళ్ళింటికి!

చాలసార్లు స్నేహితులు, బంధువుల యిళ్ళకు వెళ్ళడానికి సువ్రతను ఒప్పించ ప్రయత్నించేది, రీటా. కాని ప్రతిసారి ఓడి పోయేదామె. వెళ్ళనని చెప్పకుండా, ఏదో సాకు చెప్పేవాడు— సువ్రత వెళ్ళకపోవడానికి. అందుచేత, చివరకు స్నేహితులు, బంధువులు తమ రాకపోకలు తగ్గించేశారు. ఇప్పుడు వాళ్ళింటికి వచ్చే వాళ్ళెవరూ లేరు. రీటాకు ఆందోళన, అవమానం కలిగించేదీ అనాసక్తత చివరకు తన ఓరిమిని కోల్పోయి ఇండియన్ ఎయిర్‌లైన్సు కార్పొరేషను మేనేజరుగారి దగ్గరికెళ్ళి సువ్రతను గురించి తన గోడు వెళ్ళబోసుకొని, ఏదైనా పరిష్కార మార్గం చెప్పమని వేడుకొంది.

కాని పాపం! మేనేజరుగారి సమాధానం కూడ, నిరుత్సాహం నుండి కాపాడలేకపోయిందామెను. మేనేజరు అన్ని విషయాలు భోగట్టా చేసి, సువ్రతకు ఏ స్త్రీతోను సంబంధం లేకపోవడమేకాక, విమానంలో మాటాడవలసిన అవసరం వచ్చినపుడు కూడ ఎవరితోనూ మాటాడడని రీటాకు చెప్పాడు. పైలట్ సువ్రత విమానాన్ని ఎత్తుగా తీసుకు పోతున్నపుడు, చిన్న పక్షిలా అది కనుమరుగైనప్పుడు, అంతులేని ఆకాశంవైపు ఆకర్షితుడై తన పరిసరాలనే మర్చిపోయేవాడు. తోటి ఉద్యోగులు, స్నేహితులు కూడ అతనినిగూర్చి గొప్పగా చెప్పుకొనేవారు.

* * *

ఒకనాటి ఉదయం, మామూలు రీతిలోనే తన కార్యక్రమాలను వేగంగానే ముగించుకున్నాడు సువ్రత. పరుపుపై వుండగానే ఒక కప్పు టీ త్రాగాడు. విశ్రాంతి సమయంలో వేసుకొనే బట్టలు తొడుక్కుంటూ నెమ్మదిగా సినిమా పాటొకటి పాడుకోసాగాడు.

రీటా గదిలోకి వచ్చి తువ్వాలును సువ్రత కందిస్తూ 'వేడినీళ్ళు స్నానాల గదిలో సిద్ధంగా ఉన్నాయి' అంది. సువ్రతతో ఆమె యాంత్రికంగా ప్రవర్తించ నారంభించింది. వెళ్తున్న ఆమె భుజాలు రెండింటిని పట్టుకొని, సువ్రత తనవైపు తిప్పుకొన్నాడు 'నన్ను వేగంగా పంపించెయ్యాలని తొంతర పడుతున్నావు కదూ! ఎక్కడికైనా వెళ్ళాల్సి వుందా? లేక మనింటికెవరైనా వస్తున్నారా? అని చిరునవ్వుతో అన్నాడు.

రీటా చికాకు పడింది. తన భుజాలపైనుండి అతని చేతులను విదిల్చి 'అందరూ మీలాంటి మర్యాద తెలియనివాళ్ళే ననుకుంటున్నారా?' అంది.

నివ్వెరపోయినా, సువ్రత నిగ్రహించుకున్నాడు. కన్నీటి మేఘం - అలముకొందాతని ముఖంలో. నెమ్మదిగా స్నానాల గదివైపు వెళ్ళసాగాడు. రీటా ఒంటరి హృదయం బాధపడసాగింది. తొందరగా అతనివైపు వెళ్ళి, రెండు చేతులను పట్టుకొంది. ఆమె వైపు చూడకుండా 'ఏమిటన్నావు' అని నెమ్మదిగా అడిగాడు సువ్రత. బహుశా అతని కళ్ళనీళ్ళను ఆమెకు కనబడనీయ కూడదనుకొన్నాడేమో!

'పొరపాటయింది. క్షమించండి-నన్ను! కూర్చొనే గదిలోనికి రండి. ఈ రోజు మీకు శలవు' సువ్రతవైపు తిరుగుతూ అంది రీటా.

సువ్రత, దగ్గరగా లాగుకున్నాడామెను. అతని కన్నీళ్ళు రీటా తలపై పడ్డాయి. ఆమెతోపాటు అతిథుల గదికి బదులుగా, పడకగదికి దారితీసాడు. రీటాకు ఈ అసాధారణ ఆవేశానికి కారణం తెలియకపోయినా, అతనికి చేరువ కావడం సంతోషాన్నిచ్చింది. మౌనంగా కూర్చొందామె. సువ్రత ఆమె నడుమును గట్టిగా పట్టుకొన్నాడు అయితే రీటా ప్రతిబింబం అతని కళ్ళలో వుందా? లేదు. అంతులేని ఆకాశంలోని చీకటి మాత్రమే వుంది. అతని చూపులు ఆకాశంవైపు మళ్ళినాయి.

అతని మౌనం క్రమంగా భరించలేందిగా మారింది. బయట ప్రపంచపు రణగొణ ధ్వనులు, రీటా నిశ్చలతను భంగపరుస్తున్నాయి. అతని దగ్గరనుండి కదలి వెళ్ళాలని ఆత్రుత పడుతోంది. కాని సువ్రత కిదేమీ తెలియడంలేదు. అతను ధ్యాననిమగ్నుడైవున్నాడు.

బయటనుండి ఎవరో పిలుస్తున్నట్లుగ గంట మ్రోగింది. సువ్రత నివ్వెరపోయాడు. రీటా తలుపు తెరవడానికి పరిగెత్తింది. చాలాసార్లిలా జరిగింది. సువ్రత ఏదో చెప్పాలనుకుంటున్నా నోటి నుండి మాటలు బయటకు రావడంలేదు. అంతులేకుండా అతని మాటలకై రీటా నిరీక్షించ లేకపోతోంది.

కవరొకటి పట్టుకొని రీటా తిరిగి వచ్చింది మౌనంగా పరుపు మీద కూర్చున్నాడు సువ్రత. ఉత్తరాన్ని చూడబోయాడు. తెరిచి ఉత్తరాన్ని సువ్రత చదవటానికి వీలుగా అతని ముందుంచింది రీటా

ఉత్తరం చదువుతుండగానే వణకసాగాడు సువ్రత. అతని వింతైన ప్రతిస్పందనను, నెమ్మదిగా గుర్తిస్తూ వుండిపోయింది, రీటా సువ్రతకు తనపట్ల పూర్తిగా అనాసక్తత లేదని గర్వించింది.

'కాదు ఇది అసాధ్యం' - సువ్రత కేకవేసాడు ఉత్తరం కింద పడిపోయింది ఉత్తరాన్ని తీస్తూ, 'ఏమి టసాధ్యం? నేన వెళ్ళడమా?' అని అడిగింది, రీటా

'అవును రీటా, నీవెళ్ళొద్దు. విమానంలో నీవెళ్ళడానికి నేనంగీకరించను. నాకు కాకుండా పోతావు — నీవు పోగొట్టుకోబడతావు, రీటా!' పిచ్చివానిలా భయంగా ఆమె చేతులు గట్టిగా పట్టుకొన్నాడు. అతని కళ్ళు నీటితో నిండిపోయాయి.

ఆ ఉత్తమ విమాన సారధివైపు, నిశ్శబ్దంగా చూస్తూ వుండి పోయింది రీటా. తనను విమానంలో వెళ్ళొద్దని ఎందుకంటున్నాడు?

సుప్రవత, తనను తాను నిగ్రహించుకొంటూ రీటావైపు చూస్తూ యిలా అన్నాడు. 'నా మాటలు నీకు చాల ఆశ్చర్యం కలిగించినట్లున్నాయి. ప్రతిరోజు వేలకొద్దీ మనుషులను చాలా ఎత్తుకు తీసుకొని పోయేవ్యక్తి, నిన్ను విమానంలో వెళ్ళనీయడంలేదు. నీకు తెలుసుకదా, మా అమ్మ విమాన ప్రమాదంలో చనిపోయిందని. అవును రీటా, ఆమెను పోగొట్టుకొన్నాము. ఆమె భౌతిక అవశేషాలు కూడ దొరకలేదు. అలా నిన్ను పోగొట్టుకోబోను ఎన్నటికీ!

సుప్రవత తల్లి చనిపోయిందని రీటాకు తెలుసు. ఎప్పుడామెను గురించి అడిగినా, సుప్రవత గాభరా పడిపోవడమే గాకుండా తడబడతాడు. అందుకని ఆవిషయమై మరేమీ అడిగేది కాదు.

సుప్రవత చెప్పుకుపోతున్నాడు· 'అమ్మ చాలసార్లు విమానాలలోనే ప్రయాణించేది – స్వదేశంలోనైనా, విదేశాలకైనా ఆమెకు వీడ్కోలివ్వడానికి విమానాశ్రయానికి చాలసార్లు నేను వెళ్ళేవాడిని కూడ. ఆమె వెళ్ళిన విమానం ఆకాశంలో ఎత్తుగా ఎగురుతుంటే నా పసిమనసు చాలా నిరాశతో బాధపడేది. కన్నీరు నిండిన నా కళ్ళకు అంతా మసకగా కనబడేది, నా తండ్రితో యింటికి తిరిగి వచ్చేదాకా.'

అది సామాన్య విషయమే. తల్లినుండి వేరు చేయబడిన పిల్లవాడు బాధపడడంలో వింతేముంది? కాని రీటా సుప్రవత మాటలను శ్రద్ధగా వింటోంది. మొదటిసారిగా, మౌనంగా వుండే మనిషి ఎక్కువగా మాట్లాడుతున్నాడు.

'నేనేమనుకుంటుండేవాడినో నీకు తెలుసా? నేను పెద్దవాడినయాక విమాన సారధినై నా విమానంలోనే అమ్మను ఎల్లప్పుడూ తీసుకొని వెళ్ళాలని వూహించుకొనేవాడిని. అలా అయితేనే, నన్నామె విడిచిపెట్టి వెళ్ళదు. మా అమ్మ కూడ ఈ విషయమై ఎంతో ప్రోత్సాహాన్నిచ్చేది.

'ఆ రోజు వీడ్కోలివ్వడానికి విమానాశ్రయానికి నేను కూడ వెళ్ళాను. విదేశాలలో చాలకాలం వుండబోతుందామె. ఏడవాలనిపించినా, సిగ్గుచేత అలా చేయలేకపోయాను. మా అమ్మ కూడ ఆ రోజు అసాధారణ ప్రశాంతత కినబరిచింది. ఆమె ముఖం తెల్ల కాగితంలా పేలవంగా వుంది. బాధతో, ఆమె నాతో ఒక మాటైనా మాటాడలేకపోయింది కాని వెళ్ళేముందు నన్నొకసారి కావలించుకుంది.'

సుప్రవత గొంతు జీరబోతోంది. కన్నీటితో మొహమంతా తడిసిపోయింది. రీటా కూడ కన్నీటి నాపుకోలేకపోతోంది. నెమ్మదిగా సుప్రవత వీపు నిమిరి, ఓదార్చడానికి ప్రయత్నిస్తోంది

'అమ్మ తిరిగి రాలేదు, రీటా. ఆమె వెళ్తున్న విమానం ఏదో పర్వతాన్ని ఢీకొని కూలిపోయిందని భోగట్టా వచ్చింది మాకు. ప్రయాణీకులలో ఒక్కరి ఆచూకీ కూడ తెలియలేదు. ప్రతిరాత్రి నా కలలో మా అమ్మ రెండు పర్వతాల మధ్యనున్న లోయనుండి 'నా చిన్నారి తండ్రీ – ఈ అగాధంనుండి నన్ను వెలుపలికి తీసుకెళ్ళు' అని దీనంగా అడుగుతున్నట్లుండేది.

'నా విమానంలో అమ్మను తీసుకెళ్ళలేకపోయినా – ఆమెను వెతకాలి కదా. అందుకే నేను విమాన చోదకుడినయ్యాను. ఆకాశంలోకి వెళ్లే ప్రతిరోజు, పర్వతాలమీద ఎగురుతున్నపుడు, నాకు తెలియకుండానే నా కళ్ళు అమ్మకోసం వెతుకుతుంటాయి. విమానంనుండి దిగివచ్చిన ప్రతిసారి, మా అమ్మను కలవలేకపోయాననే బాధ నన్ను కలవరపెడుతుంది. నన్ను నేను నిగ్రహించుకోలేను. మా అమ్మలాగానే నీవు కూడ నన్ను విడిచి దూరమై పోవాలనుకుంటున్నావా?' – సుప్రవత, చిన్నపిల్లాడిలా రీటా చీరచెంగు పట్టుకొని ఏడవసాగాడు.

రీటాకు నోటమాట రాలేదు. సాహసంగా విమానం నడిపే సుప్రవతలో తల్లిలేని అనాధ బిడ్డను గుర్తించిందామె.



# ఆళ్ల బతుకులు

## శ్రీ టి. కృష్ణమూర్తి యాదవ్

సద్దిబొద్ది తిని
పొద్దుగాల్ల పనికాడికత్తరు
నెత్తిన సుట్టుబట్టలు పెట్టుకొని
సిమెంట్ కాంక్రిట్ తట్టలు మొస్తనే వుంటరు
అపార్ట్‌మెంట్లకాడ, అందమైన కట్టడాలకాడ
కంటాక్టర్లు సెప్పిన యాల్లకు రావాలి
మెస్త్రీలు సెయ్యిమన్నంత పొద్దు సెయ్యాలి
ఊళ్ళిడ్సిపెట్టి, బందుగుల్ని ఇడ్సిపెట్టి
పనులు సేసుకొని బతుకుదామని
పట్నమొచ్చినోల్లు
పనికాడనే నివాసాలు
గుడిసెలమీద
ప్లాస్టిక్ కాగితాలు కప్పి
ఉర్వకుంట, తడ్వకుంట సేసుకుంటరు
బలంగా గాలీస్తె
గాలిబుగ్గలెక్క
గుడిసెలు పైకిలేత్తయి
వెండుగచ్చిన సుఖరలెనోల్లు
ఎల్లవ్వకు, మల్లవ్వకు
రాయికి, రప్పకు మొక్కుతనే వుంటరు
సరిగ్గ ఒంటికి
సానముండదు
కంటికి కునుకుండదు
కన్నబిడ్డలకు కట్నముండదు
కాళ్ళకు సెప్పులుండయి
మాషికల బట్టలేసుకుంటరు
నెత్తులకు సమురుండదు
నల్లపూసల్ల
ఈసమెత్తు బంగారముండదు.
ఎషాలు షార్పులేనోల్లు
మొసాలు సెయ్యనోల్లు
గద్దెలు ఎక్కడం, దిగడము నేర్వనోల్లు
కట్టం సేసి సేసి
సెమట లీలు వడిపి వడిపి
రక్తమును నీల్లు సేసుకొని
బతుకులు ఎల్ల తిస్కునేటోల్లు

---

# గుండెలో అల్లరి

## శ్రీ చెన్నోజు రామ్‌మోహన్‌రావు

మనసులోని ఊగిసలాటలా
అంతరిక్షంలో కదిలే ఈ కాలనాళిక
అంతంలేని ఆత్మలా — ఉత్కృష్టమై
రాజీతత్త్వం లేని ఒకానొక సిద్ధాంతంలా
సహవాసుల బలహీనతలతో జీవితం వెలిగించుకునే
ఈ లోకం ముఖంపై - రంగులు - రంగులు—
వింత వింత ఇంద్ర ధనువులు
ప్రగతి సాధనలోని వివిధ అసమగ్ర దశల్లా
గుండెలో చేరి కల్లోలం రేపుతున్న
శ్రీ సరస్వతీదేవి చిలిపి అల్లరిలా
అర్థంకాని ఈ పురాతన నిరామయ సృష్టి భాండంలా-
రంగులు — రంగులు—
గుండెలో అల్లరి భావ ఫిరంగులు

శ్రీ సూర్యదేవర రవికుమార్

# కవిజనాశ్రయ కర్తృత్వ పరిశీలన విషయము

సుమారు 5 సం॥ క్రితం వేములవాడ భీమకవిని, కవిజనాశ్రయాన్ని గూర్చి కొంత పరిశీలించిన నాకు కవిజనాశ్రయకర్త వేములవాడ భీమకవికాక, మరొక భీమన అనే సందేహాన్ని కలిగించాయి ఈ క్రింది వ్రాతలు.

కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్ పుస్తక భాండాగారములోని 320వ సంఖ్యగల కవిజనాశ్రయ తాళపత్ర ప్రతిలోని 19వ పత్రము వెనుకగల ఈ వ్రాత. "ఉత్తమ గండచ్ఛందం, హనుమచ్ఛందం, అనన్తచ్ఛందం, కవిరాక్షసచ్ఛందం, జయదేవచ్ఛందం, గోకర్ణచ్ఛందం, నీలకంఠచ్ఛందం, ఆది భీమనచ్ఛందం, అనగా 8 విధముల ఛందములు" (పరిషత్పుస్తక భాండాగారము - లక్షణ గ్రంథములు)

కస్తూరి రంగకవి "ఆదిమకవి భీమనార్య ముఖ్యులు పల్కు ఛందమ్ములను గల్గు చందములును" అని వ్రాసిన వ్రాత (రంగరాట్ఛందము 3- .

పొత్తపి వేంకటరమణకవి. లక్షణ శిరోమణిలోని "యతులు కవితా మాహాత్మ్యంబునందాది భీమన్నగారి మతంబున దశవిధములనంబడియె (4-16), 'పురాతనమైన భీమనగారు రచియించిన సమవృత్తాధికారమునందు...' 8-116) అన్న వ్రాతలు.

పై వ్రాతలలోని 'ఆదిభీమన' 'ఆదిమకవి భీమన' 'పురాతనమైన భీమన' అన్నమాటలు. కవిజనాశ్రయకర్త వేములవాడ భీమకవి కాడని, అంతకుపూర్వుడైన భీమన అనే ఒక అభిప్రాయాన్ని కలిగిస్తాయి. ఈ భీమనే తొలి తెలుగుకవి అని యీ మాటలవలన స్ఫురిస్తుంది. అయితే, దీనిని గట్టిగా బలపరిచే ఆధారాలు ఏమీ లేవు. అదీకాక వేములవాడ భీమకవే ఛందఃకర్త అని చెప్పిన ప్రాచీన కవులు కొందరున్నారు.

భీమేశ్వర లబ్ధకవితా వాచాసిద్ధిగల వేములవాడ భీమనార్యుండొనరించిన కవిజనాశ్రయంబను ఛందంబునందు' అని ఓరుగంటి రామకవి కవితాలక్షణ సారమునందు, 'ఛందం మొదల వేములవాడ భీమకవిగారి ప్రయోగం ఉన్నది' అని వార్తాకవి రఘునాథయ్య లక్షణ దీపిక యందు (చూ. సాహితీవాలభ్యమున దొరస్వామి శర్మగారి వ్యాసము లేదా సమగ్రాంధ్రసాహిత్యము 1-2 11) "కవిజనాశ్రయమున 'శ్రీకాంతా' యని వేములవాడ భీమకవియును" అని అప్పకవి అప్పకవీయమున (4-67), 'ఛందో నిబంధన చాతురీ ధౌరేయు వాగ్ధాము వేములవాడ భీము' అని ఆంధ్రకవి రామయ్య విష్ణుకాంచీ మాహాత్మ్యమున (ప్రబంధ రత్నావళి పుట 124) పేర్కొన్నారు. దీనినిబట్టి కవిజనాశ్రయ కర్తృత్వ విషయంలో ప్రాచీనులకే అభిప్రాయ భేదాలు కలవని గ్రహించగలము. సుప్రసిద్ధుడైన వేములవాడ భీమకవి అని కొందరు, ఆదిమ భీమన అని మరికొందరు ఈ విషయమై అభిప్రాయపడినట్లు స్పష్టము. ఇక రేచన కర్తృత్వాన్ని ప్రాచీనులెవరూ ప్రతిపాదించినట్లు కన్పించదు. (వార్తాకవి రఘునాథయ్య లక్షణదీపికలో రేచన ప్రసక్తిని తెచ్చాడు. చూ సాహితీ వాల్లభ్యమున దొరస్వామి శర్మగారి వ్యాసము) దీనికి కులమత ద్వేషాలు కారణాలు కావచ్చును.

ఇప్పుడు డా॥ ఆర్ శేషశాస్త్రి, శ్రీ జె. సదానందంగారలు ఈ విషయమై కృషిచేసి 1988 జులై 'భారతి'లో ఒక వ్యాసాన్ని ప్రచురించటం సంతోష సంభ్రమాలతోపాటు అసంతృప్తిని కూడ కలిగించింది. కవిజనాశ్రయకర్త వేములవాడ భీమకవికి భిన్నుడైన ఆది భీమన అన్న నా సందేహం సరియైనదే అన్న భ్రమకు ఈ వ్యాసం నన్ను మొదట లోనుచేసి సంతోష సంభ్రమాలను కలిగించినా, తరువాత ఈ ప్రతిపాదన ఎంతో అసంగతమైనదిగా వ్యాసకర్తల కృషి అసంతృప్తిని కలిగించేదిగా నాకనిపించినది.

నన్నయభట్టు వ్రాసిన ఆంధ్రశబ్ద చింతామణిని భీమన గోదావరిలో కలిపాడని, భీమన రాఘవ పాండవీయాన్ని నన్నయ 'అడంచె'నని అప్పకవి చెప్పిన మాటల వలన (పీఠిక 44, 51 పద్యాలు) వారిరువురూ సమకాలికులని భావించవలసి ఉన్నది. అప్పకవి మాటలే కాక, జనశ్రుతిలో కూడ వీరిరువురు సమకాలికులని తెలిపే కొన్ని గాథలున్నాయి. వీటి యాదార్థ్యాన్ని నిర్ణయించే సాధనాలేమీ యీనాడు లేవు. అయితే, అప్పకవి నన్నయదిగా చెప్పిన ఆంధ్రశబ్ద చింతామణి నన్నయ రచన కాదని, క్రీ.శ. 16వ శతాబ్దికి చెందిన అపర నన్నయభట్టు దీని కర్త అని ఇటీవల డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు చాల చక్కగా నిరూపించారు. (చూ. మార్చి 1988 భారతి) అప్పకవే మరొకచోట (2-873) 'చక్కదనంబు దీవి...' అనే పద్యాన్ని ఉదాహరిస్తూ అది "వేములవాడ భీమకవి...ముత్తిక దిగిన మారని జావదిట్టిన చాటుధార" అని పేర్కొన్నాడు. ఇంకొకచోట (4-67) "కవిజనాశ్రయమునందు 'శ్రీకాంతా' యని వేములవాడ భీమకవియును" అని వ్రాసి కవిజనాశ్రయము వేములవాడ భీమకవిదిగా చెప్పాడు. ఇలాగే కవిజనాశ్రయములోని పద్యాలను ఉదాహరిస్తూ లక్షణ కవులనేకులు అవి భీమనవని పేర్కొన్నారు. వేములవాడ భీమనవని స్పష్టంగా పేర్కొన్న సందర్భాలు తక్కువ. పొత్తపి వేంకటరమణ కవి లక్షణ శిరోమణిలో ఉదాహరించిన కవిజనాశ్రయములోని పద్యాలను, కొన్ని చాటు పద్యాలను కేవలం భీమనవిగానే పేర్కొన్నాడు. ఆ భీమన ఆదిభీమన, పురాతనభీమన అనే చెప్పాడుగాని, వేములవాడ భీమన అని చెప్పలేదు. కాబట్టే లాక్షణికులు కవులను, కావ్యాలను గురించి చెప్పిన మాటలు అన్యథా నిరూపించబడితే తప్ప ప్రామాణికములు కాజాలవు. జయంతి రామయ్యపంతులుగారు అప్పకవి పై మాటకు కొంత విలువనిచ్చి కవిజనాశ్రయకర్త వేములవాడ భీమకవి అని భావించారు.

డా॥ శేషశాస్త్రి, శ్రీ సదానందంగారలు కవిజనాశ్రయం అవతారికలో గలవని జయంతిరామయ్యగారు ప్రకటించిన పద్యాలలో 'వేములవాడను వెలసిన' 'రేచన సంతోషించగ' అని సాగే పద్యాలు మార్పునకు గురైనాయని భావించి, వాటికి క్రొత్త పాఠాలను కల్పించారు ఇంతకుముందు ఉదాహరించిన అప్పకవీయములోని "కవిజనాశ్రయమునందు 'శ్రీకాంతా' యని వేములవాడ భీమకవి" ప్రారంభించాడని చెప్పిన మాటలు, వార్తాకవి రఘునాథయ్య లక్షణ దీపికలో "ఛందం మొదల వేములవాడ భీమకవిగారి ప్రయోగం ఉన్నది. 'శ్రీకాంతాతిప్రియ' అన్నాడు" అన్నమాటలు, కవిజనాశ్రయము 'శ్రీకాంతా' ఇత్యాది పద్యంతో ప్రారంభమౌతున్నదని స్పష్టం చేస్తున్నాయి. ఈ మాటలను మనం విశ్వసించితే ఒకే ప్రతిలో లభించినవని జయంతి రామయ్యగారు ప్రకటించిన ఆరు అవతారికా పద్యాలు ప్రక్షిప్తాలనక తప్పదు. పైగా, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు "ఇంచుమించుగ ముప్పది నలువది కవిజనాశ్రయపు దాళపత్రప్రతులాంధ్రదేశమునను దక్షిణ దేశమునను బరిశీలించితినిగాని యా పద్యములు నాకెందును గానరాలేదు" (ప్రబంధ రత్నావళి పీఠిక) అని వ్రాసినదానిని కూడ మనం పరిగణనలోనికి తీసుకొనవలసి ఉంటుంది. అప్పకవీయములో ఈ సందర్భంగా కవిజనాశ్రయముతోపాటు అప్పకవి ఇచ్చిన ఇతర కావ్యప్రారంభ పద్యోదాహరణలు వాస్తవమైనవే మరి కవిజనాశ్రయమును గూర్చిన ఈ విషయం వాస్తవము కాదని ఎలా నిరూపించగలము? కనుక జయంతిరామయ్యగారు ప్రకటించిన ఆరు అవతారికా పద్యాలు ప్రక్షిప్తాలని, కవిజనాశ్రయము 'శ్రీకాంతా' ఇత్యాది పద్యంతోనే ప్రారంభమౌతున్నదని విశ్వసించటములో అసంగతమేమీ ఉండదు. కాని వ్యాసకర్తలు "ఆ పద్యాలే ప్రక్షిప్తాలనటం సబబు కాదు గ్రంథసంపాదనా శాస్త్రపరంగా చూస్తే అలాంటి ఆలోచన తప్పు కూడ" అనే అభిప్రాయాన్ని కలిగిఉన్నారు. ఇది ఎంతో చింతించదగిన విషయము.

"కవిజనాశ్రయం నన్నయ్యకు పూర్వమే రచింపబడినా నన్నయ్యకు కుందేమీలేదు. ఆయన భారతంతో సరితూగగల్గిన మరో గ్రంథం ఆయన కంటె పూర్వం రచింపబడింది దొరికేంత వరకు నిస్సంశయంగా నన్నయ్యే ఆదికవి" అని వ్యాసకర్తలు వ్రాశారు. ఈ వ్రాత ప్రమాదకరమైనది. "జినవల్లభుడూ, పంపమహాకవీ నన్నయ్య కంటె పూర్వులు. వారికీ సమకాలికుడైన భీమన నన్నయ కావ్యాన్ని లక్ష్యంగా పెట్టుకోనే అవకాశం లేదు" "నన్నయ భారతాన్నే లక్ష్యంగా పెట్టుకొని కవిజనాశ్రయం రచింపబడింది అనేమాట అంగీకార్యం కాదు." అని వ్యాసకర్తలు స్పష్టంగానే చెప్పారు కవిజనాశ్రయకర్త కూడ "జయదేవాది చ్ఛందోనయమున సంక్షిప్తరూపున" తన గ్రంథాన్ని వ్రాసినట్లు చెప్పాడు కాబట్టి కవిజనాశ్రయము ఒక లక్ష్యగ్రంథాన్ని అనుశీలించిన లక్షణగ్రంథం కాదు. అప్పకవి "అప్రయుక్తంబులేల సెప్ప భీముఁడెఱిఁగి యెఱిఁగి" అని చెప్పిన మాట (3 260) కవిజనాశ్రయము లక్ష్యగ్రంథాలను పరిశీలించి రచించిన లక్షణ గ్రంథమని భావింపజేస్తుంది. కాని అది సరికాదు. కనీసం ఆ కాలంలో తెనుగులో గల పద్యరచనా విధానాన్ని కూడా పరిశీలించి రచించబడినది కాదు. ఆ విధంగా లక్ష్యాలకు లక్షణాలను చెప్పే గ్రంథమయితే, మధ్యాక్కర విషయంలో యుద్ధమల్లుని శాసనపద్యాలు వంటివాటిని నిర్లక్ష్యం చేసి దానికి నాల్గవ గణాద్యక్షరం యతిగా చెప్పిఉండదు కనుక కవిజనాశ్రయము నిస్సంశయంగా వేరొక భాషలోని ఛందశ్శాస్త్రాన్ని ఆధారంగా గ్రహించి రచించబడినదే అని భావించవలసి ఉంది. 'జయదేవాది చ్ఛందోనయమున' చెప్పబడిన గ్రంథమని అందే కలదు గదా! పైగా, ఆ పేరు సాత్త్వికమైనది. అది కవులకు మార్గదర్శకమైనది,

కవులను రక్షించేది అన్న భావాలను స్ఫురింపజేస్తుంది కాని కవి గజాంకుశము వంటి కొన్ని ఛందోగ్రంథ నామములవలె కవులను శాసించటానికి నిర్దేశింపబడింది అన్న భావాన్ని కలిగించదు. ఇదే తొలి తెలుగు కావ్యమని ఇదివరలో ('భారతి' అక్టోబరు 1959) శ్రీ దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారు వ్రాయగా, ఇటీవల (భారతి మే 1986) శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రిగారు ఈ వాదాన్ని మరింత స్థిరపరిచారు. కవిజనాశ్రయకర్త వాదీంద్ర చూడామణి శిష్యుడు. నన్నెచోడుని గురువైన జంగమ మల్లికార్జునుడు వాదీంద్రుడిని ఓడించాడు. కాబట్టి కవిజనాశ్రయకర్త, నన్నెచోడుడు సమకాలికులని, ఇద్దరూ 'వస్తు' కవితను ప్రస్తావించారు కాబట్టి 'ఒక రకమైన కవితోద్యమం బయలుదేరిన రోజులలో వాళ్ళే' అని శ్రీ ఆరుద్రగారి అభిప్రాయం. (సమగ్రాంధ్ర సాహిత్యం 1-122) ఈ విషయాలన్నీ నన్నయ ఆదికవి పీఠాన్ని పునాదులతో కదిలించేవే కనుక "కవిజనాశ్రయం నన్నయ్యకు పూర్వమే రచింపబడినా... నన్నయ్యే ఆదికవి" అని వ్యాసకర్తలు వ్రాయటం సమర్థనీయం కాదు. సత్యాన్వేషకులైన పరిశోధకులే నిష్పక్షపాతబుద్ధితో చారిత్రక సత్యాలను ధైర్యంగా ప్రతిపాదించలేకపోవటం, అంగీకరించలేకపోవటం ఎంతో విచారకరం.

వ్యాసకర్తలు కవిజనాశ్రయము రేచన కృతము అన్న వాదాన్ని తిరస్కరిస్తూ "గ్రంథమంతటా వేరొక వ్యక్తి రేచనను సంబోధించినట్లే ఉండడంవల్ల, "కవిజనాశ్రయము మల్లియరేచన సుకవి కవి జనాశ్రయమను ఛందము తెనుగుబాస నరుదుగ జెప్పెన్" అని రేచనకాక మరొకరు చెప్పినట్లే ఉంది. ప్రథమపురుషలో చెప్పబడిన ఈ పద్యాల మధ్యలో ఉన్నట్లుండి శ్రుతుఁడను శ్రుత్యంతంబులు అను పద్యములో సంబోధించటం ప్రారంభమౌతుంది. మరల కడపట మల్లియరేచన సుకవి జనాశ్రయుడీ ఛందంబు జెప్పె జనులకుఁ దెలియన్ అని ప్రథమపురుషతోనే ఈ గ్రంథం ముగిసింది ఈ వైవిధ్యం ఎందువల్ల? కవి వేరొకడు కావడంవల్లే." అని వ్రాశారు. ఆంధ్ర మహాభారతావతారికలో 'నానారుచిరార్థసూక్తి నిధి నన్నయభట్టు తెనుంగునన్ మహాభారత సంహితారచన బంధురుడయ్యె'నని ప్రథమ పురుషలోనే చెప్పబడింది. "భారతావతారిక ప్రథమపురుషలో నుండుటచే దానిని నారాయణభట్టు రచించెనని కొందఱూహించుచున్నారు. కాని యిట్లు ప్రథమపురుషలోఁ జెప్పికొనుట వినయ సంప్రదాయార్థములను చాటును. భాగవత రంగనాథ రామాయణములలోఁ గూడ నిట్టే గలదు" అని శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు వ్రాశారు (ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వము-పుట 171). కనుక ఇది ఆనాటి సంప్రదాయమని భావించుట మేలు. కవిజనాశ్రయములోని రేచన సంబోధనలను గూర్చి శ్రీ శాస్త్రిగారు 'రేచనయే యాత్మసంబోధనము సేయుచు వేమన పద్యములవలె నీ గ్రంథమును రచించెనని' అభిప్రాయపడ్డారు (పైది. పుట 720). శ్రీ ఆరుద్రగారు అవి 'అతను వాడుకొన్న విశేషణాలు' అని భావించారు. ఈ సంప్రదాయాలను, అభిప్రాయాలను తేలికగా కొట్టివేసి 'కవి వేరొకడు' అని భావించటం తొందరపాటే.

కవిజనాశ్రయకర్త 'వేరొక భీమన' అని ప్రతిపాదించటానికి ముందు దాని కర్త రేచన కాదని స్వప్రమాణముగా నిరూపించటం అవసరం. రేచన కృతికర్త అని కొందరు విశ్వసించిన విషయాన్ని కూడా ఈ సందర్భంలో గుర్తుంచుకోవాలి. తమ "ఈ ప్రయత్నం కేవలం ప్రాథమిక స్థాయి" అని చెప్పుకొన్న వ్యాసకర్తలు కవిజనాశ్రయ కర్తృత్వ విషయమై ఇదివరలో పలువురు పరిశోధకులు వెలిబుచ్చిన అభిప్రాయాలను పరిగణన లోనికి తీసుకొని వాటిని క్షుణ్ణంగా పరిశీలించకపోవటం అసంతృప్తిని కలిగిస్తోంది.

కవిజనాశ్రయకర్త వేములవాడ భీమకవిగాని, రేచనగానికాదని, వేరొకరని ఇదివరలోనే కొందరు పరిశోధకులు ప్రతిపాదించారు కాకతీయ ప్రతాపరుద్రుని కాలంలో వర్ధమాన పురాధిపతియైన భీమరాజు తమ్ముడు గోకర్ణుడు దీని కర్త అని, కళ్యాణ పురాధీశ్వరుడైన జగదేకమల్లుని సేనాపతి రేచన దీని కృతికర్త అని చిలుకూరి వీరభద్రరావుగారు ఆంధ్రుల చరిత్రలో వ్రాశారు కాని 'యా వ్రాఁతకాధారము లేవియుఁ గనఁబడి యుండలేదు' అని జయంతిరామయ్యగారు కవిజనాశ్రయ పీఠికలో వ్రాశారు. రేచనకు కవిజనాశ్రయుడని, గోకర్ణునకు శ్రావకాభరణాంకుడని బిరుదులున్నట్లు మానవల్లి రామకృష్ణ కవిగారు వ్రాస్తూ, దాని కుపబలకముగా కవిజనాశ్రయమున సంయుక్త యతి లక్షణములోని పద్యపాదము 'భాస్కర కులవిలసిత వార్ధి చంద్ర గోకర్ణనృపా' అని చూపించారు. (మానవల్లి కవి— రచనలు పుట 295). కాని, ఈ పద్యపాదము కవిజనాశ్రయ ముద్రిత ప్రతిలో కన్పించదు. కవిజనాశ్రయ కర్తృత్వ నిర్ణయ పరిశీలనలో ఈ అభిప్రాయాలను గురించి కూడ చర్చించవలసి ఉన్నది.

కవిజనాశ్రయమును మొదట పరిష్కరించి ప్రకటించిన జయంతి రామయ్యగారు "లోకములో దీనికి సర్వసాధారణముగా భీమని ఛందస్సను వాడుక కలదు.... అనేకములగు వ్రాత పుస్తకముల యట్టమీఁద 'భీమన ఛందస్సు' అని వ్రాయబడియున్నది" అని పీఠికలో వ్రాశారు. కాని కవిజనాశ్రయమున చాల స్పష్టముగ ఇది 'కవిజనాశ్రయమను ఛందము' (1-3 మరియు ఆశ్వాసాంతగద్యలు) అని చెప్పబడింది. లక్షణ గ్రంథాలలో కూడ ఇది ప్రముఖముగా కవిజనాశ్రయము అనే పేర్కొనబడింది. భీమన ఛందస్సు అన్న

వాడుక ఇటీవలిది—బహుశ అప్పకవి తరువాతి కాలమున ఏర్పడినది—కావచ్చును.

జయంతిరామయ్యగారు, వారి ననుసరించి చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు కవిజనాశ్రయము వేములవాడ భీమకవి రచన అని విశ్వసించారు. నన్నయ, తిక్కనల మధ్యకాలంలో ఉన్న వేములవాడ వంశజుడు, దక్షారామ భీమేశనందనుడు అయిన వేములవాడ భీమకవి పై పండితులు విశ్వసించినట్లు కవిజనాశ్రయకర్త కాదని యీనాటి పరిశోధనలు నిరూపిస్తున్నాయి. కవిజనాశ్రయము పదవ శతాబ్ది మధ్యకాలమున రచించబడినదిగా కూడా ఇవి సూచిస్తున్నాయి. ఇది రేచన కృతమని, తొలి తెలుగు గ్రంథమని పరిశోధకులు విశ్వసిస్తున్నారు. కుర్క్యాల శాసనము ఈ విశ్వాసానికి ప్రామాణికతను కలిగిస్తున్నది.

ఇప్పుడు ఈ వ్యాసకర్తలు కవిజనాశ్రయకర్త 'వేరొక భీమన' అని ఊహించటానికి కారణము కన్నడ ఛందోగ్రంధం 'కవిరాజమార్గ' ఇదివరలో భావించినట్లు నృపతుంగుని రచనగా కాక శ్రీ విజయుని రచనగా ఇటీవలి పరిశోధనలు నిరూపించటమట దీన్ని ఆధారంగా చేసుకొని "కవిజనాశ్రయ కర్తృత్వాన్ని నిషర్కచేసేప్పుడు కవిరాజమార్గపు నేపథ్యంలో పరిశీలించడంలో సూక్తమార్గం" అని వ్యాసకర్తలు నమ్మి, కవిజనాశ్రయ కర్తృత్వాన్ని పునఃపరిశీలించటం జరిగింది. ఈ పరిశీలనా ఫలితంగా అది 'వేరొక భీమన' రచన అని ప్రతిపాదించారు గాని అందుకు వారు చూపిన ఉపపత్తులు సారహీనాలు. ఈ సందర్భంగా కవిరాజమార్గ శ్రీ విజయుని రచనగా ఎలా నిరూపింపబడిందో తెలుగు పాఠకులకు కూడా 'భారతి' ద్వారా శ్రమ అనుకొనక స్థూలంగా వివరించవలసినదిగా వ్యాసకర్తలను ప్రార్థిస్తున్నాను.

# గొంగడి భోజనం

## శ్రీ వి. పి. చందన్ రావు

చిక్కుపడిన దారపు పోగులు
మన ఆలోచనలు
ఎంత అన్వేషించినా
దారం కొస దొరకదు నీకు

ఇక్కడందరం
కొద్దో గొప్పో దెబ్బతిన్నవారమే
మందహాసాల వెనుక
దుఃఖాన్ని దిగమింగుతున్న వాళ్ళమే

ఐనా
ఇక్కడ
ఎవడు మోసపోలేదో
ఎవడు గాయపడలేదో
ఎవడు కనీసం గుప్తంగానైనా దుఃఖించలేదో
వాడిని నాకు పరిచయం చెయ్యి

మనలో ప్రతివాడూ
గాయాలు దాస్తూ
గేయాలు రాస్తున్నవాడే

ప్రతివాడికి ఇక్కడ
సూదిపోట్లే - దూదికట్లే
తొడ చిలికి
నోట్లో చక్కెర పెట్టే
వ్యవస్థ మనది!
గొంగట్లో తింటూ
వెంట్రుకలేరే
అవస్థ మనది!

# ఈ మాసం - మీ నక్షత్రఫలం

**నవంబరు - 1988**

**మేషం** (అశ్విని, భరణి, కృత్తిక 1పా)

అశ్విని వారికి 1 నెలంతా కార్యవిజయము, ఉద్యోగాభివృద్ధి, కుటుంబ సంసార సౌఖ్యం మొదలగు వానితో గడచును. చివరివారంలో నలత, శ్రమ కలిగినను, మధ్యకాలం కొంచెం మెరుగుగా నుండును. ప్రతి విషయంలోను మందకొడితనము హెచ్చుగా నుండును. అనుకొనని విషయములు అప్రయత్నముగా, ఫలించుట జరుగును శుభ కార్యములలో పాల్గొనుట జరుగును కాని శ్రమ హెచ్చుగా నుండును.

భరణి వారికి శారీరక, మానసిక శ్రమ, ఆందోళనము, ధన వ్యయం కలుగును, నిరుద్యోగులకు ఉద్యోగము లభించును. వక్రంలో నున్న గురుశుక్రులు అనుకూలురు. కాని అధికబాధ ఉండదు అవ యోగం తొలగి - శుభయోగము అనుకూల వాతావరణ మేర్పడును. వర్తకులకు, విద్యార్థులకు, వ్యవసాయదారులకు, ఉద్యోగులకు అనుకూల ఫలితం కొనసాగును. అయితే ధనము ఖర్చు విషయంలో పనికిమాలిన వాటికగును.

కృత్తిక 1పా. వారికి నెలంతా అనుకూలంగా ఉండును. ఉద్యోగ వ్యవహారములు బాగుగా రాణించును. ఉద్యోగులకు ప్రమోషను లభించును అన్ని విషయములలో బాగుగా లాభించును అనుకొన్న కార్యములు ఫలించి ఉత్సాహాన్నిస్తాయి. సంతానమునకు అన్ని విధముల అభివృద్ధి కలుగును. ఉద్యోగులకు, వ్యవసాయదారులకు, విద్యార్థులకు మంచి ఉత్సాహం, సుఖ సంతోషములు కలుగును

**వృషభం** (కృత్తిక 2, 3, 4పా. రోహిణి, మృగశిర 1, 2 పా)

కృత్తిక 2, 3, 4 పా. వారికి గతంలో ప్రారంభమైన యోగము కొంత స్తంభించును. అయితే ఆర్థికంగా కలసివచ్చును ఉద్యోగ వ్యవహారాదులలో కొన్ని చిక్కులు తటస్థించి తొలగిపోవును దుబారా ఖర్చు జరుగును. అనవసరపు మాటలు, నిందలు పడవలసి వచ్చును. మొత్తంమీద అన్నివిధముల కలసివచ్చినా, అసంతృప్తి హెచ్చుగా నుండును. భార్యావర్గం వారితో విరోధము కలుగును.

రోహిణి వారికి అష్టమ శని దోషం కొన్నాళ్ళవరకు కొనసాగును. శరీరంలో నలత, అలసట, త్రిప్పట, ధనవ్యయము మొదలగునవి జరుగుచుండును. 11 తేదినుండి కొన్ని చిక్కులు కలిగి వ్యవహారములు స్తంభించుట జరుగును. కావలసినవారితో మాటపట్టింపులు వచ్చును. శుభకార్య ప్రయత్నములకు ఆటంకములు కలుగును. బంధుమిత్రాదుల వత్తిడి హెచ్చుగా నుండును. మనః స్థిమితం తక్కువగా నుండును.

మృగశిర 1, 2 పా. వారికి ఆర్థికంగా కొన్ని చిక్కులు కలిగినను, ధనలాభం బాగుగా కలసివచ్చును. బంధుమిత్రాదులవల్ల సుఖ శాంతులు కలుగును. శుభకార్య ప్రయత్నములు ఫలించి వాయిదా పడును దైవభక్తి పరమార్థ చింతనము, సాధుసజ్జన సహవాసము, గోష్ఠి మొదలగునవి జరుగును. వర్తకులకు, ఉద్యోగులకు, విద్యార్థులకు శ్రమతో కూడిన, ఫలితము కొనసాగును. అయితే శ్రమ హెచ్చుగా నుండును. ధనవ్యయం అధికం.

**మిధునం** (మృగశిర 3, 4పా. ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3పా)

మృగశిర 3, 4 పా. వారికి నెలంతా బాగుగానే ఉండును. శరీర సౌఖ్యం, శుభకార్యానుకూలత, ప్రయాణాదులవల్ల లాభము, కార్య విజయం, ఉత్సాహం, పెద్దలతో మైత్రి, సంఘంలో మంచి పేరు ప్రతిష్ఠలు, గౌరవ సమ్మానములు, ప్రజా సమ్మానము, మొదలయినవి జరుగును. కాని మనోవైకల్యం మాత్రం హఠాత్ సంఘటనలవల్ల ఒకటి, రెండుసార్లు కలిగి తొలగిపోవును

ఆర్ద్రవారికి శుభయోగంతోపాటు శరీరశ్రమ కలుగును. భార్యావర్గం, అధికార వర్గములతో, అధిక సుఖసంతోషములతోపాటు అవమానమును, విశేష ధనాదాయంతోపాటు స్థిరాస్తి సంపాదనకై ధనవ్యయమును కూడ కలిగించును. భార్యకు స్వల్పంగా నలతచేసి నిమ్మళించును. ఉద్యోగులకు, విద్యార్థులకు, వర్తకులకు, వ్యవసాయ దారులకు శ్రమతో కూడిన ఫలితము కొనసాగుటయే కాక, ధన వ్యయము అధికంగా జరుగుచుండును

పునర్వసు 1, 2, 3 పా. వారికి 11వ తేదీవరకు శ్రమ, మనఃఖేదము కలుగును. ఆ పిమ్మట ధనలాభం, ఉద్యోగాభివృద్ధి కలుగును. కుటుంబంలో శుభకార్యములు జరుగును. కాని అప్పటప్పట నలత కలుగుచుండును. ఉద్యోగులు, వ్యాపారస్థులు, వ్యవసాయ దారులు మొదలగువారందరికి యోగప్రదంగా నుండును. దైవభక్తి,

పరమార్థచింతనము, సద్గోష్ఠి, సాధు సజ్జన సహవాసం మొదలయినవి కలుగుచుండును.

**కర్కాటకం** (పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష)

పునర్వసు 4పా. వారికి 11 తేదీవరకు శ్రమా, ఖేదమూ, అత్యధికంగా శ్రమ, నలత కలుగును. ప్రతి విషయములోను ఆందోళనము, వ్యయము హెచ్చుగా నుండును. అతి స్నేహం వలన అనాదరము, చిక్కులు, ఖేదమును పొందవలసి వచ్చును. తల పెట్టిన ప్రతి పనిలోను ఏదో విధముగా మనస్సునకు బాధ, ఖేదము తప్పదు. విద్యార్థులకు సామాన్యముగా నుండును. ఆదాయమునకు మించిన వ్యయం కలుగుచుండును.

పుష్యమి వారికి మొదటి, రెండు వారములలోను, చివరి వారములోను శ్రమ, నలత కలుగును ఉద్యోగములో మంచి అభివృద్ధి కలుగును. అధికారులతో పరిచయము కలుగును. బంధుమిత్రుల రాకపోకలు, వత్తిడి హెచ్చుగా నుండును. నూతన వస్తు సంపాదనము, సువర్ణాభరణప్రాప్తి కలుగును. సంతానమునకు అన్నివిధముల అభివృద్ధి కలుగును. కాని శరీరంలో అధిక వేడిమి కలుగును.

ఆశ్లేష వారికి 15 తేదీవరకు శ్రమ, త్రిప్పట, వ్యయ ప్రయాసలు కలుగును. గతంలో ఉన్న కొన్ని చిక్కులను తెచ్చి పెట్టుకొనుట జరుగును. మనస్సునకు శ్రమను, ఖేదమును కలిగించును దానితోపాటు పనికిమాలిన వ్యయము కలుగును. సోదరులతో మాటపట్టింపులు కలిగి మనస్సునకు ఖేదము కలిగించును. శుభ కార్య ప్రయత్నములు కలిగి వాయిదా పడును. మనస్సునకు సరియైన స్థిమితం ఉండదు. రాత్రింబగళ్ళు పనికిమాలిన ఆలోచనలతో గడచును.

**సింహం** (మఘ, పుబ్బ, ఉత్తర 1 పా.)

మఘవారికి శుభాశుభ మిశ్రఫలం కలుగును శ్రమ, అలసట, నలత కలుగును. మనస్సులో పరిపరి విధముల పనికిమాలిన ఆలోచనలు కలుగును స్థిరాస్తికి సంబంధించిన ఒడుదొడుకు లున్నను, ధనవ్యయం మాత్రం అధికంగా జరుగుచుండును. చిరాకు, మూర్ఖత్వం, మొండి పట్టుదలలు అప్పుడప్పుడు కలుగుచుండును. శుభకార్య ప్రయత్నములకు ఆటంకములు కలుగును. విద్యార్థులకు అనుకూలత కలుగును.

పుబ్బవారికి కార్యవిజయము కలుగును. ధనము అనేకవిధముల కలసివచ్చును. ఉద్యోగములో మంచి అభివృద్ధి కలుగును. శుభ కార్యములలో పాల్గొనుట జరుగును. సంసార కుటుంబ సౌఖ్యం బాగుగా నుండును. సంతానమునకు నలతచేసి నిమ్మళించును. అయితే శరీరంలో అధిక వేడిమి, శ్రమ కలుగుచుండును. ధనవ్యయము అధికంగా జరుగును. విద్యార్థులకు మంచి అభివృద్ధి, రాజకీయవాదులకు ధనలాభము కలుగును.

ఉత్తర 1పా. వారికి కొంత మేలుగా నుండును. ధన విషయంలో బాగుగా కలసివచ్చును. కుటుంబసౌఖ్యం బాగుగానుండును. సంతానమునకు అన్నివిధముల అభివృద్ధి కలుగును. నూతన నిర్మాణములు చేయుట జరుగును శుభకార్యములలో పాల్గొనుట, నోములు, వ్రతములు, పూజ మొదలయిన దైవకార్యములలో పాల్గొనుట జరుగును. కాని శరీరశ్రమ మాత్రం అత్యధికంగా నుండును.

**కన్య** (ఉత్తర 2, 3. 4 పా. హస్త, చిత్ర 1, 2 పా.)

ఉత్తర 2, 3, 4పా. మొదటివారంలో ధనలాభం, కార్య విజయం కలుగును. భార్యకు చిన్న చిన్న ఏక్సిడెంట్లువలన అనారోగ్యం చేసి నిమ్మళించును. బంధువుల రాకపోకలు, వత్తిడి హెచ్చుగానుండును. అకారణముగ కుటుంబంలో కలిగి తొలగిపోవును. కాని శారీరకశ్రమ మాత్రం హెచ్చుగా నుండును. విద్యార్థులకు, ఉద్యోగులకు, కార్మికులకు, సర్వులకు యోగదాయకమైన కాలము.

హస్త వారికి శ్రమ హెచ్చు. ఫలితము తక్కువ. బంధువులతో స్వల్ప చిక్కులు, మాట పట్టింపులు, అధికార్లతో అభిప్రాయ భేదములు, కొన్ని విషయములలో అధికవ్యయము జరుగును. తల పెట్టిన పనులు సకాలంలో జరుగక, వాయిదా పడును. తనకు లోబడిన కుటుంబసభ్యులమీద విరుచుకొని పడుట, మూర్ఖముగా ప్రవర్తించుటయు జరుగును. ఈ నక్షత్రము గలవారందరికి శ్రమ, పిరికితనము, పాపభీతి హెచ్చుగా నుండును.

చిత్ర 1, 2పా. వారికి శుభయోగం కలసివచ్చును. స్థానచలనము, ఉద్యోగంలో ప్రమోషను, స్థిర వస్తు సంపాదనము కలుగును. అనేక విధముల ధనము కలసివచ్చును. శుభకార్య ప్రయత్నములు ఫలించును. సంసార కుటుంబసౌఖ్యం బాగుగా నుండును. అయితే స్త్రీమూలక ధనవ్యయం కలుగును. విద్యార్థులకు అనుకూలత, వర్తకులకు లాభము కలుగును మొత్తంమీద ఈ నక్షత్రం గలవారందరికి శుభయోగమైన కాలము.

**తుల** (చిత్ర 3, 4 పా స్వాతి, విశాఖ 1, 2, 3 పా.)

చిత్ర 3, 4పా. వారికి 17 తేదీ వరకు శరీరంలో నలత, శ్రమ కలుగును. కుటుంబంలో నానావిధముల సుఖసంతోషములు, సంతానమునకు అన్నివిధముల అభివృద్ధి కలుగును. బంధుమిత్రాదుల రాకపోకల నిమిత్తం ధనవ్యయం అధికంగా జరుగును. శుభకార్యము

లలో పాల్గొనుట, పుణ్యక్షేత్రములను దర్శించుట జరుగును. విద్యా-ఉద్యోగ-వ్యాపార రంగాలలో మంచి అభివృద్ధి కలుగును. మొత్తం మీద అన్నివిధాల బాగుగా నుండును.

స్వాతి వారికి శరీరంలో అప్పటప్పట నలత కలుగుచుండును. ధనమునకు లోపముండదు. సోదరవర్గం, బంధువర్గంవారితో మాట పట్టింపులు వచ్చును. మనస్సునకు అందోళన, అసంతృప్తి కలుగు చుండును శుభకార్యములలో పాల్గొనుట జరుగును. ధనము బాగుగా కలసివచ్చును. విద్యార్థులకు, ఉద్యోగులకు, రాజకీయ నాయకులకు, అన్నివిధాల మేలు కలుగును. శ్రమజీవులకు విశేషంగా లాభము కలసివచ్చును.

విశాఖ 1, 2, 3పా. వారికి 11వ తేదీవరకు భార్యకు నలత, శ్రమ కలుగును. ప్రతి పనిలోను అధికశ్రమ కలుగును. 17 తేదీ తర్వాత శుభకార్యముల నిమిత్తము ధనవ్యయం జరిగి ధనమునకు తొట్రుపాటు పడవలసి వచ్చును. అయినను పడిన శ్రమ చక్కగా ఫలించుట వలన బాధ అనిపించదు. ఉద్యోగులకు, వర్తకులకు, కార్మిక, కర్షక మొదలగు వర్గాలకు మేలు కలుగును.

## వృశ్చికం (విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

విశాఖ 4పా. వారికి 11 తేదీనుండి అన్నివిధాల శుభయోగం కలుగును. సంసార కుటుంబ సౌఖ్యం, సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలుగును. వివాహాది శుభకార్య ప్రయత్నములు నెరవేరును. కార్యవిజయము, ధర్మకార్యములు, తీర్థయాత్రలు చేయుట జరుగును. ఉద్యోగ-వ్యాపారాది విషయములలో మంచి అనుకూలత ఏర్పడును. 11తేదీవరకు శరీరశ్రమ కలిగినను, ధన, గృహ, సువర్ణాది ప్రాప్తి కలుగును.

అనూరాధ వారికి 17 తేదీవరకు భార్యకు నలత చేయును. శరీరంలో అధికవేడిమి కలుగును. ఖేదము, ధనవ్యయము, మానసిక వ్యథ హెచ్చుగా నుండును. తర్వాత సంసార కుటుంబసౌఖ్యం, సంతానమునకు విద్యా-ఉద్యోగ-వ్యాపారాది విషయములలో బాగుగా రాణింపుట జరుగును. అధికారుల మన్నన, పదుగురిలో గౌరవ మర్యాదలు కలుగును. నూతన వస్తు సంపాదనము కల్గును

జ్యేష్ఠ వారికి శని పీడ తొలగిపోయినది. శుభగ్రహాలన్నీ అనుకూలంగానే ఉంటాయి. ప్రయత్నాలు ఇంతవరకు ఫలించక పోయినా, ఇకపైనుండి ఫలోన్ముఖం కావడానికి తగిన పరిస్థితులేర్ప డును. ధనలాభం, కార్య విజయం, కుటుంబంలో నానావిధముల సుఖసంతోషములు, శాంతి సౌఖ్యములు కలుగును. వివాహాది శుభ కార్య ప్రయత్నములు నెరవేరును. విద్యార్థులకు, ఉద్యోగులకు రాజకీయ వేత్తలకు మొదలగువారందరికి అన్నివిధాల అభివృద్ధి, లాభము కలుగును.

## ధనుస్సు (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పా.)

మూల వారికి 7 తేదీనుండి మరింత నలత, శ్రమ, తిప్పట హెచ్చుగా నుండును. తలపెట్టిన పనులన్నింటిలోను, చిక్కులు, శ్రమ, ధనవ్యయము, శత్రుబాధ, బంధు విరోధం, వగైరాల వత్తిడి హెచ్చుగా ఉంటుంది. ఆర్థికంగా తొట్రుపాటు కలుగును. శుభకార్య ప్రయత్నములకు ఆటంకములు కలుగుచుండును. చేతి కందవలసిన ఫలితం చేజారిపోతుంది. వ్యవహారములన్నీ స్తంభించిపోవును. మొత్తంమీద శ్రమ హెచ్చుగాను, ఫలితం తక్కువగానే ఉండును.

పూర్వాషాఢ వారికి, శ్రమ, నలత, ఉష్ణాధిక్యం, త్రిప్పట, అలసట మొదలయినవి కలుగును. ప్రతి విషయములోను వ్యయము, ప్రయాస కలుగుచుండును. ఆర్థికంగా కలసివచ్చే సూచనలు కలిగి భవిష్యత్తులో ధనలాభం కలుగుతుంది. స్థిరాస్తి ప్రయత్నాలు, శుభకార్య ప్రయత్నాలు క్రమంగా అనుకూలపడతాయి. సంతానము నకు స్వల్పంగా నలతచేసి నిమ్మళించును. మానసికవ్యథ కలుగును.

ఉత్తరాషాఢ 1పా. వారికి శ్రమ హెచ్చుగా నుండును. భూగృహాది వ్యవహారాదులలో చిక్కులు కలుగును. బంధుమిత్రాదుల రాకపోకలు, విందులు, వినోదాలు సుఖభోగ విలాసములకు మొద లయిన వాటికి ధనవ్యయము అధికంగా జరుగును. అయినను మన శ్శాంతి తక్కువగా నుండును. పనికిమాలిన చిన్న చిన్న విషయా లను గూర్చి ఆలోచనలు, వచ్చిన ఫలితంమీద అసంతృప్తి, అధిక తాపత్రయం, సాటివారిలో పోటీపడడానికి ప్రయత్నించి భంగపడడం జరుగుతుంది.

## మకరం (ఉత్తరాషాఢ 2, 3, 4పా. శ్రవణం, ధనిష్ఠ 1 2 పా)

ఉత్తరాషాఢ 2, 3, 4పా. వారికి శ్రమ మాత్రం అధికం. ధనవ్యయం అధికంగా జరుగును. సోదరవర్గం వారితో విరోధము కలుగును. ప్రయాణాలు ఫలిస్తాయి. సంతానమునకు, ఉద్యోగ—విద్యా-వ్యాపార రంగాలలో రాణింపు కలుగును. పదుగురిలో మాట గౌరవము, విజ్ఞాన కార్యక్రమాలలో పాల్గొనుట మొదలయినవి జరు గును. రాజకీయవాదులు, కంట్రాక్టర్లు, ఉపాధ్యాయులు, వైద్యులు, శ్రమజీవులు మొదలగువారందరికి బాగా కలసివచ్చే కాలము.

శ్రవణము వారికి శారీరక, మానసికశ్రమ కల్గును. కాని శ్రమకు తగిన ఫలం కూడ వస్తుంది. బంధుమిత్రులతో అకారణ వైరము, సోదరవర్గంతో మాటపట్టింపులు కలుగును. పరిస్థితులనుస

రించి మాట నిలుకడ లేకపోవుట, కార్యభంగము కలుగుచుండును. అధికంగా ధనవ్యయం జరుగుచుండును. నెలంతా పనికిమాలిన ఆలోచనలతో, ఆందోళనతోను గడచును. అప్పటప్పట శరీరంలో నలత కలుగుచుండును.

ధనిష్ఠ 1, 2పా. వారికి ధనలోపము కలుగదు. సంతానము నకు విద్యారంగంలో బాగుగా రాణించుట జరుగును కుటుంబ సంసార సౌఖ్యం బాగుగా నుండును. కాని ధనము మాత్రం అధికంగా వ్యయ మగుచుండును. తలపెట్టిన పనులన్నీ నెరవేరుచుండును గతంలో విరోధించినవారంతా తనచుట్టూ తిరుగుతారు. అయితే శరీరశ్రమ హెచ్చుగా నుండును పాత విరోధాన్ని విస్మరించి అడిగిన వారందరికీ సహాయం చెయ్యడం జరుగును.

**కుంభం** (ధనిష్ఠ 3, 4 పా. శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పా)

ధనిష్ఠ 3, 4పా. వారికి శరీరశ్రమ హెచ్చు. అయినా ఫలితం బాగుగానే ఉండును. అన్ని విషయాలలోను బాగా కలసివచ్చును. భూగృహాది వ్యవహారములలో బాగుగా రాణించును. పదిమందికి ఉపకారము చేయుట జరుగును. ఆరోగ్యం చక్కగా నుండును. మధ్యలో భార్యకు నలతచేసి నిమ్మళించును. గొప్పకోసం, పేరుకోసం, పొగడ్తల కోసం ప్రాకులాడడం జరుగును. మంచి సుఖభోగానుభవం కలుగును. పదుగురిలో గౌరవ మర్యాదలు లభించును. మొత్తంమీద శుభయోగమైన కాలమిది.

శతభిషం వారికి యోగం బాగున్నా, ప్రతి విషయంలోను ఎంతో శ్రమ పడవలసి వచ్చును. అయినను సంతృప్తి ఉండదు ప్రతి విషయంలోను పనికిమాలిన ఆలోచనలు, ఆందోళన కలుగు చుండును. ఆ వచ్చినదేదో బంధుమిత్రాదులకు, శుభకార్యాలకు ఖర్చు చేయడం, తరువాత విచారించుట జరుగును. స్త్రీమూలకంగా, లగ్జరీ వస్తువుల మూలకంగా ఖర్చు జరుగును.

పూర్వాభాద్ర 1, 2, 3పా. వారికి 11 తేదీవరకు శ్రమ, నలత హెచ్చు. ధనం పుష్కలంగా కలసివచ్చును. సుఖ భాగ్యభోగాలను బాగా అనుభవిస్తారు. బంధుసౌఖ్యం కలుగును సాధు సజ్జన సహవాసము, గోష్ఠి జరుగును పేరు ప్రతిష్ఠ బాగుగా నుండును. చాల మంచి పనులు కీర్తికరంగా చేయుట జరుగును. కుటుంబ సంసార సౌఖ్యం బాగుగా నుండును మొత్తంమీద శుభయోగప్రదమైన కాలము.

**మీనం** (పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి)

పూర్వాభాద్ర 4పా. వారికి 11 తేదీవరకు శ్రమ, భార్యకు నలత కలుగుచుండును. ఉద్యోగ వ్యవహారాలు బాగుగా నుండును అన్ని వ్యవహారాలు సానుకూలమగును. ధనము పుష్కలంగా కలసివచ్చును. సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలుగును. బంధుమిత్రాదుల రాకపోకలు, పదుగురిలో మాట గౌరవం, విజ్ఞాన కార్యక్రమాలలో పాల్గొనుట మొదలగునవి జరుగును.

ఉత్తరాభాద్ర వారికి 11 తేదీనుండి శరీరశ్రమ, ఉష్ణాధిక్యం, భార్యకు ఆరోగ్యభంగము, త్రిప్పట, వృధాప్రయాస, ధనవ్యయం మొదలయినవి జరుగును. బంధుమిత్రాదుల మూలకంగాను, గృహంలో దైవకార్యాలు, పండుగలు, పబ్బాలు మూలకంగా ధన వ్యయం జరుగును ఉద్యోగ, వ్యాపార వ్యవహారాదులలో స్వల్పంగా చిక్కులు కలిగి తొలగిపోవును. మొత్తంమీద శుభాశుభ మిశ్రమఫలం కలుగును.

రేవతి వారికి శరీరంలో నలత, శ్రమ, సహవాసదోషం వలన స్వల్పంగా వ్యసనాలు, మనోవైకల్యం, భార్యకు అనారోగ్యం కలిగి నిమ్మళించుట జరుగును అనవసరమైన పనులు నెత్తిన వేసికొని బాధ పడుట జరుగును. ఉద్యోగులకు, విద్యార్థులకు, వ్యవసాయదారులకు, వర్తక, కర్షక, కార్మిక మొదలగు వర్గాలందరికి మంచి మేలుగా నుండును. అయినను శ్రమ హెచ్చుగా నుండును. రాహువునకు జపశాంతులు చేయించుట మంచిది.

సిద్ధాంతి. **నిష్ఠల వేంకట సత్యసుబ్రహ్మణ్యం**

## శ్రీ తిరుమల రామచంద్ర

# తెలుగు-ప్రాకృతాల సంబంధాలు

( గతసంచిక తరువాయి )

మన భాషలోకి, కన్నడంలోకి వచ్చిన తద్భవాలనే పదాలను పరిశీలిస్తే నూటికి నూరు పాళ్లు ప్రాకృతభావాలుగా గాని ప్రాకృత సమాలుగా గాని వున్నవేగాని సరాసరి సంస్కృత భావాలు కావని చెప్పవచ్చు ప్రాచీనుల ప్రకారం సంస్కృత భావాలయినప్పుడు ప్రాకృత పదాలే అవుతాయి. కనుక సరాసరి తెలుగులో చేరే ప్రసక్తేలేదు. సరాసరిగా చేరినవి తత్సమాలు మాత్రమే కన్నడ వ్యాకర్తలు, కేతన మొదలైన తెలుగు వ్యాకర్తలు సంస్కృత సిద్ధ రూపాలను తెలుగు కన్నడాలలో సరాసరిగా వాడరాదని చెప్పారుగాని, కేరళ భాషలో సంస్కృత విభక్త్యంతాలు ప్రయోగించి రచించిన కావ్యాలెన్నో ఉన్నాయి రామః రావణనె కొన్ను. రామన్ రావణం హత్వా సీతయె్గ్రహిచ్చు. ఇలా మనకు కూత మల్లినాథసూరి చెప్పినట్లు వ్యవహారంలోవున్న ఇలాటి కొన్ని శ్లోకాలు ఉన్నాయి. మల్లినాథుడు సర్వజ్ఞ సింగభూపాలుని దర్శనానికి నిరాడంబరంగా పోతుండగా ఎవరో ఆక్షేపించారట. దానికి ఈవిధంగా అయన సమాధానం చెప్పాడట.

"కిం దారుణా వంకర టింకరేణ
కిం నాససా చీకిరి బాకిరేణ
సర్వజ్ఞ భూపాల విలోకనార్థం
వైదుష్య మేకం విదుషాం సహాయః"

దీనిలో తెలుగు మాటలకు సంస్కృత విభక్తి ప్రత్యయాలు వాడగా, సంస్కృత క్రియారూపాలు వాడిన శ్లోకాలు కూడ కనిపిస్తాయి!

తిండికైతే బహుమంది వసంతి
తండులాలు సుతరాము నసంతి,
కుండలెల్ల నడిమింట లురంతి
ముండలాః కొడుకు లెల్ల హసంతి.

కాగా, ప్రాకృతభాష ఉత్తరధ్రువ ప్రాంతం నుంచి ప్రవహిస్తూవచ్చి, మధ్య ఆసియాలోని భోటాన్ ప్రాంత భాషలతో కలిసి చూళిక అయి, మరికొంత దక్షిణంగా, ఆగ్నేయంగా పారి పైశాచిగా పేరుపొంది, ఒకపాయగా మగధ ప్రాంతాన్ని ముంచెత్తి మాగధి అయి, మరొకపాయగా మహారాష్ట్ర మంతటా వ్యాపించి మహారాష్ట్రి నామధేయం పొంది, సింధు నుంచి మరొక పాయగా సముద్ర తీరం వెంబడిని వెళ్ళి శౌరసేని అయి, కలగా పులగమై అపభ్రంశమై చివరకు నేటి విభిన్న దేశభాషలుగా మారి పాతస్వరూపాన్ని సంస్కృతం లాగే పుస్తకాల మరుగున దాచుకొన్నది.

తెలుగు భాషలో ప్రాకృత పదాలు మిగిలిపోయాయి గాని, సాహిత్యం విషయంలో కన్నడులకున్నంత ఔదార్యం లేకపోయింది బౌద్ధ జైనాలు రెండువేల సంవత్సరాలపాటు మనప్రాంతంలో ఎంతో సాహిత్యాన్ని సృష్టించి వుంటాయి గదా! ఆ మతాలపై ద్వేషంతో ఇతరమతాలవారు ఆ సాహిత్యాలను నామరూపాలు లేకుండా చేసి వుంటారు గొప్ప సిద్ధాంతాలతో, ఆదర్శాలతో అవతరించిన ఆరామాలను లంజదిబ్బలన్నవారు ఆ సాహిత్యాలను ఏమైనా చేసివుంటారు! అంతేకాక ఆ శతాబ్దిలో ఎడతెంపిలేక జరిగిన యుద్ధాలు, బౌద్ధులు హీనయానం నుంచి మహాయానానికి, తత్ఫలితంగా ప్రాకృతం నుంచి సంస్కృతానికి మారడమూ ప్రాకృత ప్రాధాన్యాన్ని తగ్గించి సంస్కృత సాహిత్య ప్రాధాన్యం హెచ్చించడంవల్ల ప్రాకృత సాహిత్యం క్షీణించి పోయివుంటుందేమో!

నన్నయకు వంద సంవత్సరాలకు ముందు తెలుగు దేశంలో వున్న మహాకవులు పంపజినవల్లభసోదరులు ఆత్మరక్షణకోసం, మత రక్షణకోసం తెలుగునాడును వదలకపోయినా, తెలుగు నాడులో పశ్చిమోత్తర ప్రాంతాన్ని పాలించే కన్నడరాజును ఆశ్రయించారంటే,[21] వారికి సమకాలికుడైన మల్లియరేచన కవిజనాశ్రయంలో సగం చచ్చి మిగిలాడంటే మతవిద్వేషం ఎంత బలవత్తరమైందో చెప్పనక్కరలేదు.[22] కన్నడులు మతమాత్సర్యం వున్నా, సాహిత్యాన్ని, శిల్ప సంపదను ధ్వంసం చేసేంతకుసంస్కారులు కాలేదు; కనుకనే సాహిత్యం, శిల్పక్షేత్రాలూ చెక్కుచెదరకుండా నిలిచాయి. మనకు అలాటి ఔదార్యం లేనందున మనగడ్డపై వెలసిన ప్రాకృత, ప్రాకృత ప్రభావిత సాహిత్యం మిగులలేదు. ఉన్న సాహిత్యంపై ప్రాకృత సాహిత్య ప్రభావం అంతగా పడలేదనే అనాలి. ప్రాకృతాలను చదువుకొన్నవారు నాటకాలలోని ప్రాకృతాన్ని అధ్యయనం వరకే

గిరిగీచుకొని కూచున్నారేమో! బౌద్ధ జైన సాహిత్యాలను చూచి నట్టు లేదు.

మన కవులందరూ - నన్నయ మొదలు చిన్నయ వరకు ప్రాకృతవేత్తలే. 23 అప్పకవి.

"సంస్కృతము ప్రాకృతంబును శౌరసేని
జగతిపై మాగధియును పైశాచికమును
జూళికయు నపభ్రంశంబు నొరిది నాంధ్ర
భాషయును నిలి చను నష్టభాషలనగ."

అని అష్టభాషలను పేర్కొన్నాడు. ఇతనికన్నా ముందు తాళ్ళపాక అన్నమాచార్యుల మనుమడు చిన తిరుమలాచార్యుడు (1687) అష్ట భాషాదండంకలో చూళికాపభ్రంశాలకు బదులుగా ప్రాచీ, అంతీ అని, ఆంధ్రభాషకు బదులుగా సార్వదేశి అని చేర్చాడు. నన్నయ తనను ఉభయభాషాప్రవీణునిగా చెప్పుకొన్నాడు. ఈయన మిత్రుడు; భారతాంధ్రీకరణంలో తోడ్పడినట్లు ప్రథమంగా వున్నవాడు అయిన నారాయణ భట్టు

"య స్సంస్కృత కర్నాటక
ప్రాకృత పైశాచికాంధ్ర భాషాసు,
కవి రాజశేఖర ఇతి
ప్రథితః సుకవిత్వ విభవేన." 24

అని నన్నయతోనే నందంపూడి శాసనంలో ప్రశస్తి పొందాడు. (1068). ఇక నవీనగుణ సనాథుడైన నాచనసోముడు "అష్టభాషా కవిత్వశ్రీ వాణీవిజిత సంపదే" అని బుక్కరాయలతో కీర్తింపబడి నాడు (పెంచుకలదిన్నె శాసనం). బాల భాగవత కర్త దోనూరి కోనేరుకవి (1547) బాలభాగవత పీఠికలో తనను భాసుర సంస్కృత ప్రాకృతారిక శాస్త్ర భాషాకవిత్వ సౌభాగ్య నిపుణుడు, వినుతాష్ట భాషాకవిత్వ ప్రచండుడు" అని చెప్పుకొన్నాడు. ధరణిదేవుల రామమూర్తి (15 వ. శ) దశావతార చరిత్రలో "సంస్కృత ప్రాకృతాద్యష్ట భాషా కవిత్వ తత్త్వ సంవేది" (1-16) అని చెప్పు కొని ఒక సీసాన్ని రచించాడు. ఆ బాపలలో కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికలో అష్టభాషా విదుడనని చెప్పుకోవడమేకాక ప్రాకృత పదాలను వాడుతూ ఒక సీసపద్యం రచించాడు. (2 46) గణపవరపు వెంకట కవి (1620-60) ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసంలో షడ్విధ ప్రాకృతాలు వాడుతూ అష్టభాషా సీస పద్యం చెప్పాడు. రంగాజమ్మ (1639-73) మన్నారు దాసవిలాసంలో షడ్విధ ప్రాకృతాలలో ఆరు పద్యాలు రచించడమే కాక "అతులితాష్ట భాషాకవితా సర్వం కషమనీషా విశేష విశారద" నవి చెప్పుకొంది. భాస్కర రామాయణ కవులలో ఒకడైన మల్లికార్జునభట్టు అష్టభాషా కవీంద్రుడు వైకృత చంద్రికాకర్త మంచళ్ల వాసుదేవకవి అష్టభాషా కవిత్వ సామ్రాజ్య పట్టభద్రుడూ ఆంధ్రపాణిని బిరుదాంకితుడైన నివరి శేషసుమతి అష్టభాషాకవితా కోవిదుడు. మహావైయాకరణుడూ, రాజవైద్యుడూ అయిన ఎలకూచి బాల సరస్వతి సకల భాషాకవిగా పేర్కొనబడడంవల్ల ప్రాకృతజ్ఞుడూ అయి వుంటాడు. ఆంధ్ర కౌముదీకారుడు మండ లక్ష్మీనరసింహాచార్యులు అష్టభాషా సరస్వతి. సురపురాధీశ్వరుడైన రాఘవపాతు నాయకుని ఆస్థానంలోవున్న మహా విద్వత్కవి కిరీటం వేంకటాచార్యులు ప్రాకృత ధురంధురులే. గద్వాల సంస్థాన కవీశ్వరుడు యథాశ్లోక తాత్పర్య రామాయణ రచనకు ఆధ్వర్యవం వహించిన, కిష్కింధా కాండను రచించిన కామసముద్రం అప్పలాచార్యులు "మాగధీ భాండీర మాళవీ ప్రభృతి సత్ప్రాకృతమ్ముల ప్రబంధముల గొన్ని" రచించాడు. ఈ రామాయణంలోనే సుందరకాండను రచించిన తిరుమల కృష్ణమా చార్యులు ప్రాకృత కవితా ధురంధరులే. వనపర్తి పాలకుడు బహరీ గోపాలరావుకు 'అష్టభాషా' బిరుదుంది.

ఈ విధంగా మనకవులు చాలవరకు అందరూ ప్రాకృతజ్ఞులే కాని, ప్రాకృతంలో ప్రభావితమైన వారి రచనలేవీ కనిపించవు. "భాసుర భారతార్థమాల భంగు లెరుంగనేరమిన్ గాసట బీసటల్ చదివి గాథలు త్రవ్వు తెలుంగు వారికిన్" భారతం ప్రసాదించాడు నన్నయ అని ఎర్రాప్రగడ నృసింహ పురాణంలో చెప్పిన పద్యంలోని గాసట బీసటలు గాథా సప్తశతి, బేతాళ పంచవింశతి అని ఒకసారి, కాశ్యపభట్టు విశ్వనాథభట్టు రచనలని మరొకసారి శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు నాతో అన్నారు. ఈరూపాలు ప్రాకృత భాషా సంప్రదాయం ప్రకారం సాధువులని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి వంటి మహా పండితులు సమర్థించినా, గాథా సప్తశతి చెత్త చెదారం వంటిది కాదే నన్నయకు ముందూ తర్వాతనూ ఆలంకారికులు అందరూ అవి రసగుళికలని ప్రశంసించినట్టివే గాసట బీసట గాదే! నన్నయముందు ప్రాకృత సాహిత్యం పాత ప్రవచనాలలో వుంటే, వాటి అనువాదాలు లేకపోయేవా? (ఎవరో కొందరు పండితులు చదవడం వేరు.) కనుక ప్రాకృత ప్రచారం, ముఖ్యంగా మహా యానం వల్లనే సన్నగిల్లి పోయిందనే భావిస్తున్నాను. ఎర్రనవంటి వారు ఆలంకారికాగ్రేసరులు. గౌరవించి స్వీకరించిన గాథా సప్తశతిని ఈసడిస్తారని నేను భావించను.

కనుక మన తెలుగుదేశంలో పూర్వం విరివిగా వుండి, మధ్యన విచ్ఛిన్నమైపోయిన ప్రాకృత సాహిత్య సంబంధం శ్రీనాథుని శాలివాహన సప్తశతి అనువాదంతో మరల పునరుజ్జీవిత మయిందన వచ్చు. దగ్గుపల్లి దుగ్గన కవి నాసికేతో పాఖ్యానంలో "సంస్కృత ప్రాకృత శౌరసేనీమఖ్య భాషా పరిజ్ఞాన పాటవంబు" కలవాడని శ్రీనాథుని ప్రశంసించాడు "శాలివాహన సప్తశతి నొడివితి" అన్న శ్రీనాథుని

కథనం ప్రకారం గాథా సప్తశతి పూర్తిగా అనూదితమై వుంటుంది. శ్రీనాథునికి ప్రాకృత సాహిత్యం గురించి బాగా తెలుసు. దండి దశ కుమార చరిత్రను అనువదించిన కేతనకు "సాగర సూక్తి రత్నానాం సేతుబంధాది యన్మయమ్" అని దండి పొగడిన ప్రవర సేనుని సేతుబంధం తెలీకుండా వుంటుందా? అతని తర్వాత శ్రీనాథునట్లా వాడికి తెలియకపోతుందా? అతడు ఇటువంటి మహాకావ్యాను వాదానికి ఎందుకు పూనుకోలేదో! ఏమైనా, శ్రీనాథుని సప్తశతిలోని ఐదు పద్యాలు దొరకడం విశేషం.

12-13 శతాబ్దివాడయిన త్రివిక్రముడు, సంస్కృత వ్యాకరణాలలో భట్టోజీ దీక్షితుని సిద్ధాంత కౌముదివలె ప్రాకృతానికి షడ్భాషా చంద్రిక ప్రసాదించిన లక్ష్మీధరుడు (16 వ శ.) ప్రాకృత మణిదీపం వెలిగించిన అప్పయ దీక్షితులు (16, 17 శ), మరి కొందరు ప్రాకృతవ్యాకర్తలు తెలుగువారైనా తమ ప్రాకృత రచనలతో తెలుగు సాహిత్యంపై అంతగా ప్రభావం ప్రసరింపజేసినట్లు కానము.

గుణాఢ్యుడు పైశాచీ ప్రాకృతంలో రచించినట్లు మహాప్రథ వున్న బృహత్కథ ప్రపంచకథా సాహిత్యంలోనే మొట్టమొదటిది. గుణాఢ్యునికి సంబంధించిన కథలే నిజమైతే ఇతడు మనకు చాల సన్నిహితుడు. గాథలు తప్పే తెలుగువారు బృహత్కథను పూర్తిగా స్వాయత్తం చేసుకోవలసింది. కాని అలా జరగలేదు. ఈ బృహత్కథ అనువాదాలన్నీ మనకు కాశ్మీరు కవులవే లభించాయి - బుధస్వామి బృహత్కథను బృహత్కథా సంగ్రహమనేపేర, తర్వాత క్షేమేంద్రుడు బృహత్కథా మంజరిపేర, అతనికి కనిష్ఠ సమకాలికుడైన సోమదేవ సూరి కథా సరిత్సాగరమనే పేర సంస్కృతీకరించారు. వీళ్ళందరూ కూడ తాము మూలాతిక్రమణము ఏమాత్రమూ చేయలేదని, సంకోచ వికోచాలు మాత్రమే చేశామని చెప్పుకొన్నారు. కాని, ఈ అనువాదాలలో పదవ శతాబ్దం వరకు ఉన్న కావ్యేతివృత్తాలు కనిపించడం వల్ల బృహత్కథ పరిమాణం గురించీ సందేహాలు కలిగాయి. ఇది తమిళులోని పెరుంగతైకు సంస్కృతీకరణమని శ్రీ వేదం వేంకట రాయశాస్త్రిగారు (ఎం. ఏ.) అభిప్రాయపడుతున్నారు[25] ఇతరోపజ్ఞమైనవీ దీనిలో చేరాయని ఈయన వాదం.

ఈ బృహత్కథానువాద ప్రభావం తెలుగు సాహిత్యంపై బాగానే పడింది. పెద్దనా మనుచరిత్రేతి వృత్తం బృహత్కథామంజరి, కథా సరిత్సాగరాలలో వున్నా, అతడు తన కథను మార్కండేయ పురాణం నుంచి గ్రహించానని కంఠోక్తిగా చెప్పడంవల్ల అతనిమాటలు నమ్మక తప్పదు. నిరంకుశోపాఖ్యానం ఇతివృత్తం బృహత్కథలోనిదే. రుద్రకవికి తెలిసిన కథాసరిత్సాగరం పెద్దనకు తెలిసివుండకపోదుగదా! మార్కండేయ పురాణం నుంచి గ్రహించడం గొప్పగా భావించాడేమో! ఇంతకూ, మనకవులదృష్టి పురాణాలపై ప్రసరించినట్లుగా బృహత్కథామంజరి, కథా సరిత్సాగరాలపై ప్రసరించలేదు.

శ్రీనాథునికి కనిష్ఠ సమకాలికుడైన జక్కనకు ప్రాకృతం గురించి బాగా తెలుసు. దీనికి విక్రమార్క చరిత్ర అవతారికే సాక్షి. ఇతని విక్రమార్క చరిత్ర సంస్కృత విక్రమార్క చరిత్రకు అనువాదమని తోచదు. సంస్కృత విక్రమార్క చరిత్రలోని కొన్ని కథలు జక్కన విక్రమార్క చరిత్రలో కనిపించినా, దీనిలోని చాల కథలు సంస్కృతంలో లేవు; సంస్కృత విక్రమార్క చరిత్రలోని కథలెన్నో తెలుగు విక్రమార్క చరిత్రలో లేవు తెలుగు విక్రమార్క చరిత్రలోని కొన్ని కథలకు మూలాలు బృహత్కథామంజరి, కథా సరిత్సాగరాలలో కనిపిస్తున్నాయి. అలాగే తెలుగు బేతాళ పంచవింశతిలోని కొన్ని కథలకు మూలం బృహత్కథామంజరి, కథా సరిత్సాగరాలలో కనిపిస్తున్నాయి. అందువల్ల పరోక్షంగా దీనిని ప్రాకృత ప్రభావ మనవచ్చు.

కదిరీపతి రచించిన శుకసప్తశతి కూడ కర్ణాకర్ణికగా విన్న కథలగుచ్ఛమే కాని, సంస్కృతశుక సప్తశతి అనబడేదాని అనువాదం కాదు. సంస్కృతంలో ప్రచురించిన శుక సప్తతిలో ప్రారంభంలో ఒక ఆర్య (గాథ), పిదప దానిని వివరిస్తూ కథలు ఉన్నాయి. దాని పద్ధతే వేరు. (ఈ గ్రంథం ప్రచురణ వివరాలు మరచాను.) తెలుగు శుక సప్తతిలోని కొన్ని కథల మూలాలు బృహత్కథామంజరి, కథా సరిత్సాగరాలలో కనిపిస్తాయి కనుక ప్రాకృత ప్రభావం పరోక్షంగా ఉంది.

నన్నయకు వంద సంవత్సరాలకు ముందుకూడ తెలుగునాట ఒకి వైపు జైనం, మరొకవైపు బౌద్ధం జనాదరం పొందుతూనే ఉన్నవి. కాని క్షీణదశలో ఉన్నాయనవచ్చు. పొరుగున ఉన్న కన్నడ తమిళనాడులలో జైనం క్షీణించి వైష్ణవ, శైవ మతాలు ప్రబలుతున్నాయి. తమిళులో భారతం అదివరకే వెలసింది. రాజరాజ నరేంద్రునికి తమిళ దేశంతో గల సంబంధంతో ఈ సంగతి తెలుసు. కన్నడ భారతమైన విక్రమార్జున విజయం సంగతీ తెలుసు. నన్నయ విక్రమార్జున విజయాన్ని చదివాడని చెప్పడానికి ఆయన భారతంలోనే అంతస్సాక్ష్యాలున్నాయి. కన్నడం, ప్రాకృతం అభిలషణీయమైనా మతం అడ్డు వచ్చింది. వైదికధర్మ స్థాపనదృష్టితో భారత రచన అవసరమైంది గనుక నన్నయ తాను వ్యాసభారతాన్ని కట్టుదిట్టంగా అనువదించ దలచుకొన్న పద్ధతిని ముందుగానే స్పష్టంగా చెప్పుకొన్నాడు. భారతానువాదమంతా అతని చేతిమీదుగా జరిగివుంటే ఎలా ఉండేదో! తర్వాత దానిని అనువదించిన తిక్కన ఎఱ్ఱనలు కావ్యదృష్టి గలవారయినా, ప్రధానంగా నన్నయమార్గాన్నే అనుసరించారు.

కనుక ప్రాకృత ప్రభావం - జైనం అర్థురావడంవల్ల భారతంపై పడలేదు.

కాని తెలుగు రామాయణంపై ప్రాకృతభావం బాగానే పడింది. రామాయణమంటే వాల్మీకి రామాయణాను వాదమని నా ఉద్దేశం, ఎవరు ఏమి విమర్శించినా, ప్రక్షిప్తాలు చాల చేరాయని ఒప్పుకున్నా రామాయణ ప్రధాన కథ వాలీక్యపజ్ఞం. 'ఇది బుద్ధునికి చాల శతాబ్దాలకు ముందే రచితమైందని నా ప్రగాఢ విశ్వాసం అలాకాకపోతే, బుద్ధుడు తాను ఇక్ష్వాకు వంశంవాడినని, పదే పదే చెప్పుకొనడం. తానే ఒక జన్మలో రాముణ్ణనడం జరుగవు. సమకాలంలోని వైదిక గ్రంథాలను మార్చి, తమవిగా వ్రాసుకోడం, తామే నిజం చెబుతున్నామనడం, జైన బౌద్ధుల మత ప్రచార పద్ధతి - జనంలో ప్రచారంలో వున్నవాటిని కొంత మార్చినా, మొదట్లో జనం అంతగా పట్టించుకోరు. మూలకథ - ప్రధానకథలో మార్పులు లేకపోలేదు. క్రమంగా చిన్నమార్పులకు అలవాటు పడతారు. ఇది జైన బౌద్ధుల ప్రచార రహస్యం. ఇది ఒకరకంగా బ్రెయిన్‌వాషింగ్. రామాయణ విషయంలో ఇలాటి మహా ప్రయత్నాలు జైనులలో మూడు జరిగాయి. 'వీటిని పరంపర అంటారు.[26] 1) విమలసూరి పరంపర, 2) సంఘదాస పరంపర, 3) గుణభద్ర పరంపర. వీటిలో విమలసూరి పరంపరే ఎక్కువ వ్యాప్తి చెందింది లోకప్రియమైన రామకథను జైన ధర్మపు మూసలో పోయడానికి తొలిసారిగా ప్రయత్నించినవాడు విమలసూరి. ఇతనిని తర్వాతి ప్రాకృత సంస్కృత కవులు అనుసరించారు.

విమలసూరి క్రీస్తుశకం 72 ప్రాంతంలోవున్నవాడు. కాని ఈ ప్రాకృత రామాయణ భాషనుబట్టి మూడవ శతాబ్దం వాడేమోనని కొందరు పండితుల సందేహం. దీనిని విమలసూరి జైనమత ప్రచారం కోసమే రచించాడు. 'దీనిపేరు పఉమ చరిఉ - పద్మచరితం. "సింహాన్ని జింక చంపింది. కుక్క ఏనుగును తరిమింది - లాంటి విపరీతమైన, అసంభవమైన మాటలతో నిండిన రామాయణాన్ని కవులు రచించారు. ఇదంతా అబద్ధం, ఉపపత్తి విరుద్ధం. ఇలాటి మాటలను పండితులు విశ్వసింపరాదు. పూర్వగ్రంథాలలో ఉన్నదాన్ని, ఆచార్య పరంపరగా వచ్చినదాన్ని నేను అనుపూర్విగా చెబుతాను." అని అతడు చెప్పుకొన్నాడు.

రాముడే పద్ముడు - పద్ముడు పఉమ అయింది ప్రాకృతంలో, రాముని వికసించిన పద్మం వంటిది; కండ్లు పద్మాలవంటివి, శరీర కాంతి పద్మసదృశం (నీలమేఘ శ్యామం కాదు); కనుక అతని తండ్రి పద్మ - పదుమ పఉమ అని పేరు పెట్టాడు. రాక్షసులు మాంస భక్షకులు కారు. తమపుణ్యంతో వీరు ద్వీపాలను రక్షిస్తారు గనుక వీరికి రాక్షసులు అని పేరువచ్చింది. రాక్షసులు, వానరులు కామరూప, కామగమనాలుగల విద్యాధరులు. వీరూ మానవులే; అపూర్వ విద్యలు సాధించడంవల్ల విద్యాధరులయ్యారు. వానరులు తమ ఇండ్లపై వానర చిహ్నాలు ఉంచుకోవడం వల్ల వానరులయ్యారు. భరత శత్రుఘ్నులు కైకేయి కుమారులు. తక్కిన రెండు సంప్రదాయాల ప్రకారం సీత రావణ మండోదరుల కుమార్తె హనుమంతుడు రావణుని చెల్లెలయిన చంద్రప్రభకుమార్తె అనంగకుసుమను పెళ్ళాడాడు. ఈమెకాక అతనికి వందమంది భార్యలున్నారు. పఉమ చరిఉలోని వారంతా జైనులే. సీత తన శిరోజాలు లుంచనంచేసి (చేతితో పీకుకొని) జైన దీక్ష స్వీకరిస్తుంది. రావణుని రాముడు చంపడు, లక్ష్మణుడు చంపుతాడు రావణునివంటి జైనసాధకుణ్ని చంపడంవల్ల లక్ష్మణుడు నరానరకానికి పోతాడు. రాముడు తపస్సుచేసి నిర్వాణం పొందుతాడు. ఈ కావ్యంలోని ప్రతిపాత్ర ప్రసక్తి ఉన్నా, లేకపోయినా జినధర్మం ఉపదేశిస్తుంది.

ఈ విమలసూరి, సంఘదాస, గుణభద్రాచార్య పరంపరలలో ప్రాకృత సంస్కృతాలలో పెక్కు రామాయణాలు వచ్చాయి. వాటిలో చిత్రవిచిత్రమైన ఉపాఖ్యానాలు చాల ఉన్నాయి. వీటి ప్రభావం తెలుగు రామాయణాలపై బడింది. కనుకనే మన రామాయణాలు పెక్కింటిలో అవాల్మీకీయమైన పెక్కు కథలు కనిపిస్తాయి.[27]

ఈ అవాల్మీకీయ రామాయణాల ప్రభావాన్ని అరికట్టడానికే భాసకాళిదాస ప్రవరసేనులు రామాయణ నాటక కావ్యాలు సంస్కృత ప్రాకృతాలలో రచించారని నా అభిప్రాయం.

సాహిత్యశాస్త్ర దృష్టితో ప్రవరసేనుని సేతుబంధంలోని అవతారికా పద్ధతి, ఆశ్వాస విభజన సరాసరిగానో, కన్నడం ద్వారానో తెలుగులో ప్రవేశించింది ప్రాచీన సంస్కృత కావ్యాలలో అవతారికా పద్ధతి కానరాదు. ప్రాకృతకావ్యాలు సేతుబంధంలోను, గౌడవహోలోను ఈ అవతారికా పద్ధతి ఉంది దీనిలో ఇష్టదేవతాస్తుతి, సుకవిప్రశంస, కుకవినింద, గ్రంథకర్త వంశాదికం ముఖ్యాంశాలు. ప్రవరసేనుడు వాకాటరాజు, స్కందగుప్తుని దౌహిత్రుడు, కాళిదాసు శిష్యుడు గనుక దండ్యాదులు ప్రశంసించారు గనుక, అన్నిటికన్న మిన్నగా స్వతః కళావిలసితం గనుక సేతుబంధం చాల వ్యాప్తి చెందింది.

తర్వాత, పందొమ్మిదో శతాబ్దం చివరిపాదంలోను, ఇరవయ్యో శతాబ్దిలోను తెలుగువారికి ప్రాకృతంపై మక్కువ ఎక్కువయింది. శ్రీ మెదేపల్లి వేంకటరమణాచార్యులు గారు ప్రాకృత భాషాచరిత్ర వ్రాయడమే కాక, సేతుబంధం అనువదించారు. అప్పటికి పరిష్కృతమైన సేతుబంధం ప్రతి లభించలేదు గనుక దానిలోని లోపాలు అనువాదంలోను వచ్చాయి. ఉదాహరణకు :

'చాప తుల్యాకృతి వహించు సంద్రమునకు
సంహిత శరోపమము పార్శ్వ సంఘటితము
గుణము వలెనున్న వింధ్యాద్రి కుధరవరము
జూచె రాఘవు డత్తరి జూడ్కులలర '

ఇక్కడి భావమిది — సముద్రం వంపుగావున్న విల్లులాగ వుంది. దాని రెండు కొనలకు కట్టిన నారిలాగ ఉంది వింధ్యపర్వతం. వింధ్యనుంచి పారే సెలయేర్లు సంధించిన బాణాలలాగ వున్నాయి. (సేతు. మూలం 1-54) పై అనువాదంలో వేనుంచి పారుతున్న సెలయేళ్లు సంధించిన బాణాలలాగ ఉన్నాయనే భావం పోయింది. శ్రీ ఆచార్యులుగారి మూలమేదో ! దీనిని విద్వత్కవివరేణ్యులు శ్రీ అవధానం చంద్రశేఖరశర్మ గారు ఇలా అనువదించారు :-

"అంబుధి దంబు మీరిన శ
రాసముగా, నుభయాంత సంగియై
పంబిన తద్భరంబు సయి
పందగి నిస్సరదాపగా ప్రవా
హంబులు సంహితాంబకము
లై తనరన్ బరిణద్ధ మౌర్వికా
భంబగు వింధ్యమున్ ధరణి
పాలవరేణ్యుడు గాంచె సంభ్రమంగటన్." (1-50)

గాథా సప్తశతిని శ్రీనాథుని తర్వాత అనువదించడానికి యత్నించిన వారు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, శ్రీ తల్లావజ్ఝల శివశంకరస్వామి గారు, దిగుమర్తి సీతారామస్వామిగారు. వీరు కొన్ని గాథలను మాత్రం అనువదించారు. దీనిని తొలిసారిగా పూర్తిగా అనువదించినవారు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు. 1960 ప్రాంతంలో శ్రీ ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి గారు అనువదించారు. ఈ రెండిటిలో శ్రీ రాళ్ళపల్లి వారిది చాల జనాదరం పొందింది. అనువాదం ఎలాటి వ్యర్థపదాలు లేక మూలానుసారిగాను, కొన్నిచోట్ల మూలాతిశాయిగాను వుంది. ఉదా :—

రంధణకమ్మ ణిఉణిఏ
మా జూరసు రత్తపాడల సుఅన్ధమ్,
ముహ మారు అం పి అన్తో
ధూమాఇ సిహీ ణ పజ్జలఇ. (1-14)

దీనికి శ్రీ రాళ్లపల్లివారి అనువాదమిది —

పూని యూదెదు నెఱజాణ ! ప్రొయ్యి మీద
నలుక గొనబోకు, రక్తపాటల సుగంధ
మైన నీ యూర్పు జవులకు నాసగొనుచు
పొగలెగయు గాని మండదీప్రొయ్యి నగ్గి.

నేను 'గాథా సప్తశతిలో తెలుగు పదాలు' అనేపేర ప్రాకృత సాహిత్యానికి సంబంధించిన వివిధ వ్యాసాల సంకలనం ప్రచురించాను. ప్రాకృతంలో రామకథ, వజ్జాలగ్గలో తెలుగు పదాలు, దేశీ నామ మాలలో తెలుగు పదాలు - మున్నగు వ్యాసాలు ప్రచురించాను. గాథా సప్తశతి మున్నగు ప్రాకృత కావ్యాలలోని తెలుగు పదాలను తొలిసారిగా చెప్పినవాడిని నేను, గాథా సప్తశతి గాథల భావాలను కథలుగా ఆల్లి పల్లకి వారపత్రికలో సంవత్సరంపాటు (1985-86) ప్రచురించాను అవి చాల జనాదరం పొందాయి. మహాయాన బౌద్ధుల ప్రప్రథమ ప్రామాణిక బుద్ధ చరితమైన లలితవిస్తర మహాపురాణాన్ని, సంస్కృతాత్మకమైన దానిని నేనూ, మిత్రులు, విద్వద్విమర్శక వ్యాఖ్యాతృవరేణ్యులు శ్రీ బులుసు వేంకట రమణయ్య గారు అనువదించారు ఇది మొదట ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధంలోను, తర్వాత పుస్తకం గాను ప్రచురించాము. లలిత విస్తరంలో లిపులను గురించి వుందని, మరొకటి వుందని చరిత్రకారులు, పురాతత్త్వవేత్తలు చెప్పడమేకాని వాటిని వివరించినవారుగాని. మూలాన్ని చూచినవారు గాని చాల తక్కువ. శ్రీ ద్విజేంద్రలాల్ మైత్రగారు దాని విషయ సంగ్రహాన్ని ఆంగ్లంలో ప్రచురించారు. మేమిద్దరం దీనిని తొలిసారిగా అనువదించాము ఈ అనువాదమే భారతదేశపు భాషల్లో తొలి అనువాదమని విన్నాము.

నేను క్షేమేంద్ర విరచితమైన అవదాన కల్పలతను, బృహత్కథా మంజరిని వచనంలో అనువదించాను. వీటి మూలం ప్రాకృతం గనుక పరోక్షంగా ప్రాకృతసేవ చేసినట్లే. మాహుడనే ప్రాకృత కవి హరమేఖల అనే ఐదు పరిచ్ఛేదాల వైద్యగ్రంథాన్ని ప్రాకృతంలో రచించాడు ఇతడు క్రీస్తుశకం 820 ప్రాంతంలో చిత్రకూటంలో వున్నాడు దీనిని తిరువాన్కూరు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం క్యురేటరు శ్రీ సాంబశివశాస్త్రిగారు తిరువాన్కూరు సంస్కృత గ్రంథమాలలో దేవనాగరిలిపిలో ముద్రించారు. దీనిలో నేటికీ సకల జనులకు ఉపయోగపడే యోగాలు అసంఖ్యాకంగా వున్నాయి. ఐదవ పరిచ్ఛేదం పూర్తిగా సుగంధయోగాలకు సంబంధించింది. దీనిలోని యోగాలను ఎవరైనా ప్రయోగాత్మకంగా పరిశీలించి సిద్ధపరిస్తే లాభం పొందవచ్చు. కృత్రిక కస్తూరీకరణం, సుగంధాంతరకరణం మున్నగు వాటిని సాధించి గొప్ప ధనవంతులుకండి అని గ్రంథకర్త పలుసార్లు గ్రంథంలో చెప్పాడు ఏ మందుల సంస్థగాని, 'సుగంధ ద్రవ్య నిర్మాణసంస్థగాని పూనుకుంటే చాలప్రయోజనం పొందవచ్చు. ముఖ్యంగా, దోమలు, నల్లులు, ఈగలు, ఎలుకలు మున్నగువాని నివారణయోగాలు చాల ప్రయోజనకరాలు దీనిని నేనూ, సుప్రసిద్ధ ఆయుర్వేద మహోపాధ్యాయులు డాక్టర్ వేటూరి శంకరశాస్త్రిగారూ అనువదించాము.[28]

బుద్ధ జాతక కథలను శ్రీ శివశంకరస్వామిగారు వచనంలోను, శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి గారు పద్యంలోను అనువదించారు. శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారి సప్తతిపూర్తి సంచికలో ప్రాకృత సాహిత్యమూ - ప్రజాసేవానూ" అనే మహత్తర బృహత్తర వ్యాసం వ్రాశారు. దీనిని విడిగా ప్రచురిస్తే పెద్ద పుస్తకమౌతుంది. శ్రీ పరవస్తు రామానుజస్వామిగారు హేమచంద్రుని దేశీనామమాలను పరిష్కరించి ప్రచురించడమే కాక ప్రాకృతభాషా సాహిత్యాలపై పెక్కువ్యాసాలు వ్రాశారు. జయంతిపురం రాజా శ్రీవాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వర ప్రసాద్ గారు ధమ్మపదం అనువదించడమే కాక బౌద్ధం గురించి. ప్రాకృత భాషా సాహిత్యాలను గురించి పెక్కువ్యాసాలు వ్రాశారు. ఇవి ఇటీవల కొన్ని గ్రంథరూపంలో వెలువడ్డాయి. బౌద్ధ వాఙ్మయబ్రహ్మగా విఖ్యాతులైన శ్రీదుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు బౌద్ధ సాహిత్యంపై పెక్కు గ్రంథాలు రచించారు. ఇటీవల విద్వత్కవులు శ్రీఅవధానం చంద్రశేఖరశర్మగారు సేతుబంధాన్ని గొప్పగా అనువదించి ప్రకటించారు. డాక్టర్ కొలిచె తిమలమ్మ గారు ప్రాకృత సాహిత్యంలో ప్రజాజీవితం అనే అంశంపై ఎంతో పరిశ్రమ చేసి సిద్ధాంత వ్యాసం వ్రాసి ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేట్ పట్టం పొందడమే కాక పెక్కువ్యాసాలూ వ్రాశారు డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు ప్రాకృతంలోను గొప్ప విద్వాంసులు. ప్రాకృత సాహిత్యం పెక్కు వ్యాసాలు వ్రాశారు ప్రొఫెసర్ డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు ధమ్మపదం అనువదించారు నాకు తెలియనివారు ఇంకా ఎందరో ప్రాకృత సాహిత్య సేవకు లున్నారు

ఇలా ఎంతో పోగా, కొంతయినా మిగిలిన ప్రాకృత సాహిత్యం ప్రభావం తెలుగు సాహిత్యంపై ఏకొంతోపడినా, ప్రాకృత భాషా ప్రభావం మాత్రం తెలుగుభాషపై చాలవుంది. ప్రాకృతాలు తెలుగులో రంగరించుకొని పోయాయి, ఎన్నో తెలుగు పదాలను స్వాయత్తం చేసుకున్నది. నేటి భాషాశాస్త్రవేత్తలు ప్రాకృత తెలుగు భాషా సాహిత్యాల ఆదాన ప్రదానము నిష్పాక్షికంగా పరిశోధన జరుపాలని కోరుతున్నాను

## అధో జ్ఞాపికలు :

1. ప్రాకృత సాహిత్యకా ఇతిహాస్ - జగదీశ్ చంద్ర జైన్‌పుట, పా ఇతి సద్ద మహణ్ణ ఓ -పీఠిక.
2. దమ్మపదం - సాపవగ్గో-1
3. ప్రాకృత సాహిత్యకా ఇతిహాస్ - పుట 16.
4. రక్షార్థం వేదానాం అధ్యేయం వ్యాకరణం, లోపాగమవర్ణ వికారజ్ఞోహి సమ్యగ్వేదాన్ పరిపాలయతి :— పతంజలి మహాభాష్యమ్.
5. ఆచార్య బాక్చి చూశికా ప్రాకృత వ్యాసం
6. అజాతశత్రు-నాటకం పీఠిక, జయశంకర్ ప్రసాద్
7. భరతనాట్య శాస్త్రమ్
8. ప్రాకృత లక్షణమ్ - చండుడు
9. సకల జగజ్జంతూనాం వ్యాకరణాదిభి రనాహిత సంస్కారః సహజో వచన వ్యాపారః ప్రకృతిః. తత్రభవం, సైవ వా ప్రాకృతమ్. ప్రాకృతం బాలమహిళాది సుబోధం సకల భాషా నిబంధన భూతం వచన ముచ్యతే మేఘ నిర్ముక్త జల మివైక స్వరూపం తదేవ దేశవిశేషా త్సంస్కార కరణాచ్చ సమాసాదిత విశేషం సత్ సంస్కృతాద్యుత్తర విభేదానా ప్నోతి-కావ్యాలంకార వ్యాఖ్య (రుద్రట-నమిసాధువులు.)
10. ప్రకృతేః సంస్కృతశబ్దా దాగతః, అచో; ప్రాకృతః ప్రాకృతభాషాయాః సంస్కృతశబ్దా ప్రకృతికత్వాత్— వాచస్పత్యమ్.
11. సిద్ధహేమచంద్ర శబ్దానుశాసనమే.
12. దేశీనామ మాల-1
13. కవి రాజమార్గ-నృపతుంగ, పరి 9, పద్ 8
14. శబ్దమణి దర్పణమ్ - పుట 12
15. సాహితీ సుగతుని స్వగతమ్ - తిరుమల రామచంద్ర
16. తెలుగు గోష్ఠి వ్యాసం - శ్రీ చీమకుర్తి శేషగిరిరావు, జనవరి 1987.
17. గాథాసప్తశతిలో తెలుగు పదాలు - తిరుమల రామచంద్ర
18. వజ్జాలగ్గలో తెలుగు పదాలు - తిరుమల రామచంద్ర, భారతి, మే 1980
19. కాశకృష్ణధాతు పారవ్యాఖ్య
20. ఆంధ్ర భాషాచరిత్ర - డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు
21 గంగాధర శాసనమ్ - డాక్టర్ నేలటూరి వేంకటరమణయ్య- భారతి
22. మల్లియరేచన - మొదటి తెలుగు రచయిత. డాక్టర్ పి. వి. పరబ్రహ్మశాస్త్రిగారు - తెలుగు గోష్ఠి వ్యాసం.
23. డాక్టర్ రవ్వా శ్రీహరిగారి వ్యాసం — తెలుగుపై ప్రాకృత ప్రభావమ్.
24 నందంపూడి శాసనం
25 బృహత్కథ - పెరుంగదై - శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి గారు - భారతి
26. ప్రాకృత సాహిత్యంలో రామకథ - తిరుమల రామచంద్ర, భారతి జూన్, జులై, ఆగస్టు - 1978
27. పఉమ చరిఉ 2:116, 117
28. హర మేఖల - గోపాలాచార్లు లక్ష్మీపతి మెమోరియల్ ఆయుర్వేద శాస్త్ర పరిశోధక మండలి, గాంధీనగర్, హైదరాబాద్- 500 350

(అయిపోయింది)

# నేను!

కాల నదిలోన బ్రతుకను కనకపాత్ర
ముంచుచు, సుఖామృతంబు సేవించుచుండి
లోపరమార్ధాలు గమనింప నోప నయితి
నవుర! భువినెంత వెఱ్ఱి మానవుడ నేను!

వింతబొమ్మల పుడమి మేల్ జంతితోడ
ఇంతలో ఆడి, యేడ్చుచు అంతలోనె
రంగుల హారంగు కాలంపు చెంగుపట్టి
పడుచు లేచి సాగెడి పసివాడ నేను!॥

పగరుగా వాస్తవానుభవాల దెబ్బ
తగులుచున్నను మదికి; చిత్రమ్ముగాగ
ఊహాలుయ్యాల లూపగా జరగలేక
నలిగిపోయెడి వెఱ్ఱిమానవుడ నేను!॥

*

ప్రకృతికిని, పరిస్థితులకు బానిసనయి
వెలసియుంటుచే, ఆశయంబులకు, ఆచ
రణములకు నిత్యమును జర్గు రణములోన
నలిగిపోయెడి వెఱ్ఱిమానవుడ నేను!॥

మౌనరాగంబు, మేల్సేత, మంచితనము
మనిషి బలహీనతగ నెంచు మన సమాజ
సరణి నరయక భ్రమసి చిచ్చులవిరిచెలు
నలిగిపోయెడి వెఱ్ఱిమానవుడ నేను!॥

ఫణులు పడద్రోయ, నిచ్చెనల్ పైకి లాగ
చక్రనేమి క్రమమ్ముతో; సంఘమనెడి
పరమపద రూప సోపాన పటమునందు
తవిలి తిరిగెడి వెఱ్ఱిమానవుడ నేను!॥

డా॥ రామడుగు వెంకటేశ్వర శర్మ

# అన్వేషణ

"మూర్ఖత్వం" మన్నుతో నిర్మితమైన
కులమతాల ప్రహారీల్ని
'విజ్ఞత'నే జలపాతంలో కూల్చి
కుహనా నాగరికతని వీడి,
విశాల విశ్వంలో పయనించాలని—
నడుస్తుంటే చీమైనా ఛావకూడదన్న
నా సిద్ధాంతాల్తో మున్ముందుకు సాగలేక,
సందేహాల సమ్మెటపోట్లతో సతమతమౌతూ
నీకు, నాకు గల దూరాన్ని
భర్తీ చేయాలని—
మార్గం తెలీకున్నా నిను చేరాలని
మర్మం గ్రహించకున్నా నిన్నధిగమించాలని
యీ నిరంతరాన్వేషణ!

# శిక్ష

ప్రేమ సాగరంలోని
ఆటుపోటుల్ని భరించే
స్వప్న వాస్తవాల అంతర్యుద్ధం—
నీ కనుల భాషల్ని అపార్థం చేసుకుని,
మోనపోయిన నా కళ్ళు,
వ్యథలతో వ్యక్తపఱచిన వేడి కన్నీళ్ళు
నీ మనోనేత్రం గ్రహించలేని
నా మనోభిప్రాయాలు—
మతిపోయిన 'మేధ'ని
శాసించిన దారిద్ర్యం—
నీ స్వాధీనమయిన నా మనసుకి
ప్రసవవేదనలాంటి నీ తిరస్కారం—

శ్రీ మం॥ మాధవుడు



# "ఏమండీ. ఆ భరించలేని నొప్పి ఏమైంది?"

"పోయిందే!"

మెలుపరచబడిన **అమృతాంజన్** వాడడంతో,

కోమలమైన అమృతాంజన్‌ను చాలా సులభంగా రాసుకోవచ్చు.

మృదువైన **అమృతాంజన్‌తో** చాలా సులభంగా 'మర్దనా' వేయవచ్చు.

తలనొప్పులను, వొళ్ళు నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మేలుపరచబడిన అమృతాంజన్ మునపటికంటే **అతి** త్వరితంగా వుపశమింపజేయగలదు!




## మేలుపరచబడిన
# అమృతాంజన్

మీ మోముపై చిరునవ్వులను శీఘ్రంగా తిరిగి వికసింపజేయగలదు!



Amrutanjan Limited

శ్రీ వేమిరెడ్డి సంగిరెడ్డి

# గ్రామీణ పేదరికం నిర్మూలనలో వాణిజ్య బ్యాంకులు, గ్రామీణ బ్యాంకుల పాత్ర

## ఎర్రుపాలెం మండలం, ఖమ్మం జిల్లా ఒక పరిశీలన :

భారతదేశము ప్రధానంగా గ్రామాలపైన ఆధారపడి వుందని మనందరికీ తెలుసు. 1951వ సంవత్సరములో 82.1% దాకా గ్రామీణ జనాభా వుంది అదే జనాభా 1971 జనాభా లెక్కల ప్రకారము 80.1%, 1981 లెక్కల ప్రకారము 77.69% మొత్తము జనాభాలో గ్రామీణ జనాభా వున్నట్లుగా తెలుస్తుంది. ప్రస్తుతము గ్రామీణ ప్రాంతములలో జనాభా 52కోట్లు వరకు నివసిస్తున్నారు.

మొదటి పంచవర్ష ప్రణాళికా కాలమునుంచి మన ప్రభుత్వ లక్ష్యము గ్రామీణాభివృద్ధి, వ్యవసాయరంగము మీద కేంద్రీకృతము చేసినారు. అయినప్పటికి ఈ రోజుకు కూడాను జనాభాలో 60% దారిద్ర్యరేఖ క్రింద నివసిస్తున్నారు. అందే ప్రణాళికా లక్ష్యాలు అనుకొనిన మేరకు సాధించలేకపోయినాము అన్నమాట దీనికి అనేక కారణములు కలవు. ముఖ్యముగా రవాణా సౌకర్యములు లేకపోవుట, దీనిమూలముగా మార్కెటింగ్ సౌకర్యాలు సరిగా లేనందున గ్రామాలలో నెలకొల్పిన కుటీర పరిశ్రమలు, గ్రామీణ పరిశ్రమలకు, వ్యవసాయోత్పత్తులకు గిట్టుబాటు ధరలు లభించక ఆర్థికముగా బాగా దెబ్బతినుట జరిగినది. స్వర్గీయ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి 20 సూత్రముల పథకములో సమగ్ర గ్రామీణాభివృద్ధికి అనేక సూత్రములు ప్రకటించి అమలుపరచినారు. ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధి క్రొత్త 20 సూత్రాల పథకములో సమగ్ర గ్రామీణాభివృద్ధికి ప్రాధాన్యత నిచ్చినారు. ఈ పథకములు సక్రమంగా నిర్వహింపబడి, గ్రామీణ పేదలకు ఉపాధి కల్పనలో విజయం సాధించాలంటే ప్రభుత్వ రంగము, వాణిజ్యబ్యాంకులు స్వచ్ఛంద సంస్థలు, చిత్తశుద్ధితో పని చేసిననాడే విజయవంతమవుతాయి.

మన దేశములో వ్యవసాయము ఈ రోజుకి కూడా వర్షపాతము మీదనే ఆధారపడియున్నది. వ్యవసాయమునకు తగినంత నీటిపారుదల సౌకర్యము లేదు. అదీగాక వ్యవసాయభూమి చిన్న చిన్న కమతములుగా విభజించబడి ఉన్నందువల్ల, ఆధునిక వ్యవసాయ పద్ధతులను ఉపయోగించకపోవుట వలన, అధిక దిగుబడినిచ్చు వంగడములను పండించలేకపోవుట వలన, ఎరువులను వాడలేకపోవుట వలన, వ్యవసాయోత్పత్తి ప్రపంచంలోకెల్ల సగటున, చాలా తక్కువగానే ఉంటున్నది దీనివలన రైతుకు గిట్టుబాటు ధరలు లభించనందువలన మరియు ప్రకృతి వైపరీత్యముల వలన నష్టపోవుట వలన, రైతు తీసుకొనిన ఋణములను సకాలములో చెల్లించలేకపోయి, వడ్డీ వ్యాపారస్తుల చేతులలో నలిగిపోతున్నాడు.

సహకార రంగము మన దేశములో పూర్తిగా విజయవంతము కాలేకపోయింది ప్రభుత్వ సంస్థలలో పేరుకొనిపోయిన అవినీతి, క్రమశిక్షణా రాహిత్యము, గ్రామీణ రైతుకు ప్రణాళికలలో నిర్దేశించిన సహాయము పూర్తిగా అందకుండా పోతుంది. ఈ రోజుకీ రైతు వ్యవసాయ నిమిత్తము తీసుకొనిన అప్పులను, వస్తురూపేణా వస్తుమార్పిడి పద్ధతి చెల్లించుతూ, నష్టపోవుచున్నాడు. పెద్ద పెద్ద రైతులు ఆధునిక పద్ధతులను అనుసరించి వాణిజ్య పంటలను పండించుచూ, అధిక లాభములను పొందుతున్నందువలన, ఆర్థిక అసమానతలు రోజు రోజుకీ పెరిగిపోవుచునే వున్నాయి. ఎప్పుడయితే వ్యవసాయ రంగములో అనుకొనినంత ఉత్పత్తి సాధించలేమో, ఫలితముగా వ్యవసాయముమీద ఆధారపడి జీవించే వ్యవసాయ శ్రామికులు కూడా ఇంకా పేదరికములోకి నెట్టివేయబడుచున్నారు. ఫలితముగా గ్రామాలలో నివసించు పేదలు ఇంకా పేదరికములోకి పోవుట జరుగుచున్నది. సన్నకారు, చిన్నకారు రైతులు సహకార సంఘములుగా ఏర్పడి, ఆధునిక పద్ధతులను, అవలంబించిననాడే వారికి లాభము

చేకూరుటయే గాకుండా, గ్రామీణ అసమానతలు పూర్తిగా తొలగ గలవు.

ప్రకృతి వైపరీత్యముల వలన నష్టపోవుచున్న గ్రామీణ రైతాంగము, వ్యవసాయ కూలీలు, పేదలు కూడా పాడి పరిశ్రమ, కోళ్ళ పెంపకము, చేపల పెంపకములాంటి ఇంకా ఇతర కుటీర గ్రామీణ పరిశ్రమలయందు తగిన ఆసక్తి చూపవలెను.

పేదరికము నిర్మూలనలో వాణిజ్య, గ్రామీణ బ్యాంకుల పాత్ర :

మన దేశములో గ్రామీణాభివృద్ధికి, గ్రామీణ పేదరికమును రూపుమాపుటకు, గ్రామీణాభివృద్ధి పథకముల నిర్వహణలో వాణిజ్య బ్యాంకులు, గ్రామీణాభివృద్ధి బ్యాంకులు వడ్డీవ్యాపారుల కబంధ హస్తాల నుండి, వారికి ఆర్థికముగా, సంపూర్ణ రక్షణ కల్పించుటతోబాటుగా, వారి సామాజిక, ఆర్థిక పురోభివృద్ధికి ఇతోధికముగా సహాయమందిస్తున్నాయి.

ప్రభుత్వము ఆశించిన లక్ష్యములకు అనుగుణముగా, తమ వంతు కర్తవ్య నిర్వహణలో భాగంగానే, వాటి పరిమితి మేరకు సక్రమముగానే నిర్వహించుచున్నవని చెప్పవచ్చును. ముఖ్యముగా గ్రామీణ పేదరికమును నిర్మూలించుటలో సన్నకారు రైతులకు, వ్యవసాయ కూలీలకు, స్వల్పకాలిక, దీర్ఘకాలిక ఋణ సహాయములను కలిగించుచున్నవి. దారిద్ర్యరేఖ దిగువభాగమున నివసించుచున్నవారిని పైకి తెచ్చుటకు, వివిధ రకములయిన ఋణ సహాయములను అందించుచున్నవి. గ్రామీణులకు స్వయం ఉపాధికల్పనకు, కట్టు బానిసలకు ఉపాధి కల్పించుటకు కూడా, వాణిజ్య, గ్రామీణ బ్యాంకులు కృషి చేయుచున్నవి.

గ్రామీణాభివృద్ధికి ఈ క్రింద పథకములు అమలుజరుపబడు చున్నాయి.

(1) ఉపాధి కల్పనా కార్యక్రమము:- దీని ముఖ్య ఉద్దేశ్యము.

1. గ్రామీణ పేదరికమును నిర్మూలించుటకొరకు, ఉత్పత్తి సంపద లను పెంపొందించుట
2. గ్రామీణ పేదలకు పనిలేని కాలములో పని కల్పించుట. దీనికొరకే 1977లో పనికి ఆహారము పథకమును ప్రవేశపెట్టినారు.

(2) గ్రామీణ ఉపాధి కల్పనా శిక్షణ కార్యక్రమము .- దీని యొక్క ముఖ్య ఉద్దేశ్యము 300 నుండి 400 మిలియన్ల పని దినములు, నిరుద్యోగులుగా వున్నటువంటి గ్రామీణులకు పని కల్పించుట.

ఈ పథకము కొరకు 6వ పంచవర్ష ప్రణాళికలో 1,620కోట్ల రూపాయలు కేటాయించుట జరిగినది.

(3) భూమి లేనివారికి గ్రామీణ ఉపాధి హామీ పథకము :- ఈ పథకము ముఖ్య ఉద్దేశ్యము.

1. భూమిలేని నిరుపేదలకు కనీసము ఒక్కొక్కరికి సంవత్సరము నకు 100 పనిదినములు కల్పించుట.
2. గ్రామీణాభివృద్ధికి అవసరమైన గ్రామీణ అవస్థాపన పరిశ్రమలు స్థాపించుటకు ముందుగా ఏర్పరచే సౌకర్యములు కల్పించుట. దీనిని 1983-84 నందు కేంద్ర ప్రభుత్వము రు. 784 కోట్లు మంజూరుచేసి, 84.14 మిలియన్ల పనిదినములు కల్పించుట.

(4) కట్టుబానిసలకు ఉపాధికల్పన :- 1976 కట్టుబానిసల చట్టము ప్రకారం కట్టుబానిసలను గుర్తించుట, తరువాత విడుదల చేయుట. దీని ముఖ్య ఉద్దేశ్యము వెట్టిచాకిరినుండి విముక్తి కలిగించిన గ్రామీణులను ఆర్థికముగా స్వయం సమృద్ధతను కల్పించుట, వారికి సాంఘిక స్పృహము కల్పించుట. దీనికి అయ్యే ఖర్చులో 50% కేంద్ర ప్రభుత్వము, 50% రాష్ట్ర ప్రభుత్వములు భరిస్తున్నారు.

| | | | |
|---|---|---|---|
| 1978 - 79 | - | రు. 94.64 | వెట్టిచాకిరినుండి విముక్తి |
| 1979 - 80 | - | రు. 53.62 | కలిగించినవారి కొరకు |
| 1980 - 81 | - | రు. 193.93 | ఖర్చు చేసినది. |
| 1981 - 82 | - | రు. 80.41 | |

6వ ప్రణాళికలో [1980-85] 25 కోట్ల రూపాయలు, కట్టు బానిసలకు కేటాయించుట జరిగినది.

(5) కనీస అవసరముల పథకము:- గ్రామీణ జీవితావసరము లకు ఉపయోగపడు ప్రాథమిక విద్య, గ్రామీణుల ఆరోగ్యము, నీటి పారుదల, రోడ్డులు, విద్యుద్దీకరణ మొదలగు పథకములను చేపట్టుట.

(6) సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకము - ఈ పథకము ప్రకారము దారిద్ర్యరేఖ క్రిందనున్న వారిని పైకి తెచ్చుట, గ్రామీణు లకు కావలసిన ఆస్తులను కల్పించుట, ఋణ సదుపాయములను కల్పించుట, ఉత్పత్తి సాధనాలను సమకూర్చుట, సంవత్సరమునకు రు. 3,500/-లోపు ఆదాయము వున్నవారందరికి సహాయము చేయుట జరుగుతుంది

6వ ప్రణాళికలో 12.55 మిలియన్ కుటుంబములకు చేయ వలెనని భావించుట జరిగినది ఈ ప్రభుత్వమునకు ఈ పథకము క్రింద రు 1,071 87 కోట్ల రూపాయలు ఖర్చయినది. ఈ పథకము నకు బ్యాంకులు రు. 2,025 46 కోట్ల ఋణము సహాయము చేసినది.

(7) గ్రామీణ యువకులకు స్వయం ఉపాధి కల్పన కొరకు శిక్షణా కార్యక్రమం :- 18 నుండి 35 సంగలలోపు యువకులకు

శిక్షణనిచ్చి తరువాత ఋణకల్పన, మార్కెటింగ్ సదుపాయాలు ముడి పదార్థములు అందించుట జరుగును.

(8) ప్రాంతీయ అభివృద్ధి కార్యక్రమము :— గ్రామీణ పేదరికము ఏ ప్రాంతములోనైతే ఎక్కువగా వుంటుందో గుర్తించి, ఆ ప్రాంతములను ప్రత్యేక శ్రద్ధతో అభివృద్ధి చేయుటకు కృషిచేస్తుంది. ఉదా: వరద ప్రాంతముల సమగ్రాభివృద్ధి పథకము, ఎడారుల అభివృద్ధి పథకము.

ఎ. వరద ప్రాంతముల అభివృద్ధి పథకము:- దీని ప్రకారము భూమిని తగిన విధముగా ఉపయోగించుట, ఉత్పత్తికి అనుగుణముగా నీరును నిల్వచేసి ఉపయోగించుట, ఉద్యోగావకాశములను కల్పించుట.

బి. ఎడారుల అభివృద్ధి కార్యక్రమము:— స్థానిక ప్రాంతములోని ప్రజలకు అవసరమైనటువంటి ఆదాయమును, ఉద్యోగావకాశములను కల్పించుట. ఈ పథకమును 18 జిల్లాలలో, రాజస్థాన్, హర్యానా, గుజరాత్, రాష్ట్రములలో అభివృద్ధి పరచుటకు ఏర్పాటు చేసినారు.

## ఎర్రుపాలెం మండలం : ఖమ్మం జిల్లా

ఎర్రుపాలెం మండలమునందు 24 గ్రామములు కలవు. ఈ మండలమునందు మూడు వాణిజ్య బ్యాంకులు, 2 గ్రామీణ బ్యాంకులు కలవు. గ్రామీణ బ్యాంకులు పేదరికమును నిర్మూలించు కార్యక్రమము నందు వ్యవసాయేతర కార్యక్రమములకు కూడా రు. 5,000/–ల లోపులో మాత్రమే ఋణ సదుపాయమును చేయుచున్నవి. వాణిజ్య బ్యాంకులు అవసరములకు అనుగుణముగా ఋణ సదుపాయములను చేయుచున్నవి. వాణిజ్య బ్యాంకులు నాగార్జున గ్రామీణ బ్యాంకులు మొత్తం కూడా పేదరికంను నిర్మూలించుటకు వాటి వాటి పరిధిలో తగిన విధముగా కృషి చేయుచున్నవని చెప్పవచ్చును.

వ్యవసాయమునకు సంబంధించిన బావులు, పంపుసెట్లు–ఆయిల్ ఇంజనులకు ఋణ సదుపాయము జరుగుతుంది.

పరిశ్రమలు స్థాపించుటకు ముందుగా కల్పించు సౌకర్యములకు ఎక్కువగా బ్యాంకులు ఋణ సదుపాయములను కలిగించుట లేదు. ట్రాక్టర్లు, రిక్షాలు, సైకిళ్ళు లాంటివి వాటికి కూడా ఋణ సదుపాయమును కల్పించుచున్నవి.

గ్రామీణ పేదరికమును రూపుమాపుటకు సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకము క్రింద 10 శాతము వడ్డీతో ఎస్.సి., ఎస్.టి. వారు ఋణ సదుపాయమును పొందుచున్నారు. ఇంకా వీరేకాక స్వల్ప ఆదాయ వ్యవసాయ శ్రామికులు, శ్రామికులకు బ్యాంకులు కేవలము 4% వడ్డీతో తగిన ఆర్థిక సహాయము చేసి ఉపాధి కల్పించుచున్నవి.

బ్యాంకుల ఋణములు వసూళ్ళను పరిశీలించగా నూటికి 50–60 శాతం మించివుండుట లేదు. దీనికి ముఖ్య కారణములు ప్రకృతి వైపరీత్యములు మరియు ఋణప్రాప్తి పొందినవారు కావాలనే కట్టకపోవుట ఋణముల వసూళ్ళతో బ్యాంకు అధికారులు ఎదుర్కొంటున్న సమస్యలను పరిశీలించిన మీదట బీహార్ వంటి రాష్ట్రములలో లాగా ఇక్కడ కూడా వారికి రెవెన్యూ అధికారములు ఇచ్చుట ఎంతైనా అవసరం.

ప్రభుత్వము అభివృద్ధి చేసేటటువంటి పథకములు, పూర్తిగా పేదవారికే అందవలెనంటే, ముందుగా పేదవారిని గుర్తించాలి. అనగా ఈ విషయంలో రెవెన్యూ సిబ్బంది పూర్తిగా, తగినటువంటి వివరణలు ఇవ్వాలి. ఋణకల్పన సదుపాయములో పూర్తిగా బ్యాంకు అధికారులకు అధికారము ఇవ్వవలెను.

గడిచిన మూడు సంవత్సరములలో ఎర్రుపాలెం మండలములో బ్యాంకులు వివిధ రంగములలో ఇచ్చిన ఋణ సహాయము (వేలలో) ఈ క్రింది విధంగా ఉన్నది.

పట్టిక – 1

| | వ్యవసాయ రంగం | | వ్యాపార రంగం | | పరిశ్రమల రంగం | |
|---|---|---|---|---|---|---|
| సం॥ | ఋణ సహాయం పొందినవారి సంఖ్య | ఋణము మొత్తం [వేలలో] | ఋణ సహాయం పొందినవారి సంఖ్య | ఋణము మొత్తం [వేలలో] | ఋణ సహాయం పొందినవారి సంఖ్య | ఋణము మొత్తం [వేలలో] |
| 1984 | 280 | 1535 | 311 | 515 | 182 | 421 |
| 1985 | 335 | 1950 | 325 | 860 | 210 | 531 |
| 1986 | 380 | 2100 | 344 | 1022 | 217 | 750 |

గడచిన మూడు సంవత్సరములలో ఎర్రుపాలెం మండలములో వారు బ్యాంకులనుండి పొందిన ఋణము [వేలలో] ఈ క్రింది షెడ్యూల్డ్ కులములు, షెడ్యూల్డ్ తెగలు, వెనుకబడిన తరగతుల విధంగా వుంది.

పట్టిక - 2

| సం॥ | షెడ్యూల్డ్ కులములు | | షెడ్యూల్డ్ తెగలు | | వెనుకబడిన తరగతులు | |
|---|---|---|---|---|---|---|
| | ఋణ సహాయం పొందినవారి సంఖ్య | ఋణము మొత్తం [వేలలో] | ఋణ సహాయం పొందినవారి సంఖ్య | ఋణము మొత్తం [వేలలో] | ఋణ సహాయం పొందినవారి సంఖ్య | ఋణము మొత్తం [వేలలో] |
| 1984 | 32 | 223 | 61 | 76 | 27 | 53 |
| 1985 | 64 | 273 | 73 | 129 | 31 | 79 |
| 1986 | 73 | 250 | 69 | 154 | 31 | 105 |

పైన పేర్కొనిన పట్టిక-1ను పరిశీలించిన యెడల 1984 సంవత్సరములో 280 మంది బ్యాంకులవలన ఉపయోగము పొందగా, 1985, 1986వ సంవత్సరములనాటికి ఈ సంఖ్య 380 వరకు పెరిగింది అనగా సన్నకారు, చిన్నకారు వ్యవసాయదారులు వారికి కావలసినటువంటి పంటఋణములు, క్రిమి సంహారక మందులు, పంపు సెట్లు, ఆయిల్ ఇంజన్లు, ఋణములు వివిధ గ్రామీణాభివృద్ధి పథకములక్రింద పొందినారు. అదేవిధంగా వ్యాపార రంగమునందు 1984వ సం॥లో 311మంది రు. 5.15 లక్షల రూపాయలు వివిధ బ్యాంకులనుండి ఋణసహాయం పొందగా, 1986వ సం॥నాటికి 344 మంది రు. 10.22 లక్షల రూపాయలు ఋణములుగా పొంది, తమ తమ వ్యాపారములను నిర్వహించుచున్నారు. పరిశ్రమల రంగమునందు కూడా, 1984సం॥లో 182మంది రు. 4.21 లక్షల రూపాయలు ఋణములు పొందుట జరిగినది. అదే 1986 సం॥నాటికి 217మంది రు. 7.50 లక్షలలో ఋణము కల్పన చేయుటకు జరిగినది.

పైన పేర్కొనిన రెండవ పట్టికను పరిశీలించినయెడల గత మూడేళ్లలో షెడ్యూల్ కులములు, షెడ్యూల్డ్ తెగలు, వెనుకబడిన తరగతులవారు బ్యాంకు సేవలను ఉపయోగించుకొనుటలో ముందంజ వేయుచున్నారు. బ్యాంకుల ఋణ సహాయము ప్రభుత్వ ప్రణాళికలు, పథకములకు అనుగుణముగా జరుగుచున్నదని పై పట్టిక మూలకముగా ఋజువగుచున్నది.

పేదరిక నిర్మూలన పథకములు, గ్రామీణాభివృద్ధి, స్వయం ఉపాధి కల్పనా పథకములువంటి ప్రణాళికా లక్ష్యములను సాధించుటలో బ్యాంకులయొక్క నిర్విరామకృషి, ప్రభుత్వ సంస్థల ఇతోధిక సహాయము లబ్ధిదారుల శ్రమతో కూడిన కృషి ఈ మూడు సకాలములో జరిగిననాడు, గ్రామరాజ్యమే రామరాజ్యంగా బాసిల్లి, దేశము సర్వతో ముఖాభివృద్ధి చెందుతుందనుటలో సందేహము లేదు



# వేదన - శోధన

వేదనానంతర శోధన
ఆవేదనాంతరంగ సమారాధన
వాంఛలోంచి నింగికెగిరే
అనంతతృప్తి విహంగం
ప్రతి ఒక్క హృదయంలో సుషుప్త బాల్యం
ఉన్ముక్త తరంగాల పైకెగిరే నిర్భయ క్షణాలు.
ఆనంద రోదనానంతర—
మానవ సరస్సులో నిరంతరాన్వేషణ,
ఈ బాధ ఈ గాధ
మనందరి ఆజన్మాంతర పరిధిలో
అన్యాయాన్ని అసత్యాన్ని
నిలదీసే పరిశోధన పరివేదనాంతరంగంలో
నిండా మునిగినచోట విముక్తి
తిరిగి ఈ శోధనానంతర వేదన!!

# బస్సుకోసం సజీవ సమాధిలో!

బస్సుస్టాండ్‌లో
సజీవ సమాధిలో గొణుగుతూ
నిలువునా తరిగిపోతున్న ఆయుష్షు
ఈ నగరంలోని నాగరికుడి పది శాతం జీవితం!
జీవన భృతికోసం
జువ్వన ఎగిరే జనం
తేనెటీగల్లా బస్సు ద్వారాలకు అతుక్కుని
రోజువారి జీవన సమరంలో
గెలిస్తే ఆ పూటకు తిండీ నిద్ర
లేదా
కాలు విరిగి ప్రభుత్వాసుపత్రి నరకంలో!
కాలు తొక్కినా
నిన్ను గబాలున తోసేసి నీ వెనుకున్నవాడే
నువ్వు కూచోవలసిన సీటును ఆక్రమించుకున్నా
ఇంటి గమ్యం వదలని తేనెతుట్టెలోనే నువ్వు,
బస్సు లోపలి కడ్డీలకు బలంగా కరచుకుని
వేలాడుతున్న ఆరాటాలు పోరాటాలు
నిలువగలిగితేనే ఇక్కడ మనుగడ
ఆగిపోతే జీవితాంతం తప్పిపోతుండే బస్సు
నశేషంగా వెక్కరించే వయస్సు!!

శ్రీ నిఖిల్

# గొప్ప గుర్తు

అడవుల్నీ ఆకాశాల్నీ వొదిలి
భద్రత కోసమని
మనం పంజరాల్నే ప్రేమిస్తుంటాం
మనం చుట్టుకున్న రంగుల పేలికలు కూడా
మన బలహీనతల్ని
కప్పలేకపోయినప్పుడు కాస్త బాధ
మన కళ్లు దృశ్యాల్తోనూ
మన కాళ్లు దూరాల్తోనూ
రమిస్తూనే వుంటాయి
స్పష్టమైన కష్టాల్లోంచి
అతి సంక్లిష్టమైన గొప్ప కష్టాల్లోకి
ప్రయాణించడమే మనం అభివృద్ధి అంటాం
నిజానికి మనం ఎక్కువగా
దీపం చుట్టు పురుగుల్లానో
నీటిమీది బెండుల్లానో—
మన మరణమే
మన మిక్కడ జీవించామనడానికి
గొప్ప గుర్తు.

శ్రీ గాలి నాసర రెడ్డి

డా॥ సంగనభట్ల నరసయ్య

# ప్రవాసాంధ్రుడు 'వృత్తమౌక్తిక' కర్త చంద్రశేఖరభట్టు వంశ, జీవిత, రచనా విశేషములు

సంస్కృతంలోని షట్శాస్త్రాల్లో ఒకటైన ఛందశ్శాస్త్రానికి సంబంధించిన గ్రంథాలు పింగళుడు మొదలు బహు ఛాందసికులచేత బహుళసంఖ్యలో రచితమైనాయి కొన్ని గతానుగతికంగా లక్షణం నిర్దేశిస్తే కొన్ని తమ వైశిష్ట్యంతో చిరకీర్తినార్జించాయి. అలాటి వాటిలో వృత్తమౌక్తికం ఒకటి. దీని రచయిత చంద్రశేఖరభట్టు. పండిత వంశీయుడైన ఇతడు ఆంధ్రుడు ఈతని రచనలలో విశిష్టమూ, పాండితీస్ఫోరకమైన ఈ విశిష్టలక్షణ గ్రంథం ఉత్తర భారతదేశాన ప్రచురము, ప్రచలితమైంది.

క్రీ.శ. 1617 నాటికి రాయబడ్డ ఈ గ్రంథం ముద్రితమైనదే. బికనూర్(రాజస్తాన్)లోని 'అనూప్ సంస్కృత లైబ్రరీ'లో భద్రపరచ బడిన ప్రతి ఆధారంగా రాజస్థాన్ ఓరియంటల్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్, జోధ్‌పూర్ ద్వారా క్రీ శ. 1965లో మహామహోపాధ్యాయ వినయసాగర్ సంపాదకత్వంలో భట్టలక్ష్మీనాథుని (రచయిత తండ్రి) దుష్కరోద్ధారటీక, మహామహోపాధ్యాయ మేఘవిజయుల దుర్గమ బోధ వ్యాఖ్యలతో ప్రచురితమైంది ఈ లైబ్రరీలో భద్రపరచబడిన ఆధారప్రతి - గ్రంధరచనా సమాప్తి తరువాత 14 ఏండ్లలోపే అంటే విక్రమశక సం॥ 1690లో (క్రీ శ 1632) ఆగ్రా నివాసి లాల్‌మణి మిశ్రుడు పూర్తిచేసిన నిజలిఖిత ప్రతి కావడం విశేషం.

సంస్కృతభాషలో రాయబడ్డ ఈ వృత్తమౌక్తికం సంస్కృత, ప్రాకృత, అపభ్రంశ సాహిత్యాల్లో ఉపయోగించబడే అన్ని ఛందస్సులను దాదాపుగా లాక్షణీకరించిన విశిష్టగ్రంథం. దీని ఇతర విశేషాలేమంటే ఇందులో లభించినన్ని ఛందస్సులకు లక్షణాలు మరే ఇతర సంస్కృత ఛందో గ్రంథాల్లో లభించవు. ఏ ఇతర పూర్వసంస్కృత ఛందో గ్రంథాల్లో లభించని బిరుదావలి మొదలైన గద్య రచనా భేదాలు ఇందులో వర్ణింపబడినవి. ఇవి గేయగంధులు. కొన్ని వృత్తాలకు ఇవ్వబడిన ఉదాహరణలు కవిస్వీయ రచనలు మరికొన్ని తన తండ్రితాతల కావ్యాలలోనివి ఉదాహరణకు స్వీకరించబడినవి. మరోవిశేషమేమంటే ఈ గ్రంథం చంద్రశేఖరభట్టురాసి మధ్యలో అల్పాయుష్షుతో మరణిస్తే తండ్రి లక్ష్మీనాథభట్టు పూర్తిచేసాడు. ఇది ఒకరకంగా వారి కుటుంబ రచన అనవచ్చు.

వృత్తమౌక్తిక కర్తయైన ఈ భట్ట చంద్రశేఖరుడు తెలుగు బ్రాహ్మణుడు వల్లభాచార్య వైష్ణవ సంప్రదాయి. వశిష్టగోత్రీకుడు లక్ష్మీనాథభట్టు తండ్రి, తల్లి లోపాముద్ర జననం సుమారుగా విక్రమ శకం 1640-45 (క్రీ శ 1582-87)ల మధ్య ఉండి ఉంటుంది. 30 ఏండ్ల దరిదాపు వయసులో కీర్తిశేషుడైనాడు. ఈతని వంశం ప్రసిద్ధమైన పండితవంశం. విశేషించి ఆంధ్రదేశాన్నుంచి ఉత్తరభారతానికి ప్రసాదించిన పుష్టిమతం వైష్ణవ సంప్రదాయం ప్రవర్తకుడైన మహాప్రభు వల్లభాచార్యుడు ఈ వంశంవాడే. రచయిత ప్రపితామహునకు సాక్షాత్తు అన్నగారే సార్థక జన్ముడైన లక్ష్మణభట్టు నలుగురు కుమారుల్లో రెండవకుమారుడు (పూర్వాశ్రమంలో యజ్ఞ నారాయణభట్టు నామాంకితుడైన) మహాప్రభు వల్లభాచార్యులైతే మూడవకుమారుడే మన చంద్రశేఖరభట్టు ప్రపితామహుడైన (తాతగారి తాత) కీర్తి కాయుడు రామచంద్రభట్టు. ఈతని కుమారుడు నారాయణభట్టు మనుమడు రాయభట్టు. మునిమనవడు లక్ష్మీనాధభట్టు. మనుమని మనుమడు ప్రస్తుత గ్రంధకర్త చంద్రశేఖరభట్టు వీరి వంశవృక్షమిది.




పై వంశంలోని వారంతా దిగ్గజాల్లాంటి పండితులే. వంశప్రతిష్ఠకు ఒకరి కంటె ఒకరు తమ కీర్తితో మూలస్తంభాలై నిలచినవారే. చంద్రశేఖరభట్టు ఆయన తండ్రితాతలు మహాపండితులు, బహుగ్రంథ నిర్మాతలు, లాక్షణికులు, వీరి గ్రంథాలు ఆధారంగా పై వంశవృక్షం బహుధా నిర్ధారితమైంది.

మహాప్రభు వల్లభాచార్యులు, రామచంద్ర భట్టుల తండ్రిగారైన లక్ష్మణభట్టు సోమయాజి వెలనాటి బ్రాహ్మణుడు. గ్రంథస్థాధారం ప్రకారం "తెలంగ దేశీయ వెలనాటి యజుర్వేదాంతర్గత తైత్తిరీయ శాఖాధ్యాయీ ఆపస్తంభ ... భారద్వాజ గోత్రీయుడు. ధర్మపుర నివాసి మౌద్గల్య గోత్రీయుడైన కాశీనాథభట్టు గృహము ఈతనికి మాతామహుల గృహం. బహుశ ఈ ధర్మపురం కరీంనగర్ జిల్లాలోని ధర్మపురికావచ్చు. ఎందుకంటే సంగనభట్టు, రాయంభట్టు, పెద్దంభట్టు, వామనభట్టు ఇత్యాది గృహనామాలతో బ్రాహ్మణ కుటుంబాలు నేటికీ ఉన్నాయి. అంతేగాక వల్లభాచార్యుల వైష్ణవపీఠం ఈ గ్రామంలో ఉన్నది. వి. శ. 1546లో దక్షిణ భారతదేశంలోని వెంకటేశ్వర బాలాజీవద్ద ఈయన మరణించాడు. ఇది తిరుపతి అనుకోవడంలో సందేహం ఉండదు. కంకరవాడ ఈతని స్వగ్రామంగా పేర్కొనబడింది. ఏడు తరాలనుండి ఈయన వంశంలో సోమయాగం నిర్విఘ్నంగా నడిచిందట వంద సోమయాగాలు ఈతని హయాంలో పూర్తిఅయ్యాయి. ఈలా వందపూర్తిచేస్తే కాశీవెళ్ళి లక్షబ్రాహ్మణులకు భోజనం పెట్టాలనే నియమం ఉండటంతో భార్యఎల్లమ్మతో కలసి కాశీ బయల్దేరాడు. మార్గమధ్యంలో రాయపూర్‌జిల్లా ఛత్తీసగఢ్‌లోని చంపారణ్యం అనేచోట శ్రీ వల్లభాచార్యులు జన్మించారు.

ఈయన మొదటి కొడుకు నారాయణభట్టు (రామకృష్ణభటు నామాంతరం) దక్షిణ భారతదేశంలోని కేశవపురి మఠం అధిపతిగా ఉన్నాడు. రెండవ కొడుకు మహాప్రభు వల్లభాచార్యులు (ముత్తాత తండ్రి యజ్ఞనారాయణభట్టు కాలంనాటి సాలగ్రామము, మదనమోహన (కృష్ణ) విగ్రహము పొంది) వైష్ణవమత ప్రచారదీక్షనొంది, పుష్టిమత ప్రవర్తకుడైనాడు. లక్ష్మణభట్టు సోమయాజి కుమారులలో మూడవవాడు, ప్రస్తుత గ్రంథకర్త చంద్రశేఖర భట్టునకు ప్రపితామహుడు ఐన రామచంద్రభట్టు మహాకవి లాక్షణికుడు. ఈ రామచంద్రభట్టు భరద్వాజ గోత్రీయుడైనా, దత్తతకారణంగా వశిష్ఠ గోత్రీయుడైనాడు. ఈతని జననం కాశీనగరంలో జరిగింది. బహుశ ఈయన తరంనుండే ఈ ఆంధ్రపండిత వంశం ప్రవాసాంధ్రవంశం అయ్యుంటుంది. ఈయన వెలనాటి తెలుగుజాతి గౌరవ ప్రతిష్ఠ నిలబెట్టాలన్న తండ్రి లక్ష్మణభట్టు ఆశయాలకు అనుగుణంగా ఉదాత్త ఆదర్శాలతో జీవించాడు. వేదాంత మీమాంస, వ్యాకరణ, సాహిత్యశాస్త్రాలలో మహావిద్వాంసుడీతడు. వాదవిజేత ఐన ఈ మహాపండితుడు ఇతర పండితులను వాదాలలో జయించిన కారణంగావారు మాత్సర్యంతో ఈతనికి విషంపెట్టి చంపించారని, అల్పాయుష్యంతో మరణించాడని ఆధారాలు చెపుతున్నాయి. బహుగ్రంథకర్త ఐన ఇతడు తన అన్న ఐన పరమపూజ్యుడు మహాప్రభు వల్లభాచార్యులను పరమగురువుగా స్తుతించాడు. కృష్ణకుతూహల కావ్యంలో "శ్రీ లక్ష్మణభట్టు వంశతిలకః శ్రీ వల్లభేంద్రానజః అని చెప్పుకున్నాడు. ఆయన సన్నిధిలో పురుషోత్తమ క్షేత్రంలో సకల శాస్త్రదర్శన గ్రంథాలు చదివినాడు. కృష్ణకుతూహలంతోబాటు గోపాల లీలా మహాకావ్యం, రోమావలీ శతకం, రసిక రంజన లఘుకృతి (శృంగార వైరాగ్య శతకం నామాంతరం - సోపజ్ఞటీకా సహితం)[1] శృంగారవేదాంతం (అప్రాప్తం), దశావతార స్తోత్రం (అప్రాప్తం), నారాయణాష్టకం ఈతని ఇతర కృతులు ఈతని కృష్ణకుతూహల మహాకావ్యంనుండి చంద్రశేఖరభట్టు వృత్తాలకు లక్ష్యాలు ఉద్ధరించాడు.

అస్మద్వృద్ధ పితామహ మహాకవి పండిత శ్రీరామచంద్ర భట్ట విరచితే 'కృష్ణకుతూహలే' మహాకావ్యే శ్రీ భగవదావిర్భావ వర్ణన ప్రస్తావే అని వృత్తమౌక్తికంలో ప్రహర్షిణీ వృత్తం లక్ష్యంగా ఇవ్వబడ్డది.[2] అదేవిధంగా మాయా, మత్తమయూర, ప్రహర్షిణీ, వసంత తిలకా, ప్రహరణ కలికా, మాలినీ, పృథ్వీ శిఖరిణీ, హారిణీ, మందాక్రాంత, శార్దూల విక్రీడితాః స్రగ్ధరాఛందాలకు ఈ కావ్యంలోనుండే వృత్తమౌక్తికంలో లక్ష్యాలుగా స్వీకరించ బడ్డాయి. అట్లే దశావతార స్తోత్రంనుండి పంచచామర వృత్తానికి లక్ష్యంగా ఒకపద్యం[3], నారాయణాష్టకంనుండి మదాలస ఛందోలక్ష్యంగా ఒకపద్యం[4] వృత్తమౌక్తికంలో లక్ష్యాలుగా చంద్రశేఖరభట్టుచేత స్వీకరించ బడ్డాయి.

రామచంద్రభట్టు మనుమడు చంద్రశేఖరభట్టు (ప్రస్తుత గ్రంథకర్త) తాత ఐన రాయభట్టు కూడా పండితకవే. ఈతడు శృంగార కల్లోలం అనేపేరుతో 104 పద్యాల ఖండకావ్యం పార్వతీ శంకరుల

యగాధను రాసాడు. చంద్రశేఖరభట్టు తన వృత్తమౌక్తికంలో "స్మత్పితామహో కవి పండితశ్రీరాయభట్టుకృతే శృంగార కల్లోలే దశావ్యే" అంటూ మాలినీ వృత్తాన్ని లక్ష్యంగా ఉదహరించాడు.[5]

రాయభట్టు కుమారుడు, చంద్రశేఖరభట్టు తండ్రియైన లక్ష్మీనాథభట్టు ఉజ్జ్వల యశస్వి. మహాపండితుడు అలంకార, ఛందోశాస్త్ర వేత్త. సకలోపనిషద్రహస్యార్ణవ కర్ణధారి' అని చంద్రశేఖరభట్టు చేత కీర్తింప బడినాడు.[6] ఈతడు సరస్వతీ కంఠాభరణం (భోజరాజ కృత అలంకార గ్రంథం)కు దుష్కరచిత్ర ప్రకాశికా అన్న పేరుతో, ప్రాకృతపైంగలంకు ఛందః ప్రదీపం లేదా పింగల ప్రదీపం అన్న పేరుతో,[7] తనకొడుకు రాసిన వృత్తమౌక్తికానికి దుష్కరోద్ధారమనే పేరుతో టీకలు రాయడమేగాక ఉదాహరణ మంజరి (వి. శ. 1657కు పూర్వరచన), శివస్తుతి, నందనందనాష్టకం, సుందరీధ్యానాష్టకం, దేవీస్తుతి అనేకృతులు రాసాడు. ఉదాహరణ మంజరి ఛందోలక్షణ గ్రంథం, దీంట్లో ఛందాలభేదాలు, ప్రబోధాలు విపులీకరించి వ్రాసినట్లు చెప్పబడ్డది.[8] శివస్తుతిలోనిది ఒకపద్యం తనకొడుకు చంద్రశేఖరభట్టు చేత వృత్తమౌక్తికంలో మదనగృహమనే పేరుగల మాత్రాచ్ఛందస్సుకు లక్ష్యపద్యంగా ఉద్ధరించబడ్డది.[9] నందనందనాష్టకంలోని ఒకపద్యం ఇలాగే సుందరీధ్యానాష్టకంలోని మరోపద్యం చర్చరీ ఛందోలక్ష్యంగా వృత్తమౌక్తికంలో ప్రదర్శింపబడినది.[10] దేవీస్తుతి గ్రంథం హీరం అనే ఛందస్సుకు లక్ష్యంగా ఉద్ధరించబడే సమయంలో పేర్కొన బడింది.[11]

ఇక విశేషంగా చెప్పవలసినది వృత్తమౌక్తిక ద్వితీయఖండ పురాణము తనపుత్రుడు రాసిన వృత్తమౌక్తిక గ్రంథంలోని అంత్య భాగం తానే పూర్తిచేయడం బహుశ సాహిత్యలోకంలోనే విశేష విషయం అనుకొంటాడు. యోగ్యుడు, ప్రతిభాశాలి, మహాకవి, వినయశీలి ఐన తనకుమారుడు చంద్రశేఖరభట్టు ప్రారంభించిన వృత్తమౌక్తిక ద్వితీయ ఖండం మధ్యలో ఆయన అకాల మృత్యువు కారణంగా ఆగిపోతే దానిని పూర్తిచేసాడు. మృత్యువు సమీపించగా చంద్రశేఖరభట్టే తన తండ్రిని ఆ గ్రంథం పూర్తిచేయమని అర్థించాడు.

యాతే దివం సుతనయే వినయోపపన్నే
శ్రీచంద్రశేఖర కవౌ కిల తత్ప్రబంధః
విచ్ఛేద మాప భువి తద్వచసైవ సార్థం
పూర్ణీకృతశ్చ సహ జీవన హేతవేఽస్య
శ్రీవృత్త మౌక్తిక మిదం లక్ష్మీనాథేన పూరితం యత్నాత్
జీయాదాచంద్రార్కం జీవాతుర్జీవలోకస్య

[వృ. మౌ. ద్వి. ఖం. గ్రంథకృతప్రశస్తి. 8,9 శ్లో]

చంద్రశేఖరభట్టు 1675 వి. శ. (క్రీ. శ. 1617)లో వృత్తమౌక్తిక ప్రథమఖండం పూర్తిచేయగా తండ్రి తర్వాతి ద్వితీయ ఖండంలోని శేషభాగాన్ని వి. శ. 1676లో పూర్తి (గ్రంధ సమాప్తి) చేసాడు. అయితే ఈ గ్రంథంలో ద్వితీయ ఖండం ఎంత భాగం తండ్రి పూరణమో గ్రంథస్థా ధారంలేదు. లక్ష్మీనాథభట్టు శైలిలో, సంక్షిప్తత మరియు ఇతరేతరాంశాలను ఆధారంగా చేసికొని కుమారుని రచన వృత్తమౌక్తిక ద్వితీయ ఖండంలోని చతుర్థ (అర్ధసమ) ప్రకరణము వరకని, తండ్రిరచన, పంచమ (విషమవృత్త) ప్రకరణము నుండి గ్రంథాంతం వరకని పండిత నిర్ధారణము జరిగింది.[12] లక్ష్మీనాథభట్టు తన కొడుకు రాసిన గ్రంథాన్ని పూరించడమేగాక, కుమారుని రచనలోని ప్రథమఖండ ప్రథమ ప్రకరణంలోని కొంత భాగానికి టీక రాసినాడు ఇది. వి. శ. 1687లో కార్తీక బహుళ పంచమికి పూర్తి చేసినాడు. ఈ టీక పేరు వృత్తమౌక్తిక వార్తిక దుష్కరోద్ధారటీక మాత్రా ఛందస్సులకు ప్రస్తారంవంటి విశేష ప్రక్రియలు ఇందులో ఆకర్షణీయంగా వివరించాడు ఈటీకను ఇతర షట్ప్రత్యయాలను కఠినంగా వున్నవాటిని సుకరం చేయడానికి రాస్తున్నానని వివరించినాడు.

ఇటువంటి పండితుల వంశంలో పుట్టిన చంద్రశేఖరభట్టు వంశ ప్రతిష్ఠకు సరియైన విధంగా బహుగ్రంధకర్తగా లాక్షణికునిగా గణుతికెక్కాడు. ప్రస్తుత వృత్తమౌక్తిక గ్రంధమేగాక పాండవ చరిత్ర మహాకావ్యం, పవనదూత ఖండకావ్యం, ప్రాకృత పైంగళ ఉద్యోతటీకకూడ రాసినాడు. పాండవ చరిత మహాకావ్యంలోనివి ద్రుత విలంబితః మాలిని. శార్దూల విక్రీడిత. మహా ప్రగ్ధరఛందాలు తన వృత్తమౌక్తికంలో లక్ష్యాలుగా, స్వీకరించినాడు. పవనదూత కావ్యం లఘుకృతి. మేఘదూతం వంటిది కృష్ణుడు మధురకు పోగా విరహిణిఐన రాధ పవనుని ద్వారా సందేశము పంపుతుంది. ఈ కావ్యంలోని పద్యం శిఖరిణీ ఛందోలక్ష్యంగా వృత్తమౌక్తికంలో ప్రదర్శించబడింది. పైరెండు గ్రంధాలు తన ఉద్ధరణలో నేతప్ప, లభ్యం కానివి ప్రాకృతంపైగల ఉద్యోత టీక వి. సం. 1673 లో రాయబడింది. విశేషమేమంటే ఈ టీకలోని అంశాలు కొన్ని తండ్రి లక్ష్మీనాథభట్టు 'వృత్తమౌక్తిక వార్తిక దుష్కరోద్ధారటీక'లో ఉద్ధరించినాడు. ప్రాకృత పైంగలంలోని మాత్రావృత్త, వార్తికవృత్త పరిచ్ఛేదాల్లో కేవల మాత్రావృత్త పరిచ్ఛేదానికే ఈతడు టీక రాసినాడు.

చంద్రశేఖరభట్టు లాక్షణిక యశస్సుకు మూలమైన వృత్తమౌక్తికం అతని ఛందశ్శాస్త్ర పాండిత్యమునకు దర్పణము వంటిది. ఉభయ ఖండాల్లో పూర్తిచేయాలనుకొని ప్రారంభించిన ఈ గ్రంథం ద్వితీయఖండం మధ్యలో చతుర్థ ప్రకరణం వరకే రాసినాడు. తక్కిన భాగం దశమఖండం వరకు తండ్రిరచనగా మిగిలిపోయింది ప్రథమ ఖండం మాత్రా ఛందస్సులు, ద్వితీయ ఖండం వార్ణిక చ్ఛందస్సులుగా విభజింపబడింది. ద్వితీయ ఖండంలోని ఉత్తర రచనయైన ప్రథమ

(షడ్వింశతి చ్ఛందోజాతవృత్తముల) ప్రకరణం, ద్వితీయ (ప్రకీర్ణ) ప్రకరణం తృతీయ (దండక)ప్రకరణం చతుర్థ(అర్ధసమవృత్తి) ప్రకరణం వృత్తమౌక్తికమన్న ఈ గ్రంథనామమును సార్థకం చేస్తాయి. సంస్కృత ప్రాకృత ఛందస్సులకు ఇది చక్కని లక్షణ గ్రంథం సర్వసమగ్రం. తెలుగులో అప్పకవీయమునకుగల లక్ష్యశుద్ధి ఈ గ్రంథంలో ఉంది. అప్పకవికి ఇతడు పాతికేండ్లముందువాడు. ప్రేరణ కాదగినవాడు. విశేషించి యతివిషయంలో చక్కని విశ్లేషణ ఈ గ్రంథంలో కనబడుతుంది. గద్యభేదాలలో తెలుగు రగడల ఛాయలు న్నాయి. రగడను పోలిన ఒకగద్య మచ్చుకు పరిశీలిస్తే ఈవిషయం స్పష్టం అవుతుంది.

అమల కమల రుచి * ఖండన పటుపద
నటన పటిమ హృత * కుండలి పతిమద
నవకువలయ్యకుల * సుందర రుచిభర
ధనతడిదుపరిమిత * బంధుర పటుధర

వృ. మౌ. ద్వి. ఖం. బిరుదావలి ప్రక. 220

16మాత్రలతో సాగే (16పాదాలుగా)ఈరగడ ప్రాసరహితంగాఉన్నా అంత్య ప్రాసతో అచ్చంగా తెలుగురగడ (మధురగతి)వలె ఉన్నది బిరుదావలిని గద్యభేదంగా ఛందశ్శాస్త్రంలో చెప్పడం ఈ గ్రంథం యొక్క మరో విశేషం.

ఈ విధంగా ఆంధ్రుడైన చంద్రశేఖరభట్టు ఉత్తరభారతవాసి యైన తన వృత్తమౌక్తిక గ్రంథరచనతో ఛందోలాక్షణిక లోకంలో స్థిరనివాస మేర్పరచుకొన్నాడు. ఈతని గ్రంథకాలం (క్రీ. శ.1 శతాబ్ది) అర్వాచీనమే ఐనా సంస్కృతా పభ్రంశ ప్రాకృత ఛందోకాలతో లక్షణ పరిధిలో వైశాల్యం కలిగి ఈతని వృత్తమౌక్తిక విశిష్టత నాపాదించుకొన్నది.

**అధస్సూచికలు :**

1. టీక రచనా కాలం విక్ర. శం. సం. 1580-అయోధ్యలో
2. వృత్తమౌక్తికం (క్రీ. శ. 1965(జోధ్ పూర్
3. ,, , ద్వితీ. ఖండం వృత్తనిరూపణప్రకరణలపుట129
4. ,, ,, ,, ,, ,, ,, ,, 167
5. ,, ,, ,, ,, ,, ,, ,, 121
6. ,, ,, గ్రంథకృత ప్రశస్తి ,, ,, 291

మరియు ఇతర విశ్రామాంత (ప్రకరణాంత) గద్యంలో

7. పింగళ ప్రదీపటీక రచనాకాలం వి.శ. 1657. దీనిలోతన వంశ వృక్షం రాశాడు.
8. పింగళ ప్రదీపం, వృత్తమౌక్తిక కాలంలో ఇది చెప్పబడింది.
9. వృత్తమౌక్తికం - ప్రథమ ఖండం - పద్మావతిప్రకరణంపుట45
10. ,, ,, - ద్వితీయ ,, - వృత్తనిరూపణ ,, ,,144
11. ,, ,, - ప్రథమ ,, - పద్మావతీ ,, ,, 43
12. ,, ,, - భూమిక (సంపాదకునిది) ,, ,, 37

# రామప్పగుడి

శ్రీ కొడవంటి లీలామోహనరావు

ఉలి మెచ్చిన రాళ్ళు
రసజగత్తుకు దర్పణాలయ్యాయి.

కరి నెరగని కాలం
ప్రతిభకు ఎర్ర తివాచీ పరచింది.

భాష కందని భావం
కళ్ళముందు హరివిల్లై విరిసింది.

ఏ శిల్పి చెప్పిన భాష్యమో
కలకాలం కలికితురాయై నిల్చింది.

# తిరుపతి వేంకటకవులు
# పూరించిన సమస్యలలో కొన్ని

(కీ॥శే బ్రహ్మశ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి అముద్రిత వ్రాతప్రతినుంచి)

సౌజన్యము : దీ. పి. శాస్త్రి కుమారులు దీపాల రాధాకృష్ణమూర్తి, శాస్త్రి,
శిష్యులు సాహిత్యభూషణ నవులూరి మాలెకొండయ్య

"వటుబీజము లంతలేసి వనిత కుచంబుల్."

వనిత కుచములు, మఱ్ఱి విత్తనము లంతవి — అని యర్థము. హాస్యాస్పదమైన వర్ణనము.

"చటులాక్షి వయసు ముదురని
మట మట నీకేల! మధ్యమ వయస్సట, యో
విటు! కొబ్బరి బొండాల్ కా
వటు! బీజములంతలేసి వనిత కుచంబుల్"

అని పూరణము. ఇందు 'వటు' శబ్దము 'కావటు' అని మారి, హర్షదాయకమైన యర్థమేర్పడ్డది.

"సూర్యుడుదయ శిఖరి నెక్కెఁ జుక్కలు వొడిచెఁ"

సూర్యుడుదయించెను, చుక్కలు పొడిచెన్ను-అని యర్థము అది ప్రకృతి విరుద్ధము. అది యట్లుండగా. కందపద్య పాదమైన యీ సమస్యను వేరే పద్యములో పూరించవలెనని నియమము

వారి క్రిందివిధముగా పూరించినారు—

"గ్రహణ దినమైన కతమునఁ గబళనంబు
సలిపె రాహువో కేతువో; గిలితుఁడయ్యెఁ
గార్యభరమున, నట్టులే సూర్యుఁడుదయ
శిఖరినెక్కెఁ జుక్కలు వొడిచెఁ 'దళముగ,"

గ్రహణ దినమగుటచేత, రాహువో కేతువో సూర్యుని మింగెను. -మింగబడిన సూర్యుడు, అట్లే నియమానుసారము, ఉదయ పర్వతమెక్కెను; చుక్కలు పొడిచెను- అని యర్థము.

ఆనాడు నిండు గ్రహణమనియు, గ్రహణమైనను, ఉదయించక తప్పదు గనుక సూర్యు డుదయించినాడనియు, ఉదయించినను కాంతిహీను డగుటచేత, చీకట్లు క్రమ్మి, చుక్కలు పొడిచినవనియు భావము.

ఇట్లు వారి పూరణములో, సూర్యోదయమున చుక్కలు పొడిచినవి; కందపద్యము గీతపద్యముగా రూపొందినవి.

**శ్రీ కాకుటూరు నాగరాజారావు**



"చరిత్ర విద్యాధర" తంరగా కృష్ణమూర్తి

# చాళుక్య - విష్ణుకుండిన వంశావళి - తులనాత్మక పరిశీలన

చరిత్రగతి చాల విడ్డూరమైనది. ఒకేరకమైన వంశోత్పత్తి కథతో చాళుక్య-విష్ణుకుండిన వంశముల చరిత్ర కెక్కియున్నది. ఆ కథలలో యదార్థమెంత యున్నదోగాని వానికొక పరిగణనము లభించి చరిత్ర చోటుచేసికొని స్థిరరూపము నందినవి. ఆయా కథలలో మట్టంకింపబడిన విషయముల సారూప్య లక్షణము, వైవిధ్య లక్షణముల తులనాత్మక పరిశీలనము చేయు యుద్దేశముతో నీ వ్యాసరచన కుద్యమించితిని.

చాళుక్య వంశోత్పత్తి జరిగిన విధానమీ క్రింది విధమున వక్కాణింపబడినది.

> విజయాదిత్య నామరాజా
> విజిగీషయా దక్షిణాపథం గత్వా
> త్రిలోచన పల్లవ మధిక్షిప్య దైవదురీహ యా
> లోకాంతర మగమత్ xx xx

అని పూర్వ చాళుక్యుల శాసనములలో వక్కాణింపబడినది. దీనినే అనుసరించుచు వాశిష్ఠ భప్పన్నమను గ్రంథమున పూసపాటి రాచిరాజు

> సీ॥ అలఘు విక్రముడు కోసల జయాదిత్యుండు
> దక్షిణ విజిగీష దాడి వెడలి
> నిగమాగమాంత పారగుడాజి భీష్ముండు
> శ్రీ దేవవర్మ సైన్యాధికముగ
> అఖిల సీమల విజయ స్తంభములనాటి
> దివికేగెను xx xx

అని త్రిలోచన పల్లవునితోడి పోరు ప్రసక్తి లేకుండ విషయ నివేదన మొనర్చినది. అట్లు చేయుటలో విష్ణుకుండిన వంశ సంభవ ప్రస్తావనకు బీజావాప మొనర్పబడినది. అదేదన - కోసల విజయాదిత్యుని సైన్యాధిపతి దేవవర్మ త్రిలింగదేశభూమి పాలకత్వము వహించి ఆ తర్వాత సార్వభౌమపదవీ రాజమానుడగుట! ఈ దేవవర్మయే విష్ణుకుండిన వంశ మూలపురుషుండని రాచిరాజు తన గ్రంథములో స్పష్టీకరించినాడు.

> xx xx త్రిలింగదేశభూమి
> వాహినీపతి దేవవర్మ ప్రభుండయ్యె
> నడ్డూరి సీమయందాజికొండ్రు
> పల్లభునోడించి వైభవంబుల మించి
> సార్వభౌమ పదంబు జగతిగాంచె

ఈ విధిని చాళుక్య - విష్ణుకుండిన వంశ మూలపురుషులుగ చెప్పబడిన విజయాదిత్య దేవవర్మల ప్రసక్తి చారిత్రకముగ పరిగణనము లోనికి రాక ఈ క్రింది కథలలో మరుగున పడిపోయినది.

కోసల విజయాదిత్యుడు చనిపోవునాటి కాతని భార్య "మహాదేవి" అంతర్వత్నియై యుండెను. ఆమె శత్రురాజులని ప్రాణ భయముతో పాతి "ముడివేము" అగ్రహారము జేరి, అచట సద్బ్రాహ్మణుడును, వైదికధర్మకర్మ నిష్ణాగరిష్ఠుండును నగు విష్ణుభట్ట సోమయాజి ఆశ్రయమునంది శత్రురాజు పాలబడక రక్షింపబడెను. సోమయాజుల రక్షణలో "మహాదేవి" యొక శుభముహూర్తాన మగ శిశువును గాంచెను. ఆ నిసుగు క్రమక్రమాభివృద్ధి నొందుచుండ సోమయాజి వానికి కులోచిత వైదిక కర్మానుసారము జాతకోపనయనాది క్రియల నిర్వర్తించెను. "మహాదేవి" సోమయాజి దుహితగ పరిగణింపబడుచు వర్తించుచుండెను. ఆమె కుమారునకు "విష్ణువర్ధన" నామముంచి పెంచుచుండెను. ఆతడు యౌవ్వనదశ నందుసరికి కులోచిత యుద్ధవిద్యల, రాజ్యపాలనా విధుల నేర్చుకొనియుండినంత, తల్లి వలన తన తండ్రి మరణ వివరముల దెలిసికొని ప్రతీకార మొనర్ప స్థిర సంకల్పుడై సోమయాజి అనుమతిని బడసి, తల్లి ఆశీర్వాదము పొంది "నందభగవతి(గౌరి)ని పూజింప చాళుక్యగిరి కరిగెను. అందా

తడు బహునిష్ఠతో మహాసేనుని పూజలచే దన్ని, సప్తమాతృకల భజించి, కృపకు పాత్రుడై నారాయణు నధిక భక్తితో నారాధించి తృప్తుగావించి, శివునిరాణి "కౌశి"కి మెప్పు వడసి వరాహలాంఛనము సామ్రాజ్య లబ్ధివరముల బడసి, మగిడి వచ్చి సోమయాజికి 'తల్లికి' ప్రీతినింపెను అంత విష్ణువర్ధనుడు శక్తిత్రయ సంపన్నుడై విజృంభించి సైన్యముల గూర్చుకొని కదంబులు, గాంగుల ఇతర రాజన్యుల జయించి నర్మదాసేతు మధ్యస్థ విశాల భూభాగమునకు నేతయాయెను.

ఈ విష్ణువర్ధనుడే చాళుక్య వంశకర్తగా పరిగణింపబడెను కాని చాళుక్య రాజ్యము తొలుత స్థాపించినవాడు పులకేశి వల్లభుడని పశ్చిమ చాళుక్య శాసనములు తెల్పుచున్నవి మొదటి విష్ణువర్ధనుని కుమారుడు రెండవ విజయాదిత్యుడు. ఈతని కుమారుడు పులకేశి వల్లభుడు కాని చరిత్రలో జయసింహవల్లభుడు ఆతని కుమారుడు రణరాగుడు; ఈతని కుమారుడు పులకేశి వల్లభుడని చారిత్రక ప్రస్తావన మున్నది. ఆ విధిని మొదటి విష్ణువర్ధనుని, ఆతని కుమారుడు రెండవ విజయాదిత్యుని ప్రశంస చరిత్రకెక్కక మరుగున పడిపోయినది.

సాహిత్య పరముగనున్న కోసల విజయాదిత్య, విష్ణువర్ధన రెండవ విజయాదిత్యుల విషయమును వదలిపెట్టి మనము చాళుక్య వంశావళిని నిర్మింపదొరకొన్న విజయసింహుని మూలపురుషునిగ దీసికొని ప్రారంభింపవలెను. పూర్వ చాళుక్య చరిత్రకారులు తద్వంశావళి తొలి పురుషునిగ కోసల విజయాదిత్యుని కథ చెప్పుచునే ప్రథమ పూర్వ చాళుక్య రాజ్యస్థాతగ పులకేశి మనుమడు కుబ్జ విష్ణువర్ధనుని పేర్కొనచు నాతనినే మొదటి విష్ణువర్ధనునిగ పరిగణించుచున్నారు.

త్రిలోచన పల్లవుని కాలము 5వ శతాబ్ది; 6వ శతాబ్ది తొలికాలమ అని చరిత్ర ప్రసిద్ధము. కావున త్రిలోచన పల్లవు నెదిరించి వీరస్వర్గ మందిన కోసల విజయాదిత్యుని కాలమదియే యని యెంచి చాళుక వంశావళి నిర్ణయింపదొరకొన్న ఈ క్రింది విధముగ నుండును.




చాళుక్య వంశోత్పత్తి క్రమమునకు దీటుగా విష్ణుకుండిన వంశోత్పత్తి కథ సాగినది.

అనుమకొండ రాజ్యమును స్థాపించిన "యెఱుక దేవరాజు" అనంతర మాతని పుత్రులిర్వురు, ఆ పిదప నాగయ్య, గార్గేయు డను వారలు 186 సంవత్సరములు పాలించిన పిదప చంద్రవంశపురాజులీ యనుమకొండ రాజ్యమును పాలించిరి. చంద్రవంశపు రాజులు పాండవుల వంశమున జనమేజయుడుండెను. ఆతని వంశమున విజయార్కుడు సోమేంద్రుడు నను ఇరువురు భూపాలురు పుట్టిరి వారిలో విజయార్కునకు విష్ణువర్ధనుడు, సోమేంద్రునకు ఉత్తుం భుజుడు జనించిరి. వీరలిరువురును దేశము పంచుకొని పాలించిరి విష్ణువర్ధనుడు గోదావరికి దక్షిణమునసున్న "ధర్మపురి"ని రాజధాని జేసికొని, అనేక రాజులను జయించి రాజరాజ బిరుదమును బడసి కీర్తిప్రతిష్ఠలను గాంచెను. విష్ణువర్ధనునకు "నందుడు" అను కుమారుడు పుట్టి "నందగిరి" యను దుర్గమును నిర్మించి దానిని రాజధానిగ జేసికొని భూపరిపాలనము చేసెను. వీనికి సూరయాదిత్యుడు ప్రధానిగ నుండెను. నందుని భార్య భానుమతీదేవి. ఇతడు రాజ

భారమునంతయు మంత్రిపై నిడి శ్రీశైలక్షేత్రమునకు బోయి శ్రీ మల్లికార్జున దేవుని సేవించి, సిద్ధోపదేశమును పొంది యొక బిలములో ప్రవేశించెను అచట తపస్సు చేయుచుండిన యొక యోగిని వీని ధైర్యమునకు సాహసమునకు మెచ్చి ఖడ్గ ఖేటకములను, యోగవాగములను ప్రసాదించెనట! అంత నందుడు యోగవాగములచే జనార్ధనస్వామిని సందర్శింపగలిగెనట! ఆ స్వామి నందుని బోనీక నిలిపి నృసింహస్వరూపము దాల్చి ప్రత్యక్షంబైన నంత నందుడు చెక్కు చెదరక నిలిచియుండ, స్వామి సంతోషించి శస్త్రము లొసగి పొమ్మనగా సెలవు గైకొని, యతడు కాంచీపురమునకేగి చోళేంద్రుని కుమార్తెను వివాహము చేసికొని యటనుండి రామేశ్వరమునకేగి ధనుష్కోటిలో స్నానముజేసి నందపురమునకు విచ్చేసి యథావిధిని జనమనోరంజకముగ రాజ్యపాలనము సేయుచుండెనట!

ఈ నందరాజునకు విజయపాలుడు జనించెను. ఈతనికి సోమదేవుడు పుట్టెను. ఇతడు శత్రుజన భయంకరుడై పరాక్రమవంతుడై దేవబ్రాహ్మణ భక్తిపరుడై "కంధారి" మను పట్టణమును రాజధానిగ జేసికొని, బ్రాహ్మణుల కనేకాగ్రహారముల నొసంగుచు ప్రఖ్యాతుడయ్యెను. ఇంతియగాక మంత్రకూటము, భద్రాచలము మొదలగు ప్రదేశములలో అసంఖ్యాకములగు ఆలమందల నిలిపి, వాని పోషకత్వమునకు తగు అధికారుల నియమించి పోషించుచుండెను.



ఈ సోమదేవుని వైభవము నంతయు విని యీర్ష్యాళుడైన "కటక పురాధీశ్వరుడు" (కల్యాణ కటక పురాధీశ్వరుడా?) బల్లహుడు సోమదేవునిపై దండెత్తివచ్చి, ఆతని ఆలమందల నొడిసి పట్టుకొని పోవు సమయమున సోమదేవుని కొలువు చేయుచున్న అధికారులు, గోరక్షణకై నియమింపబడిన వీరభటుల బల్లహు నెదిరించి పోరి పరాజితులైరి.

ఈ వార్త విన్న సోమదేవు డుగ్రకోపమున మండిపడి, పెద్ద సైన్యముతో కదలివచ్చి కటకేశ్వరునితో తలపడెను. ఆరుమాసములు పోరు ఘోరముగ సాగెను. విజయలక్ష్మి యొకప్పుడు బల్లహుని వేరొకప్పుడు సోమదేవుని వరించుచు యుద్ధక్రమము దీర్ఘకాలము సాగుటచే విసువు జనించి, ఇరువర్గములవారు తాత్కాలికముగ పోరు నిల్పివేసిరి సోమభూపాలుడు కంధారమునకు తిరిగివచ్చి తన అనంతరము రాజ్యపాలన సేయ పుత్రసంతానములేకున్కి చింతించి మంత్రి పురోహిత సామంతాది జనముల రావించి, వారి యనుమతి వడసి పుత్రకామేష్టి యాగమొనర్ప నిశ్చయించుకొని యథావిధిగ దాని బరిసమాప్తి చేయ, సోమదేవుని పత్ని సిరియాలదేవి గర్భవతి యాయెను.

ఈ వార్త విన్న బల్లహుడు రాజుతోబాటు రాణినిగూడ బట్టుకొని వధించి శత్రు వంశాంకురము లేకుండ జేసికొను తలంపున "కంధారము" పైకెత్తివచ్చి కంధారమును ముట్టడించెను. సోమదేవుడు తన సైన్యముతో నాతని యెదుర్కొనెను. యుద్ధగతి ఉధృతముగ సాగి సోమదేవుడు రణరంగమున నిహతుడయ్యెను. సిరియాలదేవి ప్రాణ రక్షణార్థము పారి "యెఱుక దేవరాజు" శరణు జొచ్చెను. ఆతడు బల్లహుని కోపాగ్నికి వెఱచి, సిరియాలదేవి కాశ్రయమీయ నిరాకరింప ఆమె చేయునది లేక చింతించుచు బ్రాహ్మణోత్తముడు, షట్కర్మ నిరతుడు, దయాదాక్షిణ్యశీలుడునైన "మాధవశర్మ" కడకు బోయి రక్షణ వేడగా నాతడత్యాదరమున నామె నాదరించి తన యింట నుంచుకొని కూతుపగిది బెంచుచుండ బల్లహుడామె నన్వేషింపబడినవార లేతెంచి మాధవశర్మ నింటనున్న "సిరియాలదేవి" రాజపత్నిగా గుర్తించి మాధవశర్మను దండింపబోవ నాతడామె తన కూతురని చెప్పుచు బల్లహుని అనుచరులకామె చిక్కకుండ కాపాడుచుండ, బల్లహుని యాజ్ఞానుసారము "యెఱుకదేవ రాజు" మాధవశర్మ యింటనున్న రాజపత్ని యుదంతమొక ధూర్త బ్రాహ్మణుని వలన విని యామెను బంధించి తన కడకు రప్పించుకొనెను. అంత మాధవశర్మ బ్రాహ్మణ బృందమును వెంటనిడుకొని పోయి "యెఱుకదేవరాజు"కడ నామె తన కూతురుగా నిరూపించి యాతని పరీక్షకు నిల్చి "సిరియాలదేవి"ని తిరిగి తన గృహమునకు గొనితెచ్చి పోషింపుచుండెను.

అంత అనుమకొండలో నొక్కనాడు "సిరియాలదేవి" యొక శుభముహూర్తమున నొక మగశిశువును ప్రసవించెను. మాధవశర్మ ఆ శిశువునకు కులోచితముగ జాతకర్మాదికమ్ముల నాచరించి "సిరియాల దేవి కోరిక మేరకు నాతనికి "మాధవవర్మ" యను నామకరణ మొంచి క్షత్రియోచిత విద్యల గరపుచు కాలము పుచ్చుచుండెను.

మాధవవర్మ పెరిగి పెద్దవాడౌచున్నకొలది "పద్మాక్షీదేవి" యందు భక్తిగలవాడై ప్రతిదినము నామె గుడికిబోయి భక్తి శ్రద్ధలతో నామెను పూజించుచు నామె వరప్రసాదమున నిర్వక్ర పరాక్రమోపేతుడై వన్నె కెక్కుచుండెను. తల్లివలన తండ్రి కటక వల్లభుని వలన రణరంగమున ద్రెళ్లుట విని ప్రతీకారము నెరప నిశ్చ యించుకొని వీర్యవంతులు శౌర్యధనులునగు వారల పెక్కుర గూర్చు కొని అనుమకొండకేగి యందుండు "యెఱుక దేవరాజు" నింకొక ప్రదేశమునకు బోనాజ్ఞాపించి అనుమకొండ నాక్రమించుకొని, ఉత్క లముపై దండెత్తిపోయి, కటకవల్లభుని ససైన్యముగ నోడించి, చంపి రాజధాని నగ్నికీలల దహించి కటక పురాధీశుని కొమరునకు పట్టముగట్టి విజయగర్వముతో ననుమకొండ కేతెంచి తల్లి దీవెనల, గురుదేవు నాశీర్వాదముల పొంది దుర్మార్గుల శిక్షింపుచు ప్రజాపాలన మొనరించుచుండెను.

ఈ మాధవవర్మయే విష్ణుకుండిన వంశ మూలపురుషుడని ఆ వంశీయులు చెప్పుకొనుట ప్రారంభించిరి. ఈ పై కథనము చాళుక్య విష్ణువర్ధనుని కథకు సారూప్యము వహించుచున్నది. ఇందలి సత్యా సత్యము లెట్లున్నను విష్ణుకుండిన వంశములో ప్రథమగణ్యునిగా మాధవవర్మ నృపతిని పేర్కొనుట జరుగుచున్నది. విష్ణువర్ధనుని పుట్టు పూర్వోత్తరములు సాహిత్యపరముగా వెలుగు చూచినట్లు చారిత్రకముగా గుర్తింపబడలేదు.

ఈ మాధవవర్మ రాజ్యాభిషిక్తుడయిన కాలము సోమదేవ రాజీయమునందు కూచిమంచి జగ్గకవిచే చెప్పబడినది. విజయార్కుడు, ఉత్తుంగభుజుడునందుడు రాజగుట - నందపుర నిర్మాణము - మృగ శాపనిహతివల్ల విజయపాలుడు పిచ్చిఖాడగుట-జ్ఞానానందునివల్ల తెలివి వచ్చుట - అగ్నివర్ణ, వృషసేనుల రాజ్యవిభాగము - మంత్రకూట, కంధారపు రాజ్యములు, - ఇట్టి గాథలేవో కొన్ని కొన్ని చెప్పి సోమ దేవుని యుద్ధయాత్రలో సిరియాలదేవి అంతర్వత్నికము-మాధవశర్మ శిష్యునిగా మాధవవర్మ మహోదయము...... ఇవి కూచిమంచి జగ్గకవిచే చెప్పబడిన సందర్భములో

సీ॥ శాలివాహన ఘన శకవత్సరములు x x x
మునుకొని మున్నూట ముప్పది మూడు సా
దారణ నామ సంవత్సరమునందు
మాఘసితపక్ష పంచమీ మఘవమంత్రి
వాసరమ్మున శ్రవణాఖ్య బరగు
తారగోరి సింహాసనంబెక్కె
కొఱతలేని శివి చెలయంగ
మాధవదేవనృపుడు x x x x x x

అని స్పష్టీకరింపబడినది.

దీనినిబట్టి మాధవవర్మ రాజ్యారంభ కాలము క్రీ॥శ॥ 411 అని పలుకవచ్చును.

ఇట్లు చాళుక్య విష్ణుకుండిన వంశోత్పత్తి ఒకదానికొకటి దీటుగా నడచి కూటస్థుల నిర్దేశించి చెప్పుటలో ననేక వ్యత్యాసముల నుగ్గడించి వారికి చారిత్రక గుర్తింపు లేకుండజేసి పశ్చిమ చాళుక్యులకు జయ సింహుడు, తూర్పు చాళుక్యులకు కుబ్జ విష్ణువర్ధనుడు విష్ణుకుండిన వంశజులకు మాధవవర్మ నృపతియని చెప్పి కోనల విజయాదిత్యుని, దేవవర్మాదులను మరుగునపడజేసిరి. వారలు చారిత్రకముగా పరిగణనకు నోచుకొనలేరైరి. అటులనే శాసనముద్వారా విష్ణుకుండిన వంశస్థాపకునిగా పేర్కొనబడిన గోవిందవర్మ (చైతన్యపురి గోవింద రాజవిహార ప్రాకృత శాసనము)కు కూడ యిదే గతి పట్టినది. ఇది శోచనీయము.

వారి వంశావళిలో నొక గోవిందవర్మ (విక్రమాశ్రయ బిరుదాంకితుడు) యున్నాడుగాని అతని కాలము క్రీ॥శ॥ 540-546 కాని క్రీ॥శ॥ 360-400 మధ్యకాలమున విష్ణుకుండిన వంశ మూల పురుషునిగా పేర్కొనబడిన విష్ణుకుండిన గోవిందవర్మ ప్రశంస చారిత్రకముగా వినబడుటలేదు. కాని విష్ణుకుండినులు గుప్త-వాకాటక సంబంధములవలన క్రీస్తుశకము 4, 5 శతాబ్దులలో తెలంగాణ ప్రాంతమున రాజ్యముచేసి క్రమశః దక్షిణ కళింగము ఆ వెన్క వేంగీరాజ్యము నాక్రమించి పాలించినట్లు తెలియవచ్చుచుండుటచే 4వ శతాబ్దిలోనున్న గోవిందవర్మ తెలంగాణముపై పాలనము నెరపి ఈ విహారమును కట్టించి శాసనము వేయించెను అని తలంపవచ్చును. అయితే వేంగీపాలకులుగా కీర్తి తెచ్చుకొన్న విష్ణుకుండీయుల పూర్వులు తెలంగాణములో రాజ్యము చేసిన వృత్తాంతములేమియు చరిత్ర కెక్కియుండలేదు. దీనిని భావి పరిశోధనమున వెలువరింప వలసిన అవసరమెంతేని కలదు. అపుడుగాని విష్ణుకుండిన వంశావళి పూర్ణ స్వరూపము గోచరము కాదు

క్రీ॥శ॥ 360-400 మధ్యనున్న గోవిందవర్మ విష్ణుకుండిన వంశస్థాపకునిగా పేర్కొనబడినందున దానిని ప్రాతిపదికగా దీసికొని విష్ణుకుండిన వంశావళి రూపుదిద్దిన ఈ క్రిందివిధముగ నుండనగును.




మాధవవర్మ3 పరిపాలనా కాలమున పశ్చిమ చాళుక్య పులకేశి2 వేంగిపై కెత్తివచ్చి క్రీ॥శ॥ 611వ సంవత్సరమున కొల్లేరు కోటవద్ద పరాజితుచేసి వధించి వేంగీభూమిపై చాళుక్యపతాకము నెగురువైచెను. ఈ వంశావళిలో కోసల విజయాదిత్యునితో దక్షిణాపథమున కేతెంచిన దేవవర్మ ఆతని సుతుడు బుద్ధవర్మ, ఆతని కుమారుడు ధర్మవర్మ, ఈతని కుమారులు బుద్ధవర్మ, దేవవర్మలు ప్రసక్తి వినరాక బుద్ధవర్మ సుతుడు మాధవవర్మ1 (పూసపాటి రాచిరాజకృత వాశిష్ఠభప్పన్నము) అనుటచే గోవిందరాజు వంశస్థాపకునిగ చెప్పిన విషయము అబద్ధమగుచున్నది. కాని గోవిందరాజు వంశస్థాపకుడని శాసన సాక్ష్యాధారమున్నది. ఈ విధిని మొదటి మాధవవర్మ తండ్రి బుద్ధరాజా? గోవిందరాజా? అన్న హంశము తేలవలసియున్నది. పులి మీద పుట్రవలె స్థానిక చరిత్రమునుబట్టి రచింపబడిన సోమదేవ రాజీయములో మొదటి మాధవవర్మ తండ్రి సోమదేవ రాజగుచున్నాడు. స్థానిక చరిత్రములోని వక్కాణమును త్రోసిపుచ్చినను వాశిష్ఠ భప్పన్నము బట్టి ఆతడు బుద్ధరాజగుచున్నాడు. గోవిందరాజ విహార ప్రాకృత శాసనముబట్టి గోవిందరాజగుచున్నాడు ఇందేది సత్యము? ఏదసత్యము?

---

# విమర్శకుడు

## శ్రీ కె. గోదావరి శర్మ

విమర్శకుడిగా విఖ్యాతుడతడు.
విలువలకు విశేషంగా విలువనిస్తాడు.
ఓర్పుతో శాస్త్రాలు అధ్యయనం చేసి
తీర్పు లివ్వడంలో నేర్పు గడించాడు.
సాహిత్యారణ్యంలో అరి వీర భయంకరుడు.
విమర్శ బాణాలు సంధిస్తే గురి తప్పని వీరుడు.
విలువ లేని వస్తువు ఉండ వీలు లేదంటాడు.
సందేశ మివ్వని సాహిత్య మేమి టంటాడు.
ప్రకృతి సిద్ధమైనవాటిలో పస లేదంటాడు.
మానవుడి భావాలే మహనీయా లంటాడు.
చెట్టునీ పిట్టనీ కొట్టి కొట్టి చంపుతాడు.
వాటిలోని సత్యాల్ని వెలికితీసి పంచుతాడు.
కన్నీరు వస్తే గ్రంధులేవో కారణమంటాడు.
ఎదలోని బాధకు ఏదో శాస్త్ర చర్చ చేస్తాడు.
పద్యాల్లోని పదచిత్రాల్ని పట్టి పల్లారుస్తాడు.
అమూర్త భావాలుంటేనే క్షమించగలడు.
కొన్నాళ్ళకి కవిత్వంలో మూర్తులన్నీ మరణిస్తాయి.
పూలూ పిట్టలూ లేని లోకంలో మెదళ్లు మిగులుతాయి.
కాని పాటలూ పరిమళాలూ పగబడతాయి.
వాటి స్మృతులు పురివిప్పి నిద్ర చెడగొడతాయి.
మన విమర్శకుడు మతిచెడి, మాటలు దక్కి,
శాస్త్రాలు చంకన పెట్టుకు పోతాడు.

# కలగూరగంప

## జీరో బేస్డ్ బడ్జెట్ విధానము

కేంద్ర ప్రభుత్వము 1987–88 ఆర్థిక సంవత్సరము నుండి జీరో బేస్డ్ బడ్జెట్ (జడ్. బి. బి) ప్రవేశపెట్టడానికి ముమ్మరంగా ప్రయత్నాలు సాగుతున్నట్లు ఆర్థిక మంత్రిత్వశాఖ వ్యయ విభాగము కార్యదర్శి ఆర్. ఆర్. గుప్త 17–1–1987 న పత్రికా విలేకర్ల సమావేశములో తెలియజేశారు. ఇందుకు కావలసిన నిధులు పూర్తిగా సమకూర్చవలసిన అవసరమున్న పథకాలను గుర్తించి, ప్రాధాన్యం లేని పథకాల నిధులను యితర రంగాలకు మళ్ళించే విషయమై ఒక సమీక్ష జరిగినట్లు, ఆర్థిక మంత్రిదృష్టి వ్యయం'వైపు మళ్ళించడం యిదే ప్రథమం అని అతడు తెలియజేశాడు. పథకాలను యెవరి కోసం రూపొందిస్తున్నారో ఆ ప్రజలు వాటినుండి పూర్తి ప్రయోజనం పొందగలిగే విధంగా ఈ రకమైన బడ్జెట్‌లో అన్ని కార్యక్రమాలను నిశితంగా పర్యవేక్షిస్తారని, అనేక పథకాలు ప్రారంభించి వాటికి చాలీచాలని నిధులు కేటాయించేబదులు కొన్నింటిని రద్దుచేసి, అవసరమనుకున్న వాటికి నిధులు కేటాయించడానికి అవకాశం కల్పిస్తుందని అన్నారు.

ఏడవ పంచవర్ష ప్రణాళికలో ఆర్థిక వ్యవహారాల నిర్వహణ జయప్రదంగా కొనసాగడానికి, ప్రభుత్వ ఖర్చులను అదుపులో పెట్టడానికి చేసిన సూచనలలో ఖర్చుల నిశిత పరిశీలన ఒకటి. అందుకు ప్రభుత్వం జడ్. బి. బి. చేపట్టాలనేది ఒక సూచన. ఈ సూచనను కేంద్ర ప్రభుత్వ మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్‌వంటి కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు 1987–88 వ సంవత్సరం నుంచి అవలంబించాలని నిశ్చయించాయి.

జడ్. బి. బి. ని శూన్య ప్రాతిపధిక లేక "ఆవృత్త ఆదాయ వ్యయ గణాంక పద్ధతి" లేక పునరారంభ విత్తవిధానమని అందురు.

ఈ జడ్. బి. బి, విధానం వలన ప్రతిశాఖ లేక ప్రతి కార్యక్రమం తనయొక్క వనరుల కేటాయింపులను ప్రతి సంవత్సరము, ఆ శాఖ ఆ సంవత్సరమే క్రొత్తగా స్థాపిస్తున్నట్లుగా పరిగణలోనికి తీసుకొని విలువకట్టవలసి వుంటుంది. ప్రస్తుత విధులనే వేరేపద్ధతుల ద్వారా నిర్వర్తించడంలోగల వ్యయాలను గణించి ప్రతిసంవత్సరము తులనాత్మక పరిశీలన చేస్తారు. ఈ విధంగా పోల్చి ఏపద్ధతిద్వారా చౌకగా నిర్వర్తించ వచ్చునో వాటినే చేపట్టుదురు. కనుక ఏ కార్యక్రమం అయినా ప్రతి సంవత్సరము యింతకుముందు ఆ కార్యక్రమానికి నిధుల కేటాయింపు లేదనుకొని నూతనంగా పరిశీలిస్తుంది. అంటే ప్రతి కార్యక్రమం యింతకు ముందు ఆధారం లేదనుకొని పరిశీలిస్తుంది. కనుక ఈ సంకేతాన్ని జడ్. బి. బి. అని నామకరణం చేశారు.

బడ్జెట్ కేటాయింపు నిర్ధారణ (జుడిసియన్స్)లో స్థూలంగా రెండు తెగలుగా విభజింపవచ్చును. గణించె వీలుగల కార్యకలాపాలైన క్రయ విక్రయాలు, ఉత్పత్తి మున్నగునవి, వీటిని గణించే వీలు గలదు. కనుక వాటియొక్క పురోగతిని కూడా అంచనా వేయవచ్చు కనుక వీటికి బడ్జెటింగ్ తయారు చేయడం కూడా సులభం. కాని లీగల్ సెల్, పరిశోధన అభివృద్ధి సంస్థలు, మార్కెటింగ్ సర్వీసుల వంటి కార్యకలాపాల పురోగతిని గణించడానికి వీలులేదు. కనుక యిటువంటి గణించడానికి వీలులేని కార్యకలాపాలకు వనరులను కేటాయించడంలో సమస్య యెదురవుతుంది. ఈ సమస్యను తొలగించి, సమర్ధవంతమైన బడ్జెటింగ్‌ను రూపొందించడానికి 1964లో ఫైరీగారు చేసిన ప్రయత్నమే ఈ జడ్. బి. బి. విధానము.

ఈ భావనను ప్రప్రధమంగా 1970లో టెక్సాస్ ఇన్స్ట్రుమెంట్స్ అనె ప్రైవేటు కార్పొరేషన్‌కు ఆచార్య పీటర్. ఏ ఫైర్ ప్రతిపాదించినాడు. దీని అమలువల్ల అక్కడ మంచి ఫలితాలు ఒనగూరినాయి. ఈ అనుభవం దృష్ట్యా దీనిని ప్రభుత్వ బడ్జెటింగ్‌లో అమలు జరిపిన గణత మాజీ అమెరికా అధ్యక్షుడైన జిమ్మి కార్టర్‌కు దక్కింది. ఆచార్య ఫైర్ వ్యాసం ఆధారంగా జిమ్మికార్టర్ 1976లో జార్జియా రాష్ట్రములో ప్రవేశపెట్టడంవల్ల ప్రభుత్వ పరిపాలనా వ్యయంలో దాదాపు సగం తగ్గించి, యే మాత్రం పన్నులు పెంచకుండా ప్రభుత్వ సేవలను గణనీయంగా అభివృద్ధి పరిచాడు. ఈ విధానం వలన వివిధ పథకాలకు ప్రాధాన్యతలను నిర్ధారించుటకు మరియు అవసరమైన విధానాలను తొలగించుటకు అమెరికా గవర్నర్‌కు అవకాశ మేర్పడింది.

సాంప్రదాయ బడ్జెటింగ్ విధానంలో గత సంవత్సరపు వ్యయం ఆధారంగా అందులోనుండి కొంత పెంచడం (ఇన్‌క్రిమెంట్) అనే సిద్ధాంతంలో అనేక వ్యవస్థలలో బడ్జెట్‌ను రూపొందిస్తారు. ఒకవేళ 1987–88 బడ్జెట్‌ను అంచనా వేయడానికి, ప్రణాళిక చేయడానికి 1986–87 సంవత్సరపు బడ్జెట్ ఆధారంగా తయారు చేస్తారు. అనగా 1986–87 సంవత్సరం కంటే కొంత ఎక్కువ నిధులను 1987–88 సంవత్సరంలో ఆ శాఖకు కేటాయిస్తారు. ఉదాహరణకు

1986 బడ్జెట్‌లో ఒక పథకానికి 2 మిలియన్ రూపాయలు కేటాయించినట్లయితే 1987 బడ్జెట్‌లో 10 శాతం ఎక్కువగా అంచనావేసి 2.2. మిలియన్ రూపాయలుగా ప్రతిపాదించవచ్చు. కాని జడ్. బి. బి విధానంలో కేవలం 10 శాతము పెంచడమనే విధానం కాకుండా బడ్జెటింగ్ నిర్వాహకులు ఆ పథకంలోని ప్రతికార్యకలాపాలను వివిధ ప్రత్యామ్నాయ మార్గాలతో పోల్చి క్రిందిస్థాయినుండి నిర్ధారించి తయారు చేయడం జరుగుతుంది.

ఈ జడ్. బి. బి. విధానం చాలామందికి క్రొత్తగా కనిపిస్తుంది కాని ఆండర్ సన్ గారి ప్రకారం ఈ విధానం హేతుబద్ధమైన చారిత్రక ప్రణాళిక మరియు బడ్జెటింగ్ సాంకేతిక క్రమబద్ధమైనది. ఇది సాంప్రదాయక బడ్జెటింగ్ విధానానికి ప్రత్యామ్నాయం కాదు. కాని వాటియొక్క ప్రమేయాలను విమర్శనాత్మకంగా ఒక క్రమ పద్ధతిలో పరిశీలించి పరిగణన చేసే మెరుగైన విధానము."

సాంప్రదాయ బడ్జెటింగ్ విధానంలో వివిధ సంస్థల పనితీరును పరిశీలించినట్లయితే ప్రణాళికా మరియు యాజమాన్య నియంత్రణా విధానాలను బడ్జెటింగ్‌ను తీవ్రంగా తీసుకోలేదని ద్యోతకమవుతుంది. అంతేకాక నిర్వాహణ వ్యవహారాల వైపు సరియైన దృష్టిని మళ్ళించలేదు. ఈ విధంగా నిర్వహణా వ్యవహారాలన్నియు నిర్లక్ష్యం చేయడం వల్ల బడ్జెట్ తయారు చేయడానికి ప్లానింగ్, మానిటరింగ్, మరియు ఎవాల్యుయేషన్ (పిఎమ్ఇ) వంటి తక్కువ నిర్వహణా సిబ్బందికి అప్పగించారు. వీరు గత సంవత్సర వ్యయాన్ని ఆధారంగా సంప్రదాయ బడ్జెటింగ్ పద్ధతిని అనుసరించి తయారు చేసేవారు. ఈ విధమైన బడ్జెట్‌లో సాధారణంగా అప్ గ్రాడెడ్ బడ్జెట్స్‌ను తయారు చేసి సమర్పించేవారు. అందువల్ల గత కొన్ని సంవత్సరాలనుండి ఈ విధమైన బడ్జెటింగ్ విధానం వల్ల అత్యవసరం కాని పథకాలు కార్యకలాపాల అమలుకే నిధులు కేటాయించడం వలన అత్యవసరమైన అత్యధిక ప్రాధాన్యత గల పథకాలకు నిధుల కొరతవలన నిర్లక్ష్యానికి గురియైనాయి. పైవిధమైన లోపాలను తొలగించి బడ్జెటింగు విధానంలో విప్లవాత్మకమైన మార్పులను జడ్. బి. బి. విధానం ద్వారా తీసుకరావచ్చును.

ఈ జడ్. బి. బి. విధానంలో నిర్వహణాధికారి తనశాఖ కార్యక్రమము యొక్క బడ్జెట్ విజ్ఞాపన (రిక్వెస్టు)ను పూర్తిగా నిర్ధారించ వలసి వుంటుంది. ఇంకోవిధంగా చెప్పాలంటే బడ్జెటింగు నిర్వహణాధికారి అన్ని కార్యకలాపాలకు ముందుగా నిర్ణయాల యూనిట్లుగా పరిగణించాలి. ప్రతి నిర్ణయ యూనిట్‌కు ప్రత్యేక నిర్ణయాల ప్యాకేజిని తయారు చేయాలి. ఈ నిర్ణయాల ప్యాకేజిలో ఆ కార్యక్రమం పథకముయొక్క ఆశయాలు, వ్యూహాలు, ప్రణాళిక పూర్తికావడానికి పట్టేకాలము, ఖర్చు, యిదే ప్రాజెక్టును వేరేమార్గాల ద్వారా తక్కువ ఖర్చుతో పూర్తిచేయడానికి గల అవకాశం, ఈ పథకంవల్ల కలిగే ప్రయోజనాలు, ఉద్యోగవకాశాలు మున్నగువాటితో తులనాత్మకంగా పరిశీలిస్తూ నిర్ణయాల ప్యాకేజీలను గుర్తించి వాటిని ఒక క్రమపద్ధతిలో వివరించి, వాటియొక్క ప్రాధాన్యతల ఆధారంగా అన్నింటికి ర్యాంకింగు చేయవలసి వుంటుంది. కనుక నిర్ణయాల ప్యాకేజి అనేది జడ్. బి. బి. కి హృదయం వంటిది. ప్రతినిర్ణయాల ప్యాకేజి వివిధ కార్యకలాపాలతో సేవలతో విభజింపబడి వుంటుంది. ఇందులో ఏదైతే తక్కువ నిధులతో ప్రస్తుత సంవత్సరం కంటే 10 + 20% తక్కువతో అత్యధిక ప్రాధాన్యతగల రంగానికి ప్రథమ ప్యాకేజీగా ఎంపిక చేస్తారు. ఈ విధంగా తయారుచేసిన నిర్ణయాల ప్యాకేజీలను అవరోహణ (డిసకన్‌డింగ్) ప్రాధాన్యతలలో నిర్వాహకులు ర్యాంకింగు చేయాలి. బడ్జెటింగు నిర్వాహకులు వాటితోనుండి అత్యధిక ప్రాధాన్యతగల నిర్ణయాల ప్యాకేజిని ఎంపిక చేసుకొని మిగతా వాటిని తిరస్కరించడం జరుగుతుంది.

ఈ విధంగా ప్రతి కార్యక్రమంలోను అత్యధిక ప్రాధాన్యత గల నిర్ణయాల ప్యాకేజీలనే ఎంపిక చేసుకోవడం ద్వారా ప్రతిశాఖ యొక్క బడ్జెట్ కిందస్థాయినుండి కూలంకుషంగా చర్చించి హేతుబద్ధంగా నిర్ణయాలు తీసుకొనే అవకాశం వుంటుంది. అత్యధిక సేవల డిపార్టుమెంట్లలో వాటివల్ల ఒనగూరే లాభాలను ఖచ్చితంగా కొలపరికరాలతో గణించడానికి వీలులేని రంగాలకు వివిధ పరికల్పనలను (మల్‌టిపిల్ క్రిటోరియా) ఉపయోగించి బడ్జెట్‌ను తయారు చేయవలెను. జడ్. బి. బి. వలన చేకూరే లాభాలను క్రింది విధంగా పేర్కొనవచ్చు.

1) బడ్జెట్ తయారు చేసే విధానంలో, ముఖ్యంగా వాటియొక్క ఆశయాల వివరణ, బృహత్ ప్రణాళిక, పాత క్రొత్త కార్యకలాపాల నిర్వాహణలో వ్యయ సమర్ధతను క్షుణ్ణంగా పరిశీలించి గుర్తించవలసి వుంటుంది. కాబట్టి మన ప్రణాళికా లక్ష్యాలైన వృద్ధి, ఆర్థిక స్వయం సమృద్ధత మరియు సాంఘిక న్యాయం అనే సిద్ధాంతాలకు ఈ విధానం చాలా ఉపయోగపడుతుంది.

2) పథకం యొక్క ఆశయాలను నెరవేర్చడానికిగల ప్రత్యామ్నాయ విధానాల తులనాత్మక పరిశీలనద్వారా సమర్థవంతమైన విధానాన్ని చేపట్టే అవకాశం కల్పిస్తుంది.

3) బడ్జెట్‌కు సంబంధించిన ప్రతినిర్ణయాలను, విజ్ఞాపనలను వాటియొక్క సాపేక్ష ప్రాధాన్యతల సమాచార మంతయు అన్ని స్థాయిలలో నిర్వాహకులకు యివి అందిస్తుంది.

4) వ్యయస్థాయి మారినపుడు ఈ విధానం ద్వారా ఒకశాఖ గత సంవత్సరపు బడ్జెట్‌ను మళ్ళీ కేటాయించారు. అంటే దీనిలో

నిర్ణయాల ప్యాకేజీని కలుపడానికి, తీసివేయడానికి బడ్జెట్ నిర్వహ ణాధికారులకు అవకాశం కల్పిస్తుంది.

5) క్రొత్తగావున్న వనరులను యెక్కువ ప్రాధాన్యతగల అత్యవసరమైన పథకాలనే కేటాయించడానికి నిర్వాహకులకు దీని వలన కలుగుతుంది.

6) వాణిజ్య వ్యవహారాలలో పరిపాలనను యెక్కువ సమర్థ వంతంగా, ప్రభావ వంతంగా పని చేయడానికి నిర్వాహకులను బలాత్కారి స్తుంది.

7) మొత్తం ఆశయాల ఆధారంగా వివిధశాఖల మధ్య సమన్వయం, సమీకృతం, సంతులనం చేయడానికి సహాయపడు తుంది.

7) వివిధ నిర్వాహకుల, సబార్డినేట్స్ మధ్య సహసంబంధాలు, పరిస్పరవగాహనను రూపొందించి వారిమధ్య సంబంధాలను పెంచడం ద్వారా బడ్జెటింగులో గుణాత్మకమైన మార్పులు చేయడానికి వీలు కల్పిస్తుంది.

9) నిధులను కేటాయించినపుడు పథకాలను క్షుణ్ణంగా పరీక్షించి నిర్ణయాలు తీసుకుంటున్నందున లాభావశ్యకత మరియు వ్యయ సమర్థతను పెంపొందిస్తుంది.

10) గత కాలంలో ఒక కార్యక్రమము అత్యవసరమైనచో దానికి ఒకశాఖను యేర్పాటు చేసి ఆదేశాఖ భవిష్యత్తులో అంత అత్యవసరం కాదనుకున్నపుడు ఆశాఖకు నిధులను తగ్గించే విధానము సాంప్రదాయ బడ్జెటింగు విధానంలో లేదు. ఈ లోపాన్ని జడ్. బి. బి. ద్వారా తొలగించవచ్చును.

జీరో బేస్డ్ బడ్జెట్ విధానం వలన ఈ క్రింద నష్టాలు గలవు

1) జడ్. బి. బి విధానంలో బడ్జెట్‌ను తయారుచేయడానికి సమయం ఎక్కువ తీసుకున్నట్లయితే వాటియొక్క ఫలితాలు నిరర్థక మౌతాయి

2) ప్యాకేజీలో, ర్యాంకులను రూపొందించడంలోను నిధుల కేటాయింపులోగల సవాళ్ళను ఎదుర్కొనడంలోను ఈ ఆలోచన ఎక్కువ ప్రభావం చూపలేదు.

3) దీనియొక్క ఫలితము ఎక్కువగా అంచనా వేసిన వాటిపై మరియు నిర్వహణా నిర్ధారణపై యెక్కువగా ఆధారపడి వుంటుంది. నిర్వహణా నిర్ధారణ యెక్కువగా వ్యక్తిగత భావాలపైన ఆధారపడి ఉంటుంది. కాబట్టి వారియొక్క సరియైన నిర్ణయాలు నిర్వహణా తీర్పుపై ఆధారపడి వుంటుంది.

4) ఈ నూతన పద్ధతి నిధుల పంపిణీలో సార్థకత లోపిం చిందనే అపప్రథ కూడా కలదు.

ఈ జడ్ బి. బి. విధానాన్ని మొదటిసారిగా అమెరికాలో ప్రవేశపెట్టినట్లు పై పరిశీలనవలన తెలియుచున్నది. అమెరికాలో వివిధ ప్రయివేటు సంస్థలతో ఈ విధానాన్ని ప్రవేశపెట్టడం వలన తమయొక్క సంస్థలో సమర్థత, అధిక లాభాలు ఒనగూరినట్లుగా తెలియజేశాయి. కాని ప్రభుత్వ శాఖలలో ఈవిధానం ఆశించినంతగా ఫలితాలను సాధించ లేదు. దీనికి గల ముఖ్యకారణము ఈ నివేదిక లను తయారు చేసే నిర్వహణాధికారులు తమకు యిష్టమైన పథకా లకు అత్యధిక ప్రాధాన్యత యివ్వడము, నివేదికలను సరియైన సమయములో తయారు చేయక పోవడమును సరియైన సమయములో సమర్పించినా వాటిపై సత్వర చర్య కొరవడడమువంటి పక్షపాత ధోరణిని వహించడమేనని అనేక పరిశీలనలు వ్యక్త పరిచాయి.

చివరగా ఈ జడ్ బి బి. విధానం మనదేశంలో సఫలీకృతము కావలయునంటే ఈ విధాన నిర్వాహకులు వివిధ కార్యకలాపాల ప్రాధాన్యతల ప్యాకేజీలను తయారు చేయునపుడు మనదేశ ప్రణాళికా లక్ష్యాలైన హెచ్చువృద్ధి రేటు, సంపూర్ణోద్యోగిత, వినియోగము, ఆదాయము, సంపదలలో ఉండే అసమానతలు తొలగింపడం, ద్రవ్యో ల్బణ రహిత వృద్ధి, సాంఘికన్యాయాన్ని కల్పించేటట్లు చూడడము వంటి వాటికి తోడ్పడేవిగా వుంటూ ఆర్థిక పురోభివృద్ధి జరగగలదని ఆశిద్దాము

— శ్రీ పి. సంజీవరెడ్డి

# మన పురాతన పత్రాలు

గ్రంథ విజ్ఞానంలో బాగా సంపన్నమైన శాఖలలో పురాతన పత్రాలశాఖ ఎన్నదగినది. దీన్నే ఇటీవలి కాలంలో అభిలేఖన విజ్ఞానం (ఆర్కైవ్స్) అంటున్నారు. గ్రంథాలయాలు ఏర్పడక పూర్వమే ప్రభుత్వ యంత్రాంగంలో పాతరికార్డులు భద్రపరచే విభాగం కొన్ని వందల సంవత్సరాలుగా ఉంటూ వచ్చింది. కాలం గడుస్తున్న కొలది ఈ విభాగ అవసరం పెరుగుతూ ఉంది.

ఏవి పురాతన పత్రాలు?

కేవలం పత్రం పాతదైనంత మాత్రాన దాని విలువ పెరుగుతుందా? పాతదనాన్ని బట్టి విలువ ఉంటుందా? అనేది ఒక సమస్య. పత్రాల విలువ పాతదనాన్నిబట్టి రాదు. దాని ఉపయోగాన్నిబట్టి వస్తుంది. అందుగల విషయ విశిష్టతను బట్టి వస్తుంది. అమెరికన్ గ్రంథాలయ సంఘం తయారు చేసిన పరిభాషలో - పురాతన పత్రం అంటే - రికార్డుకోసం భద్రపరచబడి, న్యాయబద్ధమైన హక్కుల రక్షణ కోసం దాచబడిన - ప్రభుత్వానికి, సంస్థలకు, కుటుంబాలకు, వ్యక్తులకు సంబంధించిన పత్రాలని నిర్వచనం చేయబడింది. ఎల్. యం. హెరాడ్ తన గ్రంథాలయ శాస్త్ర పరిభాషలో పురాతన పత్రాలంటే పౌర వ్యవహారాలకు సంబంధించిన పత్రాలు, లేదా చారిత్రక విలువ కలిగిన పత్రాలు, గుర్తించబడినచోట భద్రపరచేవని చెప్పారు. ఏమైనా పత్రాలు భద్రపరచడానికి ముందు వీటినుంచి ఒక ప్రయోజనం ఆశించబడుతూండడం గమనార్హం. ఈ అభిప్రాయాన్ని మరికొంత బలపరుస్తూ "పరిశోధనా ప్రయోజనార్థం యోగ్యమై ఉండి, పబ్లిక్ లేక ప్రయివేటు సంస్థలలో శాశ్వతంగా భద్రపరచడానికి నిర్ణయించినవి. పురాతన పత్రాలను పదిలపరచే సంస్థలలో భద్రపరచే నిమిత్తం ఎన్నిక చేసిన పత్రాలు - పురాతన పత్రాలు (ఆర్కైవ్స్) కోవకు చెందుతాయని" షెల్లన్ బర్గ్ యిచ్చిన నిర్వచనం కూడ వాస్తవం కనిపిస్తుంది. ఏ నిర్వచనం చూచినా భద్రపరచ బడిన పత్రానికి ఒక ప్రయోజనం విధిగా ఉండాలన్నదే నగ్న సత్యంగా గమనించవలసి ఉంది.

రెండు రకాలు :

పురాతన పత్రాల విలువ రెండు తీరులుగా ఉంటుంది. 1) ప్రభుత్వ పత్రాలు. వీటిన్నే పబ్లిక్ ఆర్కైవ్స్ లేదా స్టేట్ ఆర్కైవ్స్ అంటారు. ఇందు ప్రభుత్వం, స్థానిక సంస్థలు, ప్రభుత్వాధ్వర్యంలో గల ఇతర సంస్థలకు వ్యవహారాలకు సంబంధించి భావి తరాల అన్వయానికి వినియోగపడే మూలపత్రాలు, ఇతర పత్రాలు ఉంటాయి. 2) ప్రయివేటు పత్రాలు దీన్నే ప్రయివేట్ ఆర్కైవ్స్ అంటారు. ఇందు వ్యక్తులు నిర్వహించే వ్యాపార సంస్థలు, పరిశ్రమలు, సంస్థలు, కుటుంబాల తాలూకు వ్యవహారాలు, లావాదేవీల తాలూకు శాశ్వత విలువగల పత్రాలు ఈకోవకు చెందుతాయి. ఐతే మనదేశంలో ప్రయివేటు ఆర్కైవ్స్ నిర్వహించగల స్తోమత నేడు ఏ కుటుంబానికి, సంస్థకు, సంఘానికీ లేదు. గనుక రెండు విభాగాలూ - ప్రభుత్వాధ్వర్యంలో గల స్టేట్ ఆర్కైవ్స్‌లోనే నిర్వహించబడుతున్నాయి.

స్థూల రూపాలు :

పురాతన పత్రాలంటే కేవలం పత్రాలే కాదు. అవి ప్రభుత్వాన్ని బట్టి కాలాన్నిబట్టి అనేక భౌతిక రూపాల్లో ఉంటాయి.

1) పత్రాలు - ఇది రాగి, బంగారు రేకులు, తాటి ఆకు, గుడ్డ, కాగితం - ఏదైనా కావచ్చు. ఐతే అది రాయడానికి వీలుగా ఉండాలి.
2) చిత్రపటాలు, రేఖా చిత్రాలు, ఛాయా చిత్రాలు.
3) దేశపటాలు, ప్లానులు.
4) రాత ప్రతులు, ముద్రిత గ్రంథాలు.
5) మైక్రో ఫిల్ములు, మైక్రోకార్డులు, మైక్రోఫిచ్‌లు
6) గ్రామఫోన్ రికార్డులు, చలన చిత్రాలు.

ఈ చివరి అంశానికి సంబంధించి - భారత ప్రభుత్వం. నేషనల్ ఫిల్మ్ ఆర్కైవ్స్‌ను 1964 లోపులో స్థాపించింది.

పైన వివరించిన వాటి తాలూకు భౌతిక స్వరూపం ఎలా వున్నా - భవిష్యత్ అన్వయానికి పరిశోధనకు వినియోగించేవి మాత్రమే భద్రపరచడానికి ఎన్నిక చేస్తారని గమనించాలి.

ఇహ ప్రయివేటు యాజమాన్యంలో గల పురాతన పత్రాలకు ప్రత్యేక ప్రతిపత్తి ఉంది. చిరకాలంగా మనదేశంలో భూస్వామ్య విధానం, జమిందారీ పెత్తనాలు, జాగీర్దారీ జమానాలు వర్ధిల్లాయి. వీరివద్దగల పత్రాలు ఈనాటికీ పూర్తిగా ఒకచోటకు చేర్చలేదు. చేర్చితే ఉండే ప్రయోజనం అపారం. ఇంతేకాదు ప్రవాసాంధ్రులవద్ద, మననుంచి విడిపోయిన ప్రాంతాలలో మనతాలూకు ప్రాచీన పత్రాలు అపారంగా ఉన్నట్లు తేలింది.

ఈ సందర్భంలో జరిపిన పరిశీలనలో ప్రయివేటు యాజమాన్యంలో ఈ దిగువ ఉదహరించిన పత్రాలు ఉండవచ్చని తెలుస్తోంది.

1. ఇస్తే సాహేద్ — సాక్ష్యం తీసుకోవడం
2. తకిడీ — ఉత్తర్వు
3. నియాహ — చిట్టా
4. హుకుమ్‌నామా — తీర్పు

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన ఆముదము




శుద్ధి చేసినది, వాసన లేనిది.

5. సనత్ — రాజముద్రికా లిఖిత పత్రం
6. పర్వానా — రాజాజ్ఞ
7. యదాస్త — విన్నపం

ఇవిగాక మెమోలు, ఫైళ్ళు, న్యాయవిచారణ పత్రాలు, యోగ్యతా పత్రాలు, బాండ్లు, అగ్రిమెంట్లు, లేఖలు, డైరీలు, జీవిత, చరిత్రలు, మొదలైనవి.

## ప్రయోజనం ఏమిటి ?

పురాతన పత్రాలు - పాత చింతకాయ పచ్చడే కదా - అని తేలిక మాటలతో కొట్టిపారవేయరాదు. వాస్తవానికి పురాతన పత్రాలు పాత బంగారంతో సమానం - ప్రాచీన పత్రాలు కొందరు పరిశోధకుల దృష్టిలో, ఈ రంగంలో కృషిచేసిన పాలా కృష్ణమూర్తిగారు ప్రభుత్వ పురాతన పత్రాల ప్రయోజనాన్ని యిలా వివరించారు.

1 ప్రభుత్వ పురాతన పత్రాలు గతంలో జరిగిన గణనీయమైన ముఖ్య నిర్ణయాలను ప్రభుత్వ దృష్టికి తెస్తాయి;

2. మన న్యాయ వ్యవస్థకు పునాదులుగా నిలుస్తాయి.

3. మన సాంఘిక, ఆర్థిక విధుల నిర్మాణంలో తోడ్పడతాయి.

4. చారిత్రక, పరిశోధనా పునాదులకు బలమైన పునాదులౌతాయి.

5. ప్రభుత్వ పాలనా యంత్రాంగానికి కావలసినపుడు అవసరమైన సమాచారం అందిస్తూ ఉంటాయి.

ఇహ ప్రయివేటు పురాతన పత్ర సంపదను ప్రయోజనాలను గురించి ఆర్కైవల్ లెజిస్లేటివ్ సంఘం యిలా వివరించింది.

1. ఒకదేశ చరిత్రను నిర్వివాదాంశంగానూ, నిష్పాక్షికంగానూ, చెప్పడానికి ప్రభుత్వశాఖల రికార్డుల కంటే గొప్ప గొప్ప కుటుంబాల మూలపత్రాలు, ప్రయివేటు సంస్థల మూల పత్రాలు ఎక్కువగా ఉపకరిస్తాయి.

2. అవి ప్రభుత్వ లావాదేవీలలో మరుగుపడిన అంశాలపై దృష్టి సారించి, దేశంలో క్లిష్ట సమస్యలు ఏర్పడినప్పుడు ప్రభుత్వాల పాత్ర వెలుగులోకి తీసుకువస్తాయి.

3. దేశంలో ఆర్థిక, సాంఘిక అంశాల చరిత్ర ఎలా జరిగిందీ యివి తెలుపుతాయి.

4. మరుగుపడిన అంశాలను వెలుగు జరిచేందుకు, వదలివేసిన అంశాలను కలిపేందుకు, ప్రభుత్వ ఆధారకు అనుబంధంగా ప్రయివేటు పురాతన పత్రాల ఉపయోగం పరిశోధకులు మరింతగా గుర్తిస్తున్నారు.

పురాతన పత్ర భద్రత, వినియోగ విషయంలో భారత ప్రమాణాల సంస్థ (ఇండియన్ స్టాండర్డ్సు ఇన్‌స్టిట్యూషన్) ఎందు చేతనో దృష్టి చూపలేదు. బ్రిటీషు ప్రమాణాల సంస్థ 4971 సంఖ్యలో పురాతన పత్ర భద్రత, వినియోగ విషయంలో ప్రమాణాలను చేసింది

## మన పురాతన పత్ర సంపద :

చిరకాలంగా సంపన్నమైన చరిత్ర, సంస్కృతిగల ఆంధ్ర ప్రదేశ్‌లో పురాతన పత్ర సంపదకు తక్కువ లేదు. దీన్ని భద్ర పరచి ఉపయోగంలోకి తేవడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పూనుకొని ప్రత్యేకంగా హైదరాబాదులో పురాతన పత్ర నిలయాన్ని స్థాపించింది. దీన్ని ఆంధ్రప్రదేశ్ అభిలేఖనా నిలయం (స్టేట్ ఆర్కైవ్స్) అంటారు. ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించి పురాతన పత్రాల సేకరణ, భద్రత వినియోగ విషయంలో ఈ నిలయంలో కృషి జరుగుతుంది. ఈ నిలయానికి వాల్తేరు ఆంధ్ర విశ్వవిద్యాలయం గ్రంథాలయంలోనూ, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఆవరణలోనూ ప్రాంతీయ కార్యాలయాలు పని చేస్తున్నాయి.

## ప్రాచీన పత్రాలు :

మన అభిలేఖనా నిలయంలో ఈదిగువ ఉదహరించిన పత్రాలు భద్రపరచారు.

1. మొగలాయి చక్రవర్తులైన షాజహాను, ఔరంగజేబుల పరిపాలనా కాలం నాటి పత్రాలు.

2. దక్కన్ సుల్తానులైన బహమనీ, ఆదిల్‌షాహ, కుతుబ్ షాహ పరిపాలకుల పత్రాలు.

3. నైజాము ప్రభుత్వ పత్రాలు.

4. పూర్వపు హైదరాబాదు, ఉమ్మడి మద్రాసు, ఆంధ్రరాష్ట్రాల పత్రాలు.

5. 18వ శతాబ్దారంభంలో సర్వేయర్ జనరల్‌గా ఉన్న మెకంజీ సేకరించిన కైఫీయత్తులు, ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ సేకరించి,

సంస్కరించిన అతి విలువైన తెలుగు లిఖిత గ్రంథాలు, శాసనాలు, మైక్రో ఫిల్ములు.

4. బ్రౌన్ నియామకపు ఉత్తర్వులు, న్యాయాధికారిగా ఆయిన యిచ్చిన తీర్పులు, ఇంకా బ్రౌన్‌ను గురించి అనేక విషయాలను తెలిపే మూల పత్రాలు.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఏర్పడ్డాక పరిపాలనా యంత్రాంగానికి సంబంధించిన పత్రాలు - అనగా ప్రభుత్వ ఉత్తర్వులు, ప్రభుత్వ శాఖల పత్రాలు, నివేదికలు, రాజపత్రాలు, సర్వేరికార్డులు, భూమి కొలతల పుస్తకాలు, రాష్ట్రంలోని విధానసభ, శాసనమండలి, పార్లమెంటరీ, పట్టభద్రుల నియోజక వర్గాలకు చెందిన ఓటర్ల జాబితాలు మొదలైనవి. ఇవన్నీ నేడు పరిశీలకులకోసం మన ఆంధ్ర ప్రదేశ్ అభిలేఖనా నిలయంలో లభ్యమౌతున్నాయి

కొన్ని తరుగులు :

ఐనప్పటికీ మన అభిలేఖనా నిలయంలో కొన్ని తరుగులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఈ లోటు పూరిస్తే తప్ప నిలయోద్దేశ్యం సఫలవంతం కాదు. ముఖ్యంగా ఈ నిలయంలో

1. 1920 తరువాతి పత్రాలను మాత్రం తమిళనాడు అభిలేఖనా నిలయం మనకు అప్పగించింది. 1857 - 1920 వరకు గల అమూల్యమైన పత్రాలు నేటికీ అప్పగించలేదని తెలుస్తుంది.

2. పోలీసు చర్య తర్వాత రెసిడెన్సీకి సంబంధించిన పురాతన పత్రాలన్నిటినీ ఢిల్లీలోని నేషనల్ ఆర్కైవ్స్‌కు తరలించారు. కనుక నిజాం రాష్ట్రంలో బ్రిటీషువాళ్ళు అడుగుపెట్టిన నాటినుంచీ వాళ్ళు మనదేశం వదిలేవరకుగల పురాతన పత్రాలు మాత్రం మన అభిలేఖనా నిలయంలో దొరకవు.

3. ఒకప్పుడు అవిభక్త మద్రాసు రాష్ట్రంలోని జిల్లాలైన గంజాం, బళ్ళారి మొదలైన వాటి సమాచారం ఇచట లభించదు, అటు ఒరిస్సా, ఇటు కర్నాటకలకు పోవాల్సిందే.

4. 1911లో ఏర్పడిన చిత్తూరు జిల్లా పూర్వ సమాచారం ఉత్తర ఆర్కాటు జిల్లాకు సంబంధించిన పత్రాలలో ఉంది. అవింకా మద్రాసులో ఉన్నాయి.

5. మన రాష్ట్రానికి సంబంధించి చాల సమాచారం వ్యక్తులకు సంబంధించిన పత్రాలు (ఉదా. సర్. సి. ఆర్. రెడ్డి) కొన్ని ఢిల్లీలోని నేషనల్ ఆర్కైవ్స్‌లో ఉన్నాయి.

6. ఇవిగాక లండన్‌లోని ఇండియా ఆఫీస్ లైబ్రరీలోనూ, మరికొన్ని ఇతర సంస్థలు ఈస్టిండియా కంపెనీ పరిపాలన, బ్రిటీషువారి పరిపాలనకు సంబంధించిన పత్రాలు ఉన్నట్లు తెలుస్తుంది.

అన్నీ ఒక దరికి చేర్చితేగాని వాటి ప్రయోజనాన్ని పూర్తిగా పొందలేము. ఆ మంచిరోజులు త్వరలో వస్తాయని ఆశిద్దాం.

ఆంధ్రప్రదేశ్ అభిలేఖనా నిలయంలో పరిశోధనా విభాగం ఉంది ఈ విభాగం పరిశోధనకు ప్రోత్సహిస్తుంది. ఆంధ్రప్రదేశ్ పాలనా వ్యవహారాలు, చరిత్రనూ, సంస్కృతిపై ఇందు వేలసంఖ్యలో పురాతన పత్రాలు ఉన్నాయి. భద్రతకు సంబంధించిన నియమాల ననుసరించి యీ పత్రాలు పరిశోధకులకు యివ్వబడు తుంటాయి. పత్రాలు యిచ్చిపుచ్చుకోవడంలో ఇబ్బందున్నా వాటి భద్రత దృష్ట్యా ఒక విధానాన్ని అనుసరించక తప్పదు.

నేటి అవసరం :

ప్రాచీన పత్రాల నేటి అవసరాన్ని గురించి పాలా కృష్ణమూర్తి గారు యిలా వివరిస్తున్నారు.

"నేటి ప్రజాస్వామ్యంలో ప్రభుత్వంతోపాటు ప్రభుత్వాధికారులు కూడ పురాతన పత్రాలద్వారా ప్రజలకు జవాబుదారీ అవుతున్నాయి. పురాతన పత్రాలు పాలకుల పనిముట్లు, అనేకానేక సంస్థల చిహ్నాలు మన అనుభవానికి మూర్తీభవించిన గుర్తులు. న్యాయ హక్కుల పరిరక్షణాలు, చరిత్రకారులకు ముఖ్య ఆధారాలు." ఈ విధంగా నేడు మనకు లభ్యమౌతున్న ప్రభుత్వపరమైన పురాతన పత్రాలు, ప్రయివేటు పురాతన పత్రాలు సమన్వయపరచి పరిశోధనలో వినియోగించుకుంటే అనేక కొత్త విషయాలు బయల్పడ గలవు. క్లిష్ట సమస్యలకు పరిష్కారమార్గాలు లభించగలవు. మూజువాణీ అవగాహనకు స్పష్టత చేకూరగలదు. కనుక యింత విలువైన పత్రాలను కాపాడి, సద్వినియోగం చేసుకోవలసి ఉంది.

— డాక్టర్ వెలగా వెంకటప్పయ్య

# ఒక విజ్ఞాపనము

సాహిత్య విమర్శకాగ్రేసరులైన శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారి రచనలలో నేకదేశమైనను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి వారిచే ముద్రిత ప్రకాశితమై రసజ్ఞ సాహిత్యకులకు తీర్థభూతముగా

వెలయుచున్నది. కాని దానిలో 'పుష్పాంజలి' అను శీర్షికమెయి లీలావతీ కావ్య విమర్శనమున కవిగారు తత్కథాగతములైన యసంభావ్య విషయములను వర్ణించుచు వ్రాసినది యిట్లు కలదు:

"దీనినే మేము సప్తపదీ విలాసమను షడ్దర్శనీగర్భిత హాస్య ప్రబంధమున సంస్కృతకవి వర్ణనమున నిట్లు లిఖించితిమి:

సీ॥ పద్మావతీదేవి పడకింటఁ గలఁ గాంచి
వాసవదత్తకై భాసుఁ డేడ్చె
నూతేండ్ల కగ్నిలో దూఱి శూద్రకరాజు
చిత్తమెల్ల వసంతసేన కిచ్చె
జానకీ హరణంబు జగము మెచ్చఁగఁ జేసి
రావణుఁ దన్నె లంకావిభుండు
భిక్షాటనము చేసి బృందారక స్త్రీల
శివభక్తదాసుఁడు చెలులఁ బట్టె

గీ॥ పందికొక్కు వోలెఁ బాతాళమును ద్రవ్వెఁ
బరిమళుఁడు కళ్ళప్రభాగవేశ
సప్తపదుల నేడుసారులు ద్రొక్కించు
తరుణి కొసఁగినాఁడ ధర్మకవిత." [పుట ]

అను ఆ యీ పద్యరత్నము నుదాహరించి కవిగారు:

"...ప్రాకృతకావ్య విమర్శన మహాగహనానుయాయి పాఠక మహాశయులకు విశ్రాంతి కావ్యముగానో లేక, నాటకరంగము నడుమ నసంబద్ధ ప్రలాపమున విదూషకుండుం బోలె, స్వోత్కర్ష డిండిమ తాడనంబుననో, మనః శ్రోత్రాయసకరముగా మా పద్య ముదాహరించినందులకు..."

క్షమింపుడని సహజ వినమ్రతాద్యోతముగ పాఠకులను వేడినారు. కవిగారి యీ సప్తపదీ విలాసమును గూర్చి సంపాదకులు (కీ॥శే॥ నిడదవోలు వేంకటరావుగారు) పీఠికాభాగమున వ్రాయుట మఱచిపోయినారు. మృగ్యమగు నీ గ్రంథము లభ్యమగుచో నాంధ్రభారతి కనిదం పూర్వ భాషావిశేషము కాదగుననుటకు సందేహము లేదు. దీనితో పాటు శ్రీ కవిగారి రచనల ద్వితీయ భాగము నచ్చొత్తించుట యవశ్య కర్తవ్యమై యున్నది. ఈ రెండు గ్రంథములకు ననుబంధముగా కవిగా రుదాహరించిన సర్వగ్రంథముల, ప్రయోగముల యకారాదిసూచికను జేర్చుటయు వాఙ్మయ పరిశోధకుల కమిత ప్రయోజనము కాగలదు.

విజ్ఞులగు తెలుగు విశ్వవిద్యాలయ కార్యనిర్వాహకులీ విషయమును గుఱుతింతురు గాతమని విజ్ఞాపనము.

—ఏల్చూరి మురళీధరరావు
న్యూఢిల్లీ



## కోలెస్టరాళ్లు కాదు - కాలేయరాళ్లు

భారతి (ఆగస్టు 88) సంచికలో "ఉత్తరాల్కాహాలీయం"లో రచయిత పైత్యపు కోలెస్టరాల్‌తో తయారయిన రాళ్ల గనుక "గాల్ స్టోన్సు"లను "కోలెస్టరాళ్లు" అన్వొచ్చా అని అడిగినారు.

అనరాదు అంటాను. గ్రీకు భాషలో "కోల్" అంటే పైత్యరసం అని అర్థం, ఈ "కోల్" పదం "కాలేయ" పదం సమానం. భాషాశాస్త్రరీత్యా ఏకమూల (కోగ్నేట్) శబ్దాలు. "గాల్‌స్టోను"లలో "బైలిరుబిన్"వంటి రసాయనాలు కూడా వుంటాయి కావున కేవలం కోలెస్టరాల్‌కే పట్టం కట్టుట న్యాయం కాదు. కాలేయరసంలో పుట్టిన "గాల్‌స్టోను" అనే గట్టి రాయివంటి పెడ్డలను "కాలేయరాళ్లు" అనుటే సమంజసమని నా అభిప్రాయం.

—"బెర్జీలియస్"

# గ్రంథ విమర్శ

## శ్రీనాథుడు యుగకర్త కాదా?

[పిల్లలమర్రి పినవీరభద్రకవి కావ్యానుశీలనము : ప్రతులకు శ్రీమతి లలితమ్మ, వైఫ్ ఆఫ్ డాక్టర్ ఇరిగేపల్లి ముద్దప్ప, 11/229, సాయినగర్, అనంతపురం-515 001, వెల. రూ. 60/-]

"నేటివరకూ ఆంధ్ర వాఙ్మయ చరిత్రకారులు శ్రీనాథ శకమును ప్రస్తావించి, యటు పిమ్మట రాయల శకము, ప్రబంధశకమని విస్తారముగా వ్రాసినారు. కాని శ్రీనాథుని కొక శకముండెనా అని సందేహము కలుగుచున్నది. ఆతని శైలి ఆతని గ్రంథములతోనే పోయినది. శ్రీనాథుని తరువాత వచ్చినవారు. వారిలో ఆంధ్రకవితా పితామహుడు అల్లసాని పెద్దన యాద్యుడు. అంతవానికి మార్గదర్శకు లెవరు? శ్రీనాథుడు మాత్రము అట్టి మార్గదర్శకుడు కాడు. అందు స్వాతంత్ర్యము వహించినను ముప్పేసమూతని రచనలు అనువాదములే. పూర్వకథను గ్రహించి, అనువాదముగాక పెంచి, కల్పించి, చేర్చి, తగ్గించి తనకు తోచినట్లు నూతన కావ్యము (రచనము) గా శ్రీనాథుడు వ్రాయలేదు. అటువంటి మార్గదర్శకుడు పిల్లలమర్రి పినవీరభద్రకవి."

ఇవి "పిల్లలమర్రి పినవీరభద్రకవి కావ్యానుశీలనము" అను అంశముపై పరిశోధనా వ్యాసమును సమర్పించి శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము నుండి పి హెచ్.డి. పట్టాను పొందిన డాక్టర్ ఇరిగేపల్లి ముద్దప్పగారి పలుకులు (పుట 81).

ఆయన యింకా యిలా అన్నారు "పినవీరభద్రుడు రచించిన జైమిని భారతము అనువాదమే యైనను సృజనాత్మక రచనాధోరణిలో పడినది. మరి యీతని శృంగార శాకుంతలము నూతన మార్గదర్శకము. 'శృంగారి' యని నిందపొందిన శ్రీనాథుడు కూడ ఇట్టి రచన చేయలేదు....కాబట్టి ఈ కాలము శ్రీనాథుని శకమనుటకన్న అల్లసాని పెద్దనాదుల వరకూ పినవీరభద్రుని శకమనట తగునేమో!" (పుటలు 81-82).

ఈమాటలతో శ్రీ ముద్దప్పగారు "విప్లవాత్మక"మగు ప్రతిపాదన చేసినట్లున్నది. దీనితో ఆయన పెద్దప్రశ్న లేవనెత్తినారు. అది శ్రీనాథ శకమా? పినవీరన శకమా? ఏది సముచితమన్నది ప్రశ్న!

శ్రీనాథ ఘన ఘనాఘనార్భటిచేత ఆంధ్ర సాహిత్య క్షేత్రము నిండ పులకలు నిండినవి. ఆయన పద్య నిర్మాణధారలు నదులై ఆ క్షేత్రమున రాజనాలు పండించినవి. తదనంతర కవులు ఆ మహా ప్రవాహము నుండి పంటకాలువలను తీసి పడించుకొనిరి.

నిజమే! మహాప్రతిభుడైన పినవీరనకు ఆంధ్ర సాహిత్యమున రాదగిన స్థానము రాలేదు ఒకవంక శ్రీనాథ మేఘగర్జనలు, మరొకవంక తటిల్లతవంటి జక్కన కవితల సరసన పినవీరన కవిత ఇంద్రచాపమువలె విరిసినది.

"ఒక్క శ్రీనాథుని తప్ప జక్కన పినవీరనలను ఆధునికులు సమగ్రముగా గుర్తించలేదు. కనుక వారికివ్వవలసిన స్థానమివ్వక అప్రధానులైన కవులుగా పరిగణింపసాగిరి. కాని ప్రబంధకవులను చూచినచో పూర్వము జక్కన పినవీరనల స్థానము ఇప్పటివలె కాదని విశదమగును... వారి మహాకవులెవరని లెక్కవేసినచో నన్నయాది కవిత్రయము, శ్రీనాథాది కవిత్రయము, మరి ఒకరిద్దరు మాత్రమే ఉందురు. ఆ దృష్టితో జక్కన, పినవీరనల విలువను మనము నిర్ణయింపవలెను" అని సాహిత్య కౌముది గ్రంథములో మహాకవి శేషేంద్ర అన్నారు.

ఇదే సందర్భములో శేషేంద్ర చెప్పిన కొన్నిమాటలను శ్రీ ముద్దప్పగారు తన పరిశోధనా వ్యాసంలో ఉటంకించారు.

"..శృంగార శాకుంతలము తెలుగులో ఉదయించిన తొలి కావ్యము. అనగా వస్తువు. నేత, రసము ఇత్యాది కావ్యలక్షణములతో నిలుచునది." అంటూ మరికొన్ని శేషేంద్ర వాక్యాలను ఆయన ఉదహరించారు. కానీ యీ వాక్యాలకు ముందు శేషేంద్ర యిలా వ్రాశారు "శృంగార నైషధము అనువాదమాత్రమైనను తెలుగున ఆలంకారిక ప్రమాణ విధేయమైన తొలి కావ్యముగా వెలసినది. దాని చేతనే తెలుగున కావ్యరచనా స్పృహ పరిపక్వమైనదని అనుకొనవలెను" తరువాత శ్రీముద్దప్ప ఉదహరించిన పైవాక్యము పిమ్మట శేషేంద్ర యిలా అన్నారు. "దీనిని (శృంగార శాకుంతలమును) పరిశీలించిన వారికి ఇది శృంగార నైషధమును చూచి బయలుదేరినదని తెలియును. పినవీరభద్రుని కవితలో శ్రీనాథుని ఛాయ లెన్నియో కలవు. కొన్ని శ్రీనాథుని సమాసములను. పదబంధములను, పద్య నిర్మాణ ధోరణులను ఈతడు గైకొనెను" శ్రీ ముద్దప్పగారు శేషేంద్ర చెప్పిన వానిలో తనకు అనుకూలమైన వానిని స్వీకరించినారు. అస్తు!

ఆంధ్ర సాహిత్యము నొక దురదృష్టరేఖ నిరంతరముగా వెంటాడుచున్నది. తమకునచ్చిన కవిని గద్దె నెక్కించుటకు మరొకని పడలాగు మహాకృషియందు బహుశః ఆంధ్రులదే పెద్దపీట. నన్నెచోడుని వ్యవహారమునుండి నేటివరకూ యిది అవిచ్ఛిన్నముగా సాగుచున్నది.

"శ్రీనాథుని శైలి అతని గ్రంథములతోనే పోయినది" అని శ్రీముద్దప్ప చేసిన తీర్మానము అవిచారితమూలకమని చెప్పకతప్పదు. పైగా పెద్దన ప్రసక్తి తెచ్చి "అంతటివానికి మార్గదర్శకులు ఎవరు? శ్రీనాథుడు మాత్రము అట్టి మార్గదర్శకుడు కాడు" అని ఆయన సిద్ధాంతీకరించినారు. తనకు తోచినట్లు నూతన కావ్యము(రచనము)గా శ్రీనాథుడు వ్రాయలేదని, అట్టిపద్ధతికి పినవీరన గురువని శ్రీముద్దప్ప సిద్ధాంతము మంచిది!

పెద్దనగారి మనుచరిత్రకు మూలము సంస్కృత మార్కండేయ పురాణము. దానికి మారన అనువాదమునూ వున్నది. వానిలోని ప్రవరునికి, పెద్దనగారి ప్రవరునకు నింగికీ, నేలకూ వున్నంత భేదమున్నది.

సంస్కృత మూలమున ప్రవరుడు (ఆపేరు దానిలో లేదు) వరూధినిని "మూఢే" అని మాత్రమే అంటాడు. "పరస్త్రియం నాభిలషేదితి త్యూచుర్గురవోమమ, తేన త్వాం నాభివాంఛామి కామం విలపశుష్యవా" అని బోధిస్తాడు. మారనగారి ప్రవరుడు "పరవనితా రతి కీడని, గురు లెఱిగింతురటుగాన కోమలి మదినా, కురతి జనింపదు నీదెస, నిరతము నాదెస భజింపునీవును విరతిన్" అంటాడు. ఇక పెద్దనగారి ప్రవరుని "ఈ పాండిత్యము నీకుదక్క మరి యెందే గంటిమే! కామశాస్త్రోపాధ్యాయిని నావచించెదవు"వంటి వొడుపు మాటలు మనకు ఆనందజనకములే అయిననూ మూలమునందలి ప్రవరునికి మచ్చ తెచ్చునవే. ఇట్టి "నూతన రచనము" చేయలేదనియా శ్రీనాథుడు మార్గదర్శకుడు కాకపోయినది? పినవీరనయైనది?

ఇక శ్రీనాథుని ప్రభావాన్ని పరిశీలిస్తే పెద్దనగారి మనుచరిత్ర మొట్టమొదటి పద్యం శృంగార నైషధములోని మొదటి పద్యానికి భ్రాంతి చేర్పుమాత్రమే. శ్రీనాథుని "శ్రీరామా కుచమండలీ మృగమద శ్రీగంధ సంవాసిత, స్ఫారోదార భుజాంతరుండు, ధరణీ సంశ్లేష సంభావనా పారీణుండు" అనే సమాసాలను "శ్రీవక్షోజకురంగ నాభ మెదపై జెన్నొంద విశ్వంభరా దేవిం దత్కమలాసమీపమున ప్రీతిన్నిల్పినాడోయనంగా...... "వలె మార్చి తన పద్యముగా "భ్రాంతి కల్పించినాడు.

పెద్దనపై పినవీరన ప్రభావాన్ని చూపటానికి శ్రీముద్దప్ప యీ క్రింది పద్యాన్ని చూపారు. "జననీ స్తన్యము గ్రోలుచుం" (శృంగార శాకుంతలము 1-4) అనే పినవీరన పద్యం పెద్దనగారి "అంకముచేరి శైలతనయా స్తనదుగ్ధము లానువేళ" (మనుచరిత్ర 1-4) అనే పద్యానికి మూలం అని శ్రీముద్దప్ప చూపారు. 1972 జూన్ నెలలోనే ప్రచురితమైన సాహిత్య కౌముదిలో శేషేంద్ర కూడా యీ రెండు పద్యాలనే ఉదహరించారు. కాని వీరిద్దరూ శ్రీనాథుని పద్యాన్ని మరచారా? శృంగార నైషధంలోని వినాయకస్తుతిలోని "బాలకేళికళారాజత్కౌతుక రంజితోరగపతి ప్రాలంబు హేరంబునిన్" అంటాడు. ఈ సమాసమే పెద్దనలోని 'బాల్యం కవిచేష్ట'కు మూలం. శ్రీనాథ పినవీరనల పద్యాలను కలబోసి పెద్దపీటను కొట్టేస్తే శ్రీనాథుని సమాసమే వీరనకు మూలం.

శ్రీనాథుని శైలి అతడి గ్రంథాలతోనే పోయిందని చెప్పే ముందు శ్రీముద్దప్ప తనకు చిరపరిచితమైన శేషేంద్ర 'సాహిత్య కౌముది'ని మరింత శ్రద్ధగా చూసివుండవలసింది. శ్రీనాథుని శైలి పెద్దన, తెనాలి రామకృష్ణుడు, రామరాజ భూషణుడు వంటి కవులలో ఎలా చివురులు వేసిందో తెలిసేది. శ్రీముద్దప్పగారే పినవీరనపై శ్రీనాథుని ప్రభావాన్ని 323 నుండి 331వ పుటవరకూ విపులంగా వివరించారు. 174వ పుటలో "పినవీరన శ్రీనాథుని కవిత్వ సౌరభముల నాస్వాదించి తన కవితను హృద్యము గావించుకొనెను" అని అన్నారు. ఇన్నివిధముల శ్రీనాథుని మార్గదర్శనము, ప్రభావము పినవీరనతోసహా తరువాతి కవులపై వుండగా "శ్రీనాథుని కొక శత ముండెనా అని అనుమానము కలుగుచున్నది" అని శ్రీముద్దప్పగారు సంశయించుట నేటి సిద్ధాంత గ్రంథముల వైఖరి కాబోలు!

శ్రీముద్దప్ప తన గ్రంథములో పినవీరన శృంగార శాకుంతలము, జైమిని భారతము కావ్యాలను పరిశోధించారు. ఇలాటి పరిశోధనలలో సాధారణముగా కానవచ్చు మూలముతో తులనాత్మక పరిశీలనను, మార్పులు, చేర్పులు, కుదింపులు, హెచ్చింపులు, కూడికలు, తీసివేతల, ఛందస్సుల పట్టికలు వంటి వివరాలు వున్నాయి.

శృంగార శాకుంతలము గురించి వివరిస్తూ శ్రీముద్దప్ప కాళిదాస, పినవీరనకైతలను "తూచారు". కాళిదాసుని "యాస్యత్యద్య శకుంతలేతి ' అన్న శ్లోకానికి పినవీరన పద్యములు వాఖ్యా ప్రాయములని సిద్ధాంతీకరించారు. ఆ శ్లోకమిది—

"యాస్యత్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్ట ముత్కణ్ఠయా
కణ్ఠస్తమ్భిత బాష్పవృత్తి కలుషం చింతాజడం దర్శనమ్
వైక్లబ్యం మమతావదీదృశ మహో స్నేహాదరణ్యౌకసః
పీడ్యన్తే గృహిణః కథంను తనయా విశ్లేష దుఃఖైర్నవైః"

దీనికి పినవీరన పద్యములివి—

"పొమ్మన జూచు జూచి మదిబుట్టిన ప్రేమముపేర్మి బాష్పముల్
గ్రమ్మిన గ్రమ్మఱం బెడమొగంబయి కన్నులనీరు మ్రింగుచుం
గ్రమ్మఱ దాశకుంతల మొగంబగు సత్క్రియలు నించు గొంతసే
పమ్ముని జాలి బొంది ధృతియంతయు నిల్వక విచ్చి పాఱగన్"(4-84)

"ఎంచమునీంద్రులందు విజితేంద్రియుడైన తపస్వికూర్మిగా
పెంచి శకుంతలం బెనిచి విస్మృతి నొందిన మోహపాశముల్
త్రెంచుకొనంగలేక తియతీపుల జిత్తముగాసి వెట్టి శీ
లించిన నెవ్వడింక వదిలింపగ నోపెడు మోహబంధముల్" (4-85)

ఈ పద్యాలను ఉదహరించిన శ్రీ ముద్దప్ప "అనువాదమున కణ్వుని భావవిచేష్టితములు మిగుల హృదయంగమములై, ఆయా దశా విశేషములను ప్రత్యక్షీకరించుచున్నవి. శ్లోకమునకు ఈతని పద్యరచన వ్యాఖ్యాప్రాయమైనది" (పుట 161) అని అన్నారు.

కాళిదాసుని శ్లోకము కరుణరసమునకు పరాకాష్ఠ యని పరంపరయా వినవచ్చుమాట. కాని అది అంత సముచితమనిపించుట లేదు. కారణమిది - ఈ శ్లోకము కణ్వుడు స్వయముగా అనినది. దీనిలో శకుంతలా పయనవార్త తనలో కలిగించిన వేదనా దశలను విస్పష్టముగా ఆయన గుర్తించి ప్రకటించినాడు. దీనిని "వైక్లబ్యం" అని ఆయన ప్రకటించినాడు. కరుణమునకు స్థాయియైన శోకములో ఆయన కొట్టుకొనిపోవుటలేదు సాక్షిగా నిలిచినాడు. ఇదియంతయూ "వైక్లబ్యం" అనుటతోడనే వున్న వేదన విరిసిపోయినది. ఇక మిగిలినది అచ్చెరువు! "అరణ్యౌకసుడనైన నాకే యింత వేదన కలుగగా గృహస్థుల మాట చెప్పనేల? వారెట్లు భరింతురో?" అని అబ్బురపడినాడు. ఉత్కంఠ, బాష్పము, చింతవంటి దశలను గుర్తించి, 'వైక్లబ్యం' అనినవాడు శోకమునకు ఆలంబనమెట్లగును? కనుక యీ ప్రకారముగా పరిశీలించిన (ఆలంకారికా మర్యాదా విధేయముగా) పినవీరన పద్యములు కాళిదాసునకు వ్యాఖ్యాప్రాయములు కావు సరికదా కాళిదాసుని "ఋషిభావన" పొలిమేరల కైననూ చేరలేదు.

రసచర్చ వచ్చినది కనుక జైమిని భారతమునందలి రసమును గూర్చి శ్రీ ముద్దప్పగారు చేసిన "పరిశోధన"ను పరిశీలింతము. ఆయన పలుచోట్ల పలువిధములుగా చెప్పినారు. "జైమిని భారతము నందు రసము వీరము." (పుట 113) "జైమిని భారతమును కృష్ణ మాహాత్మ్యము లేక కృష్ణభక్తుల చరిత్ర అనవచ్చును. ఒకవిధముగా భాగవతమువంటిది" పుట (230) మొత్తముమీద కృష్ణపారమ్యమును చాటుట కవిహృదయమై యున్నది" పుట (235). "ప్రతి సమయ మందును కృష్ణసాహాయ్యముననో, కృష్ణనామ స్మరణముననో తనకు కలిగిన ఆపత్తులను అర్జునుడు తొలగించుకొనును. (ఈ వాక్యనిర్మాణము గమనింపదగినది.) ఇవియన్నియు అర్జునుని నిస్సహాయతను దైవానుగ్రహమును చాటుచున్నవి (పుట:241). "పినవీరన జైమిని భారతము భక్తికావ్యము" (పుట:242). "కావ్యము మొత్తమున రసనిర్ణయము కావించుట దుష్కరమగును. అందువలన ఆయా సన్నివేశములందు శృంగారాది రసస్పర్శ కలదని మాత్రము మనము సంతోషింపవచ్చును" (పుట:280). ఇవీ రసమునుగూర్చి శ్రీ ముద్దప్పగారి పలుకులు! ఇక పరిశోధనమేమి? నిర్ణయమేమి? సిద్ధాంతమేమి? "ఆయా సన్నివేశములందు శృంగారాది రసస్పర్శ కలదని మాత్రము సంతోషించుట"కు పరిశోధనలేల?

రసము సంగతి యిట్లుండ పినవీరన మంత్రశాస్త్ర వైదుష్య మును గూర్చి కూడ శ్రీ ముద్దప్పగారు "తడిమినారు". జైమిని భారతమునందలి నాలుగవ ఆశ్వాసమున 4-81వ పద్యమున 'సౌబరి' వర్ణన కలదు. సౌబరి "రుద్రాక్ష విభూతి వల్కల మృగాజిన శోభిత గాత్రుడు" - "శ్రీ మదష్టాక్షర మంత్రలబ్ధ మహిమాధికుడు"! ఈ అష్టాక్షరి "ఓం నమో నారాయణాయ" అను "నారాయణాష్టాక్షరి" యని శ్రీ ముద్దప్ప 221వ పుటలో తెలిపి "సౌబరి హరిహరాభేదోపాసకుడగునా? యనిపించును" అని అన్నారు.

తరువాత 223వ పుటలో "మంత్రశాస్త్ర వైదుష్యము" అను శీర్షిక క్రింద యిదే పద్యాన్ని ప్రస్తావిస్తూ పినవీరన ప్రసాద పంచాక్షరితో తృప్తిచెందక జైమిని భారతమున సౌబరి వర్ణనలో ప్రాసాదాష్టాక్షరిని గూడ చేర్చి తనకు గల మంత్రశాస్త్ర రహస్యజ్ఞతను ప్రకటించినాడు. సౌబరి శ్రీమదష్టాక్షర మంత్రలబ్ధ మహిమాధికుడు (జై. భా. 4-81) వేషము శైవమే యగును. "ఓం హ్రీం హ్రౌం నమశ్శివాయ" అనునది ప్రాసాదాష్టాక్షరిగా ఆమ్నాయ మందారమున పేర్కొనబడియున్నది. దీనినే సౌబరి జపించి సిద్ధినొందెను" అని శ్రీ ముద్దప్ప ప్రకటించారు. మరి 221వ పుటలో సౌబరి జపించిన నారాయణాష్టాక్షరి 223వ పుటకు వచ్చుసరికి శైవమంత్రమైన ప్రాసాదాష్టాక్షరిగా మారిపోవుటలోని "మంత్రశాస్త్ర రహస్యము" శ్రీ ముద్దప్పగారికే తెలియవలె!

ఇవియన్నియూ ప్రక్కకు నెట్టిన పినవీరన ఒక మణిపూస. ఆతనికి లభింపవలసిన స్థానము లభింపలేదనుట నిర్వివాదము. దానికి గాను యిటువంటి అనుశీలనములతో ఆతనికి పెద్దపీట వేయుటకు ఆతని గురువైన శ్రీనాథుని పడలాగవలసిన పనిలేదు. "ఈ యుగం నాదంటే నాదని" కాట్లాడుకునే ఖర్మ వారిద్దరికీ పట్టలేదు. మనమూ పట్టించనక్కరలేదు.

ఈ సిద్ధాంత వ్యాసానికి శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం పి.హెచ్.డి. పట్టాను ప్రదానం చేసింది. న్యాయనిర్ణేతలుగా ఆచార్యులు శ్రీ కులశేఖరరావు (ఉస్మానియా), శ్రీ బాడాల రామయ్య (బెంగుళూరు), శ్రీ ఎం. సుబ్బారెడ్డి (శ్రీ వేంకటేశ్వర) వ్యవహరించారు. బహు భాషాపరిచయంకల "డాక్టర్" ఇరిగేపల్లి ముద్దప్పగారు యు.జిసి. గ్రాంటుతో "తెలుగు కన్నడ జైమిని భారతాల తులనాత్మక పరిశీలన" కూడా చేసారు.

"జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తితేషాం యశఃకాయే జరామరణజం భయం"

—వల్లభాచార్య

# గృహలక్ష్మి స్వర్ణకంకణ గ్రహీతలైన కవయిత్రులు - వారి కావ్యాలు

[డా॥ జి. సుమిత్రాదేవి, ప్రతులకు: (1) ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్ రోడ్డు, హైదరాబాద్-1; (2) 'తిరుమల' 16-7-220 (పోస్టు సాహిపా) అజంపురా, హైదరాబాద్-24 వెల. రూ. 60.00]

మదరాసులో మైలాపూరులోనూ త్యాగరాయనగర్‌లోనూ కేసరి హైస్కూళ్ళు రెండు ఉన్నాయి. ఆ డాక్టర్ కె. ఎన్. కేసరి పేరుతో స్థాపించినవే అని తెలిసి ఎంతో సంతోషించాను. లోధ్ర (రసాయనం) స్త్రీలకు ఎంతో శ్రేయస్కరం - అలాటిదే ఆయన నెలకొల్పినది.

గృహలక్ష్మి. స్త్రీల జీవితాలకు సంబంధించిన విషయాలకు ఆదర్శమైన మాసపత్రిక. వాతా చేతా కూడా కేసరిగారు మహిళా క్షేమానికి త్యాగంచేసి చిరస్థాయియైన యశస్సు గడించారు. ఏటా ఒక మహిళకు - సాంఘికముగా గాని, సారస్వతముగా గానీ పేరుపొందిన స్త్రీకి - స్వర్ణ కంకణం నిండు సభలో సమ్మానరూపాన అందించేవారు. అలా గ్రహించినవారిలో కవయిత్రులుగా పేర్గాంచిన పన్నెండుగుర కాంతల సంగ్రహ జీవిత విషయమునూ రచనలనూ సమీక్షిస్తూ రూపొందించిన గ్రంథం ఇది.

ఉస్మానియా విశ్వవిద్యాలయంనుంచి పి.హెచ్.డి. పట్టం కాంక్షించి శ్రీమతి జి. సుమిత్రాదేవి పరిశోధనకి రూపం ఇది. ఆంధ్ర మహిళా సమాజానికి, విజ్ఞాన వికాస మణిదీపం అని ఒక్కమాటలో చెప్పవచ్చు.

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మతో ఆరంభించి శ్రీమతి నాయని కృష్ణకుమారి వరకు మొత్తం పన్నెండుగురు మహిళా కవయిత్రులు వారి వారి రచనలతో ఇందు ఇంపుగా నింపుగా కని పిస్తారు. వారి రచనలను సుమిత్రాదేవి పరిశీలించిన విధం సోదాహర ణంగా పరిశోధనాభరణంగా ఉన్నది. శ్రీమతి కృష్ణకుమారి సంప్ర దాయ సవ్యసాచియైన మా వేదనా వాసుదేవుని కూతురే. కాలప్రవాహం వల్ల ఆధునికతలో మార్పును చేపట్టి ఓర్పుగా కైతలల్లిన నేర్పరి అయింది....

ఈ గ్రంథమునందు అక్షర రూపాలలో కనిపించే మహిళామ తల్లులందరూ అందరే. వారికి వారే సాటి. ఏ ఒకరిద్దరో ప్రస్తుతం పరోక్షంగా ఉన్నా వాఙ్మయరంగంలో సుస్థిరమూర్తులే.

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ రెండు భాషల్లోనూ వైదుష్యం గల శ్రీమతి - అలాగే శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ. ఆ తండ్రి వాక్శక్తి ఊరక పోతుందా?

ఇలా అందరినీ చెప్పవలసి వస్తే నాకొక 'గౌరవపట్టం' ఇవ్వ దగిన సమీక్ష తయారవుతుంది.

రుక్మిణమ్మ కావ్యవిమర్శలో ఆ కవయిత్రి 'ఓంకార పంజర శుకీం' - అనే శ్లోకానికి చేసిన తెలుగు పద్యములో 'శుకము, పరభృ తము, మయూరము'-అనేకన్న స్త్రీలింగపదాలు ఉండడం సముచితం అనుకుంటాను.

దీనిలో కేసరిగారి జీవితచరిత్ర అవశ్యం పఠనీయం. అలాగే ప్రాచీన కాలంలో స్త్రీల ప్రతిపత్తిని గూర్చి సుమిత్రాదేవి ఇచ్చిన విషయం చాలామందికి తెలియదు.

ఇది స్త్రీలేకాక—పురుషులూ, విద్యార్థినీ విద్యార్థులూ చదవదగిన గ్రంథం.

ఈ గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయం సంఘటించిన తెలుగు విశ్వవిద్యాలయం అధికారుల సౌజన్యం సమ్మాన్యం..

—యామిజాల పద్మనాభస్వామి



Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press. Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247